దిచ్చరికం బేకావడిఁ, దెచ్చెను బతిచేయు మొక్కతెఱఁగెఱిఁగింతున్. 599

కసరెత్తి ముక్కుడుస్సిన, పసరమువలె రేఁగి పరుషభాషల నన్నున్
విసువక పగఁజాటుచుఁ బొ,మ్మసమున నన దండపాలుఁ డట్లొనరించెన్. 600

ఆరెకుఁ డట్లరుగుటయుఁ జ,కోరేక్షణఁ జూచి గోపకం దనుమహిళా
కారణ మేమీ తలవరి, కీయాపున నిస్నే మెఱసి యిం దరుదేరన్. 601

వచ్చుటయుఁ గాక నోరికి, వచ్చిన యిట్లేపురేఁగి పదరుచుఁ జూడ్కిన్
గ్రచ్చెగయఁ బోవుచున్నాఁ, డచ్చెరువిది తెలియఁజెప్పుమా నాకనుడున్. 602

తర్షణి మగని కిట్లనియె. 603

వెడవెడ నార్చుచుఁ బెటికిన, పిడిసాము ఏలకేలఁ గ్రాల బిఱబిఱవెంటం
బడి యాపోయెడుముద్దుం, గొడుకుం దెగఁజూచె నెందుకో నే నెఱుఁగన్. 604

తఱుముడువడి మేన్వడకం, బతిపతి యగుతాల్మిఁ జావు పఱువెత్తి యహో
వెఱపున నిలుసొచ్చినఁ గడు, పటిమఁ జేపెట్టి కలఁచినట్లయ్యెఁ బతీ. 605

అట్లు భయాతురుండై యిలుసొచ్చివచ్చిన నచ్చిఱుతవాని నతిస్థూలం బగు కుసూలంబునం దాఁచితి. 606

అప్పుడు కన్నులనిప్పులు, గుప్పతిలఁగఁ గెరలిపండ్లుగొఱుకుచువాఁడా
చొప్పునవచ్చి నన్నిటఁ, దప్పక వీక్షించి ప్రల్లదంబునఁబలికెన్. 607

ఎచ్చరిక సెఱిఁగి వెంటన, వచ్చితి నీయిల్లుసొచ్చె వాఁడులుకున నేఁ
డిచ్చట లేఁ డెందరిగెన్, దిచ్చటి నిక్కువముఁ జెప్పితే మేల్గాదే. 608

అనియదరవైచి నన్నడిగినవానిం జూచి మెత్తగిలఁ బడకంటిన్
నిను నెవ్వఁ డెఱుఁగు నెటుపో, యినవాఁడో నీకుమారు నెవ్వం డెఱుఁగున్. 609

తలవరివిగావె యూరం, గలకొంపలఁ జొచ్చి చూచి కనుగొందువు నీ
కుల ముద్ధరించుకొడుకుం, దలయెవ్వరిమీఁద నొత్తిగెదవు నీవనినన్. 61

ఇప్పు డప్పురుషభాషణంబులం బలుకుచుం బోవుచున్నాఁ డనిగాదె వెలువరించిన.

నిరవధికరాహుముఖగ, హ్వారనిర్గతశీతభాను, డనఁ గట్టెదురన్
బురరక్షకసుతుఁడుండన్, హరిణేక్షణ నెంతదానవని పతిపొగడెన్. 612

కార్యం బుత్పన్నంబైనఁ దర్షణివలెఁ బోలినతెఱంగుఁ జూచికొందమని ప్రత్యుత్పన్నమతి పలికిన యద్భవిష్యం డమ్మాట లాదరింపక యూరకుండె. ననాగతవిధాతయు నందు నిల్వ వెఱచి యల్పసలిలసరణంబున నొండొకసరసిజాకరణంబునకుం బోయె నాయెడ 613

కాఱుమొసళ్ళవాకట్టుమందులు చరణాంగుళీంబులఁ దాఁకుటుంగరములు
కడలేనినడగట్టి పడినపిక్కలు చుట్టి చెక్కినమొలత్రాళ్ళు చిక్కములును

జుంగులల్లాడుగోఁచులు తండుగోలల నెట్టుకొల్పినమీలపుట్టికలును
బ్రతిదినాందోళికాభృతినల్పులై పెంద్రుకలు నిండి కాయలు గలభుజములు

గీ. చెవులవెలుములుపలుబ్రాత చెవులనాగు, పడిగెపోగులు మెలిగొన్నపచ్చడము
నమరగుమిగూడి జాలరు లరుగుదెంచి, రలరుమొగములతోఁ బ్రాటివలలు గొను

ఉత్సాహ. వచ్చి తజ్జలస్థలం బవారణం గలంగి రాఁ
జొచ్చి జాలముల్విదుర్చుచోట యద్భవిష్యుఁడు
ల్కిచ్చలోనఁ గందళింపఁ నెందుఁ జొత్తునంచుమేక
ఱిచ్చపాటునొంద న త్తతిం జరించె నల్లడన్.

క. మున్నాడి యొడలు డాఁపక, యన్నీటను జచ్చి తేలినటువలెఁ బ్రత్యు
త్పన్నమతినీతిరతియుం, డెన్నిరుపమధీరతాపటిష్ఠుం డగుటన్.

క. జాలరులు దానిఁ జచ్చిన, వాలువగా నిశ్చయించి వలెననక సరి
త్కూలమునకుఁ ద్రోచి సము, ద్వేలగతిం దిక్కులంబు ప్రీలక్ష్లీలన్.

క. దుముకులు వైచుచు నాయా, సమయంబుల జలములెత్తి చల్లుచు వలల
శ్రమలీలవైవ నయగుణ, విముఖుఁడు దొలుదొలుత యద్భవిష్యుఁడు చిక్కె.

క. చిక్కిన లగుడంబునఁ దల, వ్రక్కలుగా మోఁది చంపి వైచిరి మఱియుం
బెక్కురుషంబులఁ బట్టిరి, యక్కొలసము మాని తనిసిరది సందగుటన్.

సీ. కైవర్తకశ్రేణి కనుబ్రామి యొకదొడ్డమనికి ప్రత్యుత్పన్నమతి వసించె
మతిబలంబున నసాగవిధాతయు నొందుకడకు బోవుటఁ జేటుఁ గానఁడయ్యె
విమతి గావున యద్భవిష్యుఁ డేమియు లేక పొలిసె జాలరులకు భుక్తియయ్యె
నతిమూర్ఖునకు నపాయము రాదె యిట్లని వరునకుఁ జెప్పి తావలము లేమి

గీ. నంబునిధితీరమునఁ గులాయం బమర్చి, కొని కలంగుచుఁ డిట్టిభి గ్రుడ్లఁబెట్టి
పొదిగె నేమలుపాటు లేకదనఁబదన, కలుచపడకుండ నొండొంటిఁ గలపికొను

క. టిట్టిభకాహంకృతికిం, గట్టల్క జనించి కడలికడ నొంఢొకచోఁ
బెట్టినగ్రుడ్ల హరించెం, బిట్టతి వీక్షించి టిట్టిభికగాఢార్తిన్.

చ. కనుఁగవ బాష్పవారి దొరుగ న్వరుఁ గన్గొని దూరి యప్పు డి
ట్లనియెఁ బయోధితోఁ గలహ మావిహగంబున కెంతలేదు పొ
మ్మనక చెనంటివై భవదహంకృతినమ్మి ప్రసూతివైతి ని
వ్వననిధితీరభూమినిదె వాఁడె హరించె మదండపిండముల్. 6

క. జలనిధి యుత్కృష్టంబని, తెలిసియు నీ వలఁతి వగుటఁ దెలిసియు బ్రజ్ఞా
బలముఁ దుదఁ జిదిమి యకటా, వలవంతంగంటి గౌరవము వీడ్కొంటిన్. 6

క. నీకతనఁ దనకు వాటిలె, నీకాఁటియ యనుచుఁ జిత్త మెరియంగా శో
కాకులమతిఁ బతిదూఱిన, నాకంతక్రోధవివశమై ఖగమనియెన్. 624

ఉ. ఇంతదురంతచింతదగునే నను నెవ్వనిఁగాఁ దలంచితో
యింతి మదీయశక్తియసుదేవసుదేవదురాసదంబు నేఁ
డింతకుఁ జొచ్చి వారినిధి యేపున మ్రుచ్చిలిగొన్నగ్రుడ్ల గ్ర
క్కింతు భవద్ఘనార్తిఁ దొలగింతు ధరింతు యశఃపరిష్క్రియన్. 625

చ. అని నిజదార నూఱడిలునట్లుగఁ బల్కి వయోవయోమణు
ల్దనుఁ గనుగల్గి కొల్వఁ జని తత్పతగాగ్రణి గాంచె ముందటన్
ఘనబలఘాతిహేతిభయకంపసమాగతమేనకాసుతా
వనకరణప్రహృష్టహిమవన్నగముద్రుఁ బయస్సముద్రునిన్. 626

వ. కని తత్పారావారతీరంబున. 627

సీ. తనతల్లి కెగ్గొనర్చినపాప రామాత కడుపునఁ గడిఁది చిచ్చిడినవాని
గజకచ్ఛపాహృతిగ్రాసచర్వణతృప్తి వెలుఁగొందు జాఠరానలమువాని
ముఖసరిద్విటమధ్యమున నసాధు నిషాదఘోరవాహిని నుంచుకొన్నవాని
లావుపెంపునఁ గులగ్రావపక్షచ్ఛేదినిశితాసి వేఁడి మానిచినవాని

గీ. నెల్లజగములు దనలోన నిముడుకొనిన, నిశిచరారంభసంరోధినిజశిరోధి
దివ్యమణిబోలెఁ దాల్చి వర్తించువానిఁ, బరమకారుణపూర్ణు సుపర్ణుఁ గనియె 628

క. కని మ్రొక్కి నిలువ వినతా, వనితాసమ్మదవిధాయి వచ్చినకార్యం
బనుచరముఖ్యా నాతో, ననురాగం బొప్పఁజెప్పుమా నా కనుడున్. 629

మ. పలికెం డిట్టిభ మోవిహంగకులదీపా కోప మేపార న
జ్జలధిగ్రామణి నీఘటుండనని నిచ్చ ల్మే ప్రశంసింపఁగా
సిలుగు ల్సేసిగణింప కేడ్తెఱ హరించె న్మత్ప్రియాండంబు ల
గ్గలమే దేవర కన్నసాగర మెఱుంగంజెప్పఁగాలావునన్. 630

క. కావున్న నింతగర్వం, బాకడలికి నెట్లుకలుగు నని టిట్టిభము
త్సేకత వినిపించిన రో, షాకులితస్వాంతుఁడై ఖగాధిపుఁ డనియెన్. 631

క. ఏమేమీ నాసుభట, గ్రామణినని నీవు పల్కఁగాఁ డిట్టిభశం
కాముగ్నుఁడు గా కబ్ధి, స్వామి మహోహామిక నిట్టివాఁ డయ్యెగదా. 632

ఉ. ధీరగరుత్సమీరణహతి న్సలిలంబులఁ జల్లి దృష్టదు
ష్టోరగకోటిజీవితము లూడ్చి తిమింగిలతద్గిలాదివా
శ్చారములం ఘనజ్జఠరజజ్వలనార్చులవ్రేల్చి వార్ధిని
స్సారముఁజేసి గ్రమ్మఱ నొసంగుదుఁ ద్వద్వనితాండపిండముల్. 633

క. కులిశాయుధభీషణమై, వెలసిననాలావుఁ గనడొ వినడో నన్నుం
గొలిచినవాఁడని నిన్నుం, దెలియడొ సాగరుఁడు చూచితే తలక్రొవ్వెన్. 634

క. అనియలుక మొలకలెత్త, న్వనరాశి న్గాసిసేయువాఁడై వినతా
తనుతాపహర్త చనఁగాఁ, గనుసన్న న్మాన్చి దైత్యఘస్మరుఁ డనియెన్. 635

క. మామహిళాజనకుఁ డు మా, మమ దుల్లసితకేళిమందిర మాప్త
గ్రామణిమణి నీరాకరుఁ, డామేటిం జెఱుప నుచితమా నీకరయగన్. 636

క. పలుకులనె చక్కఁజేయుం, గలఁగజుహాం బేలకడలి కడవాఁడా గో
ష్డలిగోరఁ బోవుదానికి, వలె నా కన లుడుమసునిన వడి నమ్రుండై. 637

క. ఉరగాంతకుఁ డనియె మహా, పురుషా నను గౌరవమునఁ బొందింపం దే
వరకుఁ దలఁపున్న మత్కుం, ధర నెక్కి పయోధి కరుగుతడ వేమిటికిన్. 638

చ. కడుపునకా మహామహులఁ గాచుట గొల్చుట గౌరవంబునం
గడుఁబొడవై సుఖించుటకుఁగాక సముద్రునిచే లఘుత్వముం
బడసితి వ్యర్థమయ్యెఁ దలఁప న్దనజన్మము దేవ యెట్టియె
క్కుడు తనమేడలావు దనకు న్దలపంచుకొనంగ నోఁచితిన్. 639

మ. ఆదరంగాదు సముద్రుఁ డిందిరకులాయంబంచు వారించి తు
క్కుదఁగం దేవర కేనుగానె తగులాయం బస్మదీయేప్సితం
బడుగం జెప్పితి సంఘటింపుము మదీయస్కంధసంవాసివై
వడి విచ్చేయుము మఖర్వనిర్వహణగర్వగ్రంథికి న్గంధికిన్. 640

క. అని విన్నవించి వినతా, తనయుఁడు నికటమున నిలువ దనుజారి కన
త్కనకగిరి హేళివోలెన్, ఘనతం దత్కంధరమెక్కె ఖచరులు మ్రొక్కన్. 641

వ. ఇట్లు గరుడారూఢుండై గగనంబున కుద్గమించి నిలింపులు గుంపులై కొలువ సుర
స్సద్మంబునం బద్మయొప్ప నప్పరంధాముం డేతెంచి. 642

మహాస్రగ్ధర. కలితాతిప్రీతిరీతిం గనియె బహుజలగ్రాహనిర్గాహధాటీ
చలపాతోత్పాతమీనాచరితసితమహాశ్చామరగ్రామపూజా
ఫలరేఖాపట్టభద్రుం బలరిపునగరప్రాంతవిశ్రాంతగంగా
లలనాసంశ్లేషభంగాలఘుకరనికరోల్లాసముద్రు న్సముద్రున్. 643

క. కని కదియఁబోవుటయు న, వ్వనరాశి మహాపతంగవల్లభకంతా
సనవర్తి నాదిమూర్తిన్, ఘనకీర్తి హృతాశ్రితార్తిఁ గని ముద మొదవన్. 644

క. అకలంకరత్నములుగా, నకలుగ జగదేకమోహినులు వాహినులు
త్సుకలీల వెంటరాఁగా, మకరారిం జేరి సంభ్రమంబున మ్రొక్కెన్. 645

వ. మ్రొక్కి నిలువంబడి కరంబులు మోడ్చి యిట్లని స్తుతియించె. 646

దండకము. శ్రీపారిజాతాలయానర్తకీపూర్వరంగస్థలత్కౌస్తుభద్యోతముక్తామణీదామ
కస్తూరికాసౌరభోదార పాటీరచర్చోల్లసద్వక్ష, దేవాంబుజోన్మీలనాభీల నిర్గ్లాన
దానజ్వలద్దానవానేకపధ్వంసనాపార్యహార్యత్వ, ధాత్ర్యంబరాక స్స్వరధ్యక్షవై
శ్వానరార్కక్షపాణ్ణోనిలాత్మేశ మౌళిస్ఫురత్పాదుకాధ్యాసి నిష్పృష్టసంసార
గంధప్రబోధ ప్రకాశార్యచేతస్సరోనిత్య సత్యాధినాథాపచిత్యుజ్జ్వల స్వర్ణదీవా
ర్మరందప్రభాభాసుర స్వర్ణమంజీర హంసస్వనత్పాదకంజాత, ధాత్రీధరారాధ
నాహం క్రియామర్షి దేవర్షభ స్పష్ట నిర్దిష్ట దుష్టోపలాసార సంరోధిగోవర్ధన చ్ఛత్ర
నిర్భీక గోగోపసంజాత, గోపాంగనాపాంగకాంతిచ్ఛటాచంద్రికా ధౌతసద్విభ్ర
మభ్రూలతా కల్పకల్హారనీకాశనేత్రస్ఫుర చ్చంపకోల్లాసనా సారుణోష్ఠాలకాలం
కృత ప్రశస్తకస్తూరికా బిందుసౌరభ్య విభ్రాజిరాజాస్య, తాపత్రయారాతి షడ్వ
ర్గపంచేంద్రియాశా మృషాదోషసంసార దూరాదిమోపాస్య, వాచాలకేయూర
పారంపరీరమ్యసవ్యాగ్రమాపాణి సంస్ఫాలనంబుల్మహాయోగయుఙ్మాన సాంతస్థలీ
ఖేలనంబుల్సదావర్ధిత ప్రాణిసంమోదముల్ఖేదవిచ్ఛేదముల్భక్తిముక్తిద్వికశ్రీ
దముల్దల్మషత్రాసనిర్భేదముల్శ్రీమహాపాదముల్మౌళిఁ గీలింతు-భార్యాసుతభ్రాతృ
మిత్రప్రియప్రేష్య దృగ్భీషణగ్రాహ సందోహదుర్గాహ్యసంసారనీరాకరభ్రంశితా
లంబ సంతారకల్దుఃఖనిస్తారకల్నంబరారిస్ఫురత్కాంచనాకారకల్భూర్భువ
స్స్వస్త్రయాధారకల్రక్షితప్రాణిసంఘుల్భవజ్జంఘలర్చింతు, సౌన్దర్యలక్ష్మీవిహారా
లయద్వార్బహిర్లగ్నరంభాధరాజాతముల్ దానవధ్వంస నాదంభకేళీకళాన్వీతముల్
గాంచనాచ్ఛాదనాచ్ఛాదితంబుల్సభాపాదితంబుల్మనోజ్ఞప్రభాచారువుల్
దావకీనోరువుల్గొల్తు, సంవర్తవేళావినిక్షిప్తవిశ్వప్రపంచస్థితి న్నాభసురస్వాకృతి
చ్ఛిన్నమారాభిచార జ్వలత్కుండకాండాయతి న్నాభిశోభాసనాభిం ద్వదీయం
ప్రశంసింతు, నస్మత్సుతాక్రీడనాగారము న్గౌస్తుభశ్రీపరిస్ఫారసందీప్తరాజన్మణీ
నీలభూభృత్తటీ తుల్యవిస్తారము న్సారకస్తూరికాసౌరభోదారముఁన్ హేమవస్త్రో
త్తరీయ ద్యుతిస్మేరము న్దావకశ్రీమహావత్సము న్భామినీశాపరీరంభసంభావనాద
క్షము న్సంస్తుతింతు-న్సరోజాతచక్రాసి కౌమోదకీధుర్యము ల్దుష్టశిక్షావిశిష్టావనస్థై
ర్యము ల్బాధికారోజ మాద్యద్రథాంగద్వయీనీడము ల్రత్నకేయూరసంపీడము
ల్దీననిర్భీతిదానక్రియా శస్తముల్దేవ చ్చతుర్హస్తము ల్ప్రస్తుతింతు, న్సుధాంశూద్గ
తజ్యోత్స్నికా విభ్రమభ్రాంతికృన్మందహాసద్యుతి శ్రీకముం గుందబృందప్రతి
స్పర్ధిదంతాంకురోత్సేకముం జంపకాకారనాసామణీకుండలాలంకృత శ్రోత్రకం
దర్ప సందర్పణభ్రాజిగండస్థలాన్వీతము న్నిర్ణిరుద్ధానుకంపామృతస్నిగ్ధ చక్షుస్సరో

జాతము న్నీతరోచిస్సఖంబు న్ముఖంబుం ద్వదీయంబు వర్ణింతు, నభ్రంకష ప్రాంజన
గ్రావ శృంగాగ్ర జాగ్రన్మహోగ్రాంశు ధిక్కృన్మహారత్న కోటీరముం దుందిలేందిం
దిరాఖర్వగర్వాతినిర్వాపణవ్యగ్రమందారగుచ్ఛప్రగామోది కేశాళివిస్ఫారము న్రత్న
రక్షాసరగ్రస్తము న్దావక శ్రీమహామస్తముం బ్రస్తుతింతు, న్జగన్నాథ యాలోలక
ల్లోలమై తాలుమూలాయతశ్వభ్రమార్గంబునం బల్మి జిమ్మించి యొక్కుమ్మడిం గప్పు
వేళోరుమద్వారపూరంబు వారంర్ఘుపాకార తన్వేదహృద్రాక్షను న్రోయు నీవాయ
తాక్షేప మేపారగా దంష్ట్రికావైఖరిం జాపరీతి న్మహాసీరభాతిం బ్రకాశించునార్లే
ఖభావిక్షమాధార రామత్రయప్రక్రియం దెల్పగా, హవ్యభుక్కృన్యభుక్కూట
రక్షు ల్మదీయాజ్ఞ నస్మన్మణు ల్స్నిగ్ధగాంగేయవాతౌశరజ్జుభ్రమ న్మందరగ్రావశాణం
బువన్నం దదాధారభూతాశ్మరూపంబునం గచ్ఛపచ్ఛద్మత న్మన్ను నాలో బ్రవ
ర్తింపవే, దేవ చతుర్భయోత్పాది తేజోహిరణ్యాక్ష సాక్షాత్కృతిప్రౌఢ నిర్ఘోష
రోషానలోద్దామ రోమాగ్రటంకంబులం దారకావ్యక్త ముక్తాఫలంబు ల్దొలు
ల్లోవ ధావత్ఖురాంతర్గతగ్రావము ల్గజ్జలో దారలీల న్రొదాలింప ఘోణాగ్రసంకల్పిత
శ్వభ్రమేకీభవన్మజ్జనం బొక్కటం గ్రుక్కగాఁ బట్ట నాయామదంష్ట్రిసురంగంబు
న్సర్వదిక్కుడ్యము ల్వ్రియ్యదీపించు నయ్యాదిఘోణిం బ్రశంసింతు యుష్మద్విష
ద్దైత్యధారాధరప్రస్తని స్తంద్రవిస్రావ్రవాత్వాప్తికి న్మర్త్యకంఠీరవాభై రవారావము
న్రోషరాగాయితప్రోక్షణాక్షీణదీప్త ల్భవద్ఘోరనాసాపుటీనిర్గతశ్వాసము ల్గర్జలు న్మిం
చులు న్గాడ్పులుంగా, సపక్షాసలిల్ విశ్వదాస్థానిలీలన్ బలీంద్రేంద్ర జాలైకదా
నాంబుధారాప్లుతిం ద్వత్కృశాతేజ మావామనాకారబీజం బహో దివ్యధాత్రీజతం
బొంది యత్యద్భుతస్థూలపాదత్రయి న్విష్టపత్త్రికముం గప్పవే, చండవేదండశుం
డాసముద్దండ దోర్దండఖండేందువిస్ఫారపారశ్వధక్రూరధారాహతాశేషరాజన్యగా
త్రప్రవద్రక్తరోదస్వినిం ద్వత్పదాంభోజసంభూతకున్మగ్రహాస్వీతకు న్నంభుజూ
టాటవీసంగకుం గంగకు న్నిత్యసాపత్న్యవాదంబు గల్పింపవే జామదగ్న్యుండవై,
మైథిలీశుల్కరూపాత్త బాణాసనద్రోహిగా ధేయసంకల్పసంపాదనోత్సాహిని న్భా
హిని న్సొంపు దెంపారఁగా నొంపనూహించుశంభున్మహారోషసంరంభుజ్యాకృష్ట
నిర్భిన్నతత్కార్ముకోద్భూతకల్పాంతగర్జా సముజ్జృంభితధ్వానసంత్రాసయుక్తాగజా
శ్లేషసంపత్తిచేఁ దేర్పవే రామ రాజాన్యసుత్రామశేషాయతేషామిళ్లాంగలతోత్రిటి
కోటీసముత్పాట నత్రాసితంజేసి దుర్దాంతకాంతారనీపద్రుమధ్యత్క్షమాధావదుష్టాంశు
జాతన్మణీబంధవైదూర్యనాళస్ఫుర ద్వారిజాతం గలంగింపవే సీరివై, కంజసూతి
ప్రసాదప్రభావంబునం గావరం బెత్తి ముల్లోకము ల్హల్లకల్లోలము న్సేయు పూర్ధా

ం ద్విజయాన్వితము న్భూరిమాయాకళాన్వితమున్ శౌర్యసంవీతముం జంప శ్రేణి బాలింపనై లింప విద్విట్పురస్థాంగనామానభంగంబు గావించి తట్ల జ్ఞతాభూతియు న్మారజిత్త్వంబు నిన్ధర్మరాజత్వముం బొందునే, ఘోర గారికుటీమాత్రదూరీభవల్లోకము న్సర్వదుర్లోకమున్ శాత్వరానీకమున్ శా శరక్షురప్రప్రతీకాశపాదాగ్రసంక్షుణ్ణముంజేసి గంధర్వవిఖ్యాతి దీపిం మాపా జగద్దీప నీమస్తకం బంతరిక్షంబు నీ నేత్రము లోసమనూర్యాంశు కశ్రోత్రము ల్దిక్కు లుర్వీసురక్షత్రవిట్ఛూద్రజన్మస్థలంబు ల్భవదీ హూరుపాదాబ్జము ల్నీవు విష్ణుండ వంభోజగర్భుండవు న్నీవ నీవేకదా న్రాదిగీర్వాణులు న్నీవ సర్గస్థితిచ్ఛేదనాదిక్రియ ల్నీవ నీకుక్షిలో నుండు వితత్తు విస్తారము ల్నీ న్బ్రశంసింపలే వాగమంబు ల్త్రిలోకకైకరక్షా క్షా కృపాసాంద్రవీక్షా హృతస్వర్గవృక్షా పరబ్రహ్మమూర్తీ విధూతాశ్రి స్వాంతవర్తీ జగత్పూర్ణకీర్తీ విపత్కాలమిత్రా నతాంభోజమిత్రా సము , సురస్తోత్రపాత్రా నమస్తే నమస్తే నమస్తే నమః. 647

మగుడమగుడ, న్వనరాశిపలాశిశాసివరచరణముల
మోపి వినయంబున నిలిచి కరాంబుజముల మోడ్చి సభక్తిన్. 648

వేదవిద్వేయతాపకా, గమనకార్య మెద్దిగారవమున
ననిన నాపగావల్లభు, డిక్కుఁజూచి వాసుదేవుఁ డపుడు. 649

బనివిను మో, నీరాకర పైనతేయునికి నీవెఱుఁగం
ండు టిట్టిభుఁ, డీరస మిప్పక్షితోడ నెవ్వరి కమరున్. 650

ండములఁ బె, మ్మనుడుఁ బ్రణామంబుఁజేసి యబ్రానివెసం
యిచ్చెనాలో, వనరాశిం బాసి భక్తవత్సలుఁ డరిగెన్. 651

ావరయక పై, రముఁ బూనినవాఁడు వారిరాశిక్రియుఁ దై
ంచుననుచు శాత్రవ, దమనకుఁ డగుడమనకుం డతని కెఱిఁగించెన్.

నప్పలుకు లాదరింపక సంజీవకుండు దమనకున కిట్లనియె. 653

గళికుం డెటు, వలె నుండఁగఁబోదు ననిన వాఁడురుదంష్ట్రిల్
వనముం బెడ, తలవాలమునుండ వానతలఁ బొమ్మనియెన్. 654

కుఁ జెప్పి యద్ది, క్కన నిలువక వచ్చి కరటకునిఁ గదిసి యుపా
మిత్రభేదము, నొనరించితి ననుచు నాతఁ డుబ్బుచుఁ జెప్పెన్. 655

గనమున మొగు, ల్గప్పి మహిం జఱచి విసర గాడ్పులు ఱొప్పెం
గం ద్లురిలెం, గుప్పలుగొన సోనవాన గురియం దొడఁగెన్. 656

వ. అయ్యవసరంబున. 657

ఉ. జేవులుసోఁబకన్గొనలఁ జిప్పిల నూర్పులవెంట నుజ్జ్వల
త్పావకకీలలోలిఁ గనుపట్టఁగఁ గొమ్ములు వంచి కానన
గ్రావములం బ్రతిధ్వనులుగ్రాల ఖణిల్లన అంకెవైచి సం
జీవకుఁడాగ్రహం బడర సింహము పైఁబడియెన్మహోద్ధతిన్. 658

క. సంజీవకపింగళకుల, ఖంజపరాక్రమము లడరఁగాఁ గయ్యముసే
యంజొచ్చి రపుడు మహీభృ, త్కుంజరఫణిఘోణికూర్మకులపతు లదరన్. 659

క. తొలఁగకఁ కలఁగక వృషభం, గళకము లప్పాటఁ బోరఁగాఁ జిత్తమునం
గలఁగి వెలవెలనిమొగమునఁ, దలఁ గదలిచి కరటకుండు దమనకుఁ బలికెన్. 660

క. అతిహీనమానసా నీ, కతమునఁ జేటయ్యె నేలికకు నీ వేదు
ర్గతి కేగెదవో యెఱుఁగ, న్మతిమంతుం డంద్రు నిన్ను మతు లేవియొకో. 661

సీ. సాంత్వనం బుచితంబు సాంత్వనత్యాగికిఁ బరమదుర్భరపరాభవముగలుగు
వరుసఁ దక్కటివి యెన్నిరిగానిసామంబు ముఖ్యంబు దక్కినమూఁడు బుద్ధిఁ
దలఁప సంఖ్యామాత్రఫలములు నూవె దీపమున నాతపమునఁ బ్రచురరత్న
దీప్తిఁ జీఁకటివోలెఁ దీవ్రారితిమిరంబు సిద్ధసామజ్యోతిచేత విరియు
తే. నట్లుగావున నగ్రాహ్యమైనదండ, మధిపతికి గ్రాహ్యముగఁజేసి యనియొనర్చి
తకట నీబుద్ధిగాల నీయభినయంబు, గూల నీనేర్పు నీతీర్పు నేలఁగలియ, 662

చ. శ్రవణయుగాంతరావరణచక్రము లగ్గలఁబట్టుఁ దోరపుం
జెవుడు కనీనికావసథసీమకు నుమ్మలికాడు దృష్టిపా
టవము చురుక్తి నాలుకను డాసినచుట్టము పారుపత్యపుం
దెవులున వైద్యసాధ్య మెడద్రెవ్వక యెవ్వని నాశ్రయించినన్. 663

చ. తఱుచొకయించుకేని పరిధానమిడం బతిలాభకార్యముల్
చెఱుచు నరాతిజాతి కెడసేయకవాకొనుమర్మకర్మముల్
గుఱుచలఁ బట్టఁజూచు విభు కూర్చినచోటన కీడు సేయు మే
ల్మఱచునయారె రాజుఁ జెడు మంత్రివిపజ్జలరాశి ముంపఁడే. 664

చ. కలహము నిత్యకృత్య మపకారము పెట్టనిసొమ్ము సత్యపుం
బలుకు జపం బకార్యవిధి ప్రజ్ఞ యనాదరణంబు సద్వ్రతం
బలుక కులాగతక్రియ యహంకృతి కీర్తి సుహృత్తిరస్క్రియా
బలము బలంబు నీతి కెడఁబాసి నినుం బురుడించుమంత్రికిన్. 665

చ. వడిచెడియూఁగుపల్వొటికివైచినఁ గూర్చివిషప్లుతాన్నముం
గడుపునఁ జేరనీక మహిఁ గ్రక్కినఁ గాడిన ముల్లువుచ్చినం

డు సుఖ మిచ్చినట్లు కొలఁగాని యమాత్యునియోగి పెద్దన
డిచి సుఖించుభంగిఁ బృథివీపతి వీడ్కొని మేల్గొనందగున్. 666

త్త భూత్యర్థంబు రాజు వివిక్తంగాఁ జేసి యొక్కరుండవయుండం బ్రారంభించి
ఁడవు రాజు లాకీర్ణవిరాజులగు టెఱుంగవే సహాయసంపత్తి వేసియా లని నభి
ాతిజాతి విభీతిరీతిం జెప్పఁబడుచుఁ గాదే యని కినిసి పలికి మఱియుఁ గరట
ండు. 667

ప్రదుకకొలఁగాఁ దుర్జనుఁడు నృపాలున కనీతిచాటు శతంబుల్
ఁబూని కఱపుఁ బిమ్మటఁ, దనకీ డెఱుకపడఁ బతికిఁ దాఁ బగతుఁడగున్. 668

కి నభివృద్ధి దనకు శోభనము నైన, బుద్ధి బోధించునాతఁడు వో సుమంత్రి
కిఁ జెట్టయు దనకు నాపదయుఁ జేయు, బుద్ధి బోధించు నాతఁడు వో కుమంత్రి.

రోషుండయి శాంత, స్థితికి మతిం గపటమూఁది చెలిమికి సుఖసం
ఁడై విద్యకుఁ బరుష, వ్రతుఁడయి యంగనకు నాసపడఁ జనదెందున్. 670

ఁదేజ మొసఁగి దయతో, నొసయుఁడు దనఁ బెంపుఁ జేయ నుబ్బున భీతిఁ
చుట శోభనకారణ, మడఁకువ భూషణము గాదె యనుజీవులకున్. 671

నుస్థానంబున నీతంత్రియము నిట్టినాఁడని యూహింపంబడుచున్నాఁడు. 672

కాచార మవశ్యము, తనయుం బ్రాపించుననుట తథ్యము సురలో
కైతకకంటకములు, దనరం దత్ఫలకులంబు దాల్చుటలేదో. 673

గిత నెఱుఁగనిసిఁడు న, య్యాంగము బోధింపఁ ద్రాస మయ్యెడు మును దు
ంగతి నూఁచి ముఖాఖ్యప, తంగము కపిచేతఁ బోవదాదురొబ్బసన్. 674

విని దమనకుఁ డినసం, భావితుఁ గరటకునిఁ జూచి పలికెం జెపుమా
వృత్తాంతం బన నయ, కోవిదుఁ డాయనకుఁ గరటకుం డిట్లనియెన్. 675

తనితాంతశైత్యశరమై శరమొప్పవహించి మించుహే
తము సేనమానలసమానబలౌఘువశీక్షితాఖిలా
త ముపాంతకాంతమిహికార్తజగజ్జనవర్ధితవ్యథా
తము కృష్ణసారమదగంధనృపాలనిశాంత మెంతయున్. 676

సువిశ్రాణనస్వపితవాసరముల కాయామమదవీయమై చనుటనో
ానుషక్తిఁ జెన్నారుతమ్ముల కతిశ్రాంతిగాఁ గలదని చింతిలుటనో
ాక మనులోకమునకుఁ బాటిలినశీతార్తి యనుత్తుణం బణఁచుటకునో
సస్యాభివృద్ధికి గభస్తిస్తాత్మజీవనం బవనిపైఁ జినుకుటకునో
లురుచివాసి యొకమూలఁబడి సమస్త, సత్త్రములఁ జేరి యాత్మతేజమున శలు

వెలుఁగు శిఖియున్నకడ కేఁగవలసెననియొ, భానుఁడకాలమునమందభానుఁడయ్యె.

చ. సదవనవైభవంబు పరచక్రనధోద్యతనంబు నిస్తులా
భ్యుదయ మనూనదానవిధియుం బరిపూర్ణకళావిలాసనం
పదయును గల్గిరాజు గనుపట్టె ననంతపదప్రవిష్టుఁడై
యధిగత మూర్జితప్రసవయై కొమరొందె ధరిత్రి యెంతయున్. 678

మ. ప్రతిదిగ్వల్లప్రతిమస్సమగ్రరుచిదూర్వాచర్వణాఖర్వముల్
హితగంధామృతము క్తతర్షములు భూయిష్ఠస్వపర్త్యాశ్రయన
వ్రతము ల్పిండె నఖండపాండురతుషారక్షీరపూరంబు లు
ద్ధత హేమంతగవాధిపోద్యమముచేత న్రాజగోజాలముల్. 679

క. అతిశీతలవిమలవిధూ, న్నతపాదాక్రాంతిశీర్ణ నరలోకారా
ధితగాక యునికి చిత్రము, ఖతిలాగతయతితుపారగంగ దగంగన్. 680

చ. ఒకత్రుటికాలమేనిఁ బనికొగ్గక మీఁదులు చూచుదుక్కిబం
ట్రకు మడిఁ జేనఁగల్వల కొడంబడ ఘాసము లూడ్చుకూలికాం
డ్రకు నెడసేద్యపుంబనుల డస్సిపడుండఁదలంచు పెద్దయె
డ్లకుఁ గలిగించె దైర్ఘ్యవికలస్థితి వాసరపంక్తు లూఱటన్. 681

సీ. అహరాస్యజటిలనీహారధారాసారశైత్యాపనోదనోత్సాహమునవో
మలయశైలాగతానిలఖాద్యమాద్యదర్పాఖర్వగతిరేఖ వరయుటకునో
బహుధర్మయుతసుతప్రణిపాతపూజనస్వీకారసంభ్రమో త్సేకమునవో
మందేహదేహసంబంధకోణత్రాణరాత్రుసత్రాసదారంభమునవో

తే. మారుతప్రియుఁడాసి పటీరవనము, దాసి శమనుసముల్లాసిఁ జేసి పలవి
కాసి పుణ్యావతీడాసి రోసి వాసిఁ, దిమిరపలశాసి వర్తించె దినకరుండు. 682

ఉ. తోషణకారణైకపసతు ల్సతు లత్తఱి భగ్నసైంధవ
ద్వేషివిషాణగర్భరుచివిస్ఫురితాగురుదారుఖండసం
పేషితనూతనైణమదమిశ్రఘనస్తనదత్తనిర్భరా
శ్లేషణలీలఁ దేలుదురు శీతభయార్తులఁ బ్రాణభర్తలన్. 683

ఉ. భోగులు వుచ్చిరద్దివసముల్ పృథువహ్నిహసంతికాదిద్ర
త్యాగతులం గుఱంగమదసమ్మిళితప్రతినవ్యదివ్యకా
లాగురుచందనంబుల మహోయమళీభవదంశుకంబులన్
రాగరసైకవీటికల రాజముఖీపరిరంభణంబులన్. 684

సీ. నిర్ణిద్రదోషఘూర్ణితమనస్కులభంగి దృఢతరవంబుగనొండ్లు దిడితీడి
ధృతిబలోద్ధతవిరోధిత్రాసితులలీల వారక వడవడ వణఁకివణఁకి

ంనిభృన్నికటవ ర్త్యనుజీవులో యనఁ జేతు లంసములపైఁ జేర్చిచేర్చి
ఃభీరవల్లభు లన దలవాకిళ్లి నొకట యావులఁగుంపు లో త్తియొ త్తి
భబడినాటికమ్మరజాతివోలెఁ, గటికినిప్పులఁకుప్పలఁ గదిసి కదిసి
ంచి రప్పుండు వోలినచలికతమున, నాకులత నొంది రిలలోనిలోకులెల్ల. 685
పుసరకులఁ బోకలు, నాకులు గొంగళ్లు దుడుపుట ంబరములు కుం
లాగురువు ల్గొనఁ, గైకొనఁ బ్రియమయ్యె శీతకాలమునందున్. 686
కకూడు పుచ్చపరు గావులవెన్నయు దోసగింజ సం
కపుటాంబురంబు తనిమజ్జిగ మాకొనకంపుతోడఁ దం
ఁగఁ బట్టి రెడ్డిమడియ ల్లులుగోలలఁ బూని యొడ్డకో
ంలు వైచి దున్నుటకు నేగిరి కోంద్రకు స
ుల వేడబములు చాలించి తలసారె దఱల
ుసంధుల మహోగ్రగ్రంథు లొదవిః
ంమ మఖిలగాత్రచ్ఛిద్రములఁ బ్రొఁ
స్త గాదొకో చేరమాకాటది యన్నఁగె
ః వాలుడుతైలంబుఁ గ్రోలువారు, కుమ
యొకకొంద ఱచ్చలినలసవాధ, వాని
ంభీలంబైన చలికాలంబున.
ఁహనంబున నొకచో, నొకశీతా ర్తప్లవంగయూథము ఖద్యో
ుల శిఖియని కావఁగఁ, బకపకనూచీముఖాఖ్యపతగము నగుచున్. 690
ఁకీశక్రుతిపుటసం, గతమై యటసహజవిహ్వా గా దిది శీత
ంద్రిదీన నగునె యని వి,శ్రుతవాచారభటిఁ జెప్పచుఁ న్వలదిరుగున్. 691
త్రి పులుఁగు పిలుని, పేరఁట మేతెంచి చెవులు బీఱువడ న్వే
క చెప్పఁగ నందొక, కూర్మిరప్లవగంబు పండ్లుగొఱుకుచుఁ గినుకన్. 692
నొడిసిపట్టికొని కూ, యిడ నుప్పర మెత్తియెమ్ము విరియఁగ శిలతో
ంన నెపుడో ప్రాణము, విడిచె వృథాబోధకుండు పీటఁడిగాఁడే. 693
ఁథ యయ్యెడునని నినుబోధింప వెఱచెద నైనవినుము. 694
ుతర ప్రజ్ఞాఘన, బలముల నెవ్వాఁడు గోత్రధరము వహించుం
కులు వేయేలనిజం, బలము త్తము నోఁచి కాంచినది తల్లిగదా. 695
ాలాంతరంబులఁ దీలుపడని, బుద్ధిసౌందర్య మొక్కఁ డద్భుతముగాక
త్రిసౌందర్య మేరికిఁ గలుగదనిన, దానివిని విన్నసై యుండె దమనకుండు.

ఉ. వేసటతోడిపల్కు తనువేపనభావము సోష్ణదీర్ఘని
శ్వాసము గద్గదస్వరము శంకితదృష్టికపోలహస్తవి
న్యాసము వాడుదేఱువదనంబు స్వయంకృతఘోరకల్మష
త్రాసితతక్షణంబు లని తత్త్వవిధిజ్ఞులు సెప్పిరేర్పడన్. 697

క. ఈరీతి నుండ నేల మ, హీరమణున కిట్లొనర్ప నేల విచారాం
కూరముఁదుదఁ జిదిమితివని, రారాపున వాని నక్క రటకుఁడు మఱియున్. 698

క. అనయపరుం డగుమనుజుఁడు, తనవారిం జెఱిచి పిదపఁ దానుం జెడుఁబో
మను దుష్టబుద్ధిమాటలు, విని తజ్జనకుండు ధూమవేదనఁ దెగఁడే. 699

క. అనిపలికిన నీతికళా, ధనుఁ గరటకుఁ జూచి పలికె దమనకుఁడో స
ద్వినయార్ణవ యెట్లికథ, వినవిష్టం బయ్యెఁ దెలుపవే నాకనుడున్. 700

క. కరటకుఁ డిట్లను నొండొక, పురమున వర్తించుధర్మబుద్ధియనంగాఁ
బరఁగు నొకసెట్టివానికి, సరిచుట్టము దుష్టబుద్ధి సఖుఁడై తిరుగున్. 701

క. వానికి వానికి బ్రాణస, మానమహామైత్రి పెరుగు మఱి యందు మనీ
షానిధికి ధర్మబుద్ధికి, దీనారసహస్ర మొక్క దెసఁ గనవయ్యెన్. 702

క. కానంగనైన సొంపు ని, జాననమున మొలకలొత్త నవ్వార్త సుహృ
న్మానసమున డాఁపనేరక, పూని సఖుండనుచు దుష్టబుద్ధికిఁ జెప్పెన్. 703

ఉ. చెప్పిన నద్దురాత్మకుఁడు శింగఁడు బూరఁడునై సుహృత్తముం
దప్పక చూచి పూర్వసుకృతంబునఁ గాంచినసొమ్ము నెమ్మినై
నిప్పొలిమేర కేసరమహీరుహమూలమునందు డాఁచిపో
నొప్పునొరు ల్గనుంగొనరె యూరి కయో కొనిపోవఁ జూచినన్. 70[illegible]

గీ. ఇతరు లెఱుఁగనేల యింటికిఁ గొనిపోవ, నేలనేల యరసి యెఱుఁగకుండఁ
గుండఁబాఁతి యింటికుండనె చనుటొప్పుఁ, దగ నొనర్పు మనల ధర్మబుద్ధి. 70[illegible]

ఉ. వంచనసొమ్ముఁ బుచ్చుకొనువాఁడయి వీఁడిటులాడుచున్నవాఁ
డంచు మనంబునం దెలియ కాతని నిక్కము నెయ్యుఁగా విచా
రించి యొకొన్ని పుచ్చుకొని వృక్షసముజ్జ్వలమూలమందు న
క్కాఁచినసొమ్ముఁ బాఁతి చెలికాఁడును దానును బోయి రిండ్లకున్. 70[illegible]

ఉ. పోయి నిశీథమైనఁ జెడుపోకలఁ బోవుటి దుష్టబుద్ధి యా
రేయి గృహంబుఁ బాసి నగరీజనులం గనుబ్రామి యొంటి నా
చాయకు నేగి కూడుబలిఁ పల్లి పెకల్చి ధనంబుఁ గొంచుఁ జే
ర్పాయపుసొంపునం జనియె నచ్చతురత్వర నొంటి నింటికిన్. 7[illegible]

గీ. అతఁడు గొన్నిపూఁట లరిగిన నింటికిఁ, బోయి తాను ధర్మబుద్ధి కనియె
దిరుగఁ జూడవలదె దీనారభాండంబు; సురిగనేమొ దిగులుసొచ్చె నాకు. 708

క. అని వెరవుఁజూపి పిలిచిన, ననుమానము పుట్టి తాను నాతఁడు జోడై
చని ధర్మబుద్ధి వినిహిత, ధనభాండముఁ గానఁడయ్యెఁ దరుమూలమునన్. 709

ఉ. కానక మానసంబు కలఁగంబడ నిట్లను ధర్మబుద్ధి య
య్యా నిను సద్వయస్యుఁడని యొండొకచిత్తములేక నమ్మి యి
చ్చో నిడి చన్న నాధనముఁ జోరునిచాడ్పునఁ బుచ్చుకొంటి వి
స్సీ నరభోజనుండయినఁ జెట్టఁదలంచునె విశ్వసించినన్. 710

ఉ. పూని మదీయవిత్త మిటుఁ బూడ్చుతఱిం బరికింప నక్కటా
యేనును నీవకాని యొరులెవ్వరెఱుంగరు నీవుదక్క నో
ప్పా నిజమాఁ బరులొప్పరయ రర్థముఁ గ్రమ్మఱఁ దెమ్ము దొంగవే
రానకుఁ బాలుపడ్డ నగరా నగరాలుదురాత్మ నావుడున్. 711

క. విని దుష్టబుద్ధి బుద్ధిం, గనలుచు నద్ధర్మబుద్ధి గనుఁగొని పలికెం
గనినాఁడవో వినినాఁడవో, చనునే నామీఁద నిట్టిపడి మోపంగన్. 71

క. నీసఖ్యమునఁ జరించిన, దోసము మోసము న నేఁడె తోడనకలిగెఁ
బోసరమె నోరిక్రొవ్వో, రేసో యిట్లాడ నెవ్వరికి నీడేరున్.

ఉ. ముచ్చుదనంబు నాపయిన మోపకయుండిన సెట్టిబిడ్డవే
వచ్చెనె నీకుఁ గూడుఁగుడువం గులకామిని ప్రక్కఁబండెదే
క్రచ్చఱఁ గన్నసొమ్ము తిరుగంబడినం గొనకున్నసెట్టురా
రచ్చకునంచు నీడ్చి పదరంబడి వాఁడు సుహృచ్ఛిఖామణిన్.

వ. ఇట్లు ధర్మబుద్ధి నీడ్చుకొని చని నగరంబడి ధర్మంబున కొప్పి పి
బెట్టిన ధర్మవేదు లుభయవాదుల నాలోకించి తమకింపక అంతుసే
రక యిరువురు గలసి పలుకక యొకరొకరిపూర్వోత్తరంబులు
మీమీసుద్దు లుగ్గడింపుఁడనుటయు నందు ధర్మబుద్ధి కృతాంజలియై
నియె.

క. ఈతఁడు నాతోఁ జెలికాఁ, డై తిరుగం బెద్దకాల మరిగె న్వీను
భూతలమున దీనారస, మేతవినిష్టంపభాండ మేఁ గనుఁగొంటిన్

క. కనుఁగొని నిక్కము చెలికాఁ, డని పెద్దయు విశ్వసించి యీకథఁ
తనికి నతిగోపనంబుగ, వినిపించితి నావివిక్తి పీటింబోవన్.

క. వినిపించిన నాతఁడు నా, కనుఱక్తునిపగిది ననియె ననఘా యేత
ద్ధన మూరియొద్ద నేటికి, నినువేఁడెద వలయు నిచట నిక్షేపింపన్.

క. అని తరుమూలముఁ జూపిన, మనమున నదుష్టబుద్ధిమత మెఱుఁగక చె
ప్పినయట్ల సేసిపోయితి, తనయింటికి నీతఁ డంతఁ దానుంబోయెన్. 719

క. కతిపయదివసము లరుఁగఁగ, నితఁడు ననుం బిలిచి పలికె నిష్టసఖా నా
మతినతితాపము వొడమెడు, నతులగతిం జూడఁబోత మావిత్తంబున్. 720

క. అనపలికి నన్నుఁ దోడ్కొని, చని తరుమూలమునఁ జూడ సంగుప్తధనం
బునిచినచో లేదయ్యె, న్మనసెరియం జొచ్చె దైన్యమగ్నుఁడ నైతిన్. 721

క. సొమ్మున్నది నీయెద్దం, దెమ్మని నే నదరవైచితే నీతఁడు న
న్నమ్మాటలాడి త్రిప్పెం, దిమ్ములనం జొచ్చి యాశ్చితెచ్చె న్సభకున్. 722

వ. ఇంతియ యని ధర్మబుద్ధి యూరకుండె నప్పుడు దుష్టబుద్ధి ధర్మాసనస్థులకుఁ బ్రణా
మంబు లాచరించి యిట్లనియె. 723

చ. ఎనసినచెల్మి నుండుటయు నెక్కటిపాటఁ దదర్థభాండముం
గనుటయు నాకుఁ జెప్పుటయుఁ గప్పుటయుం గల దంతనింతకుం
జనియొక నాలుగేనుదివసంబులు వోవఁగ వచ్చిచూడఁ బొఁ
తినకడ సొమ్ములేదు కనితీసికొన న్మహిజంబుసాక్షిగాన్. 724

క. నావిని ధర్మాధికృతుల్, వానాదంబేల యేనువారము లెడ మీ
రేవివరము నాఅవనాఁ, డావిస్మృతబుద్ధిఁ దెలుపుఁ డరుగుఁడు మగుడన్. 725

వ. అనువచనంబులు విని దుష్టబుద్ధి. 726

క. అవకాశ మేమిటికి ప్రతివివాదం బింకనేమిటికి శుద్ధాత్ముం
డవు నితఁడని నన్నందఱు, దగఁ బొగడఁగ సాక్షిఁ దెలిపెదనుమీపాలన్. 727

క. నా విని ధర్మమువారలు, నీ వెవ్వరి సాక్షిఁ దెలుపనేర్తువు చెపుమా
వావాద ముడిగె నన మ్మ్యాయావాదనశాలి వారి కతఁ డిట్లనియెన్. 728

క. ఏపాదపమూలంబున, బాపురె దీనారపూర్ణభాండ మహో ని
క్షేపింపఁబడియెఁ దెలియఁగ, నాపాదపవిభుఁడు సాక్షి యగు మీ రడుగన్. 729

క. అనుదుష్టబుద్ధిపలుకులు, విని యచ్చెరుపాటు గదుర విద్వజ్జను లే
దినమునకు నేమిప్రొద్దునఁ, జనుదెమ్మరసెదముగాక సకలం బనుచున్. 730

క. చని రంతధర్మబుద్ధియుఁ, జనియె గృహంబునకు వానిజాడనె తోడ్తో
జనియెఁ బ్రతివాది యాలో, దినకరుఁ డపరాబ్ధి వారిఁ దెప్పలఁదేలెన్. 731

గీ సంజచివురించెఁ జీకట్లు సందడించెఁ, గలువ సొంపెక్కెఁ జక్రవాకములు స్రుక్కె
జలజములు వాడె దిశలఁ దేజంబు నీడె, ఘూకము ల్మత్తె విహగముల్గూండ్లు సేరె

వ. అప్పుడు దుష్టబుద్ధి యేకాంతంబునఁ దనతండ్రి యడుగులంబడి యిట్లనియె. 73

ఉ. చోరుఁడె దుష్టబుద్ధి యతిశుద్ధుఁడుగా కని భూరుహంబుచేఁ
బౌరులు గుంపులై విన సభం బలికించెదనంటి వచ్చితిన్
జేరెడుమాటమాత్రమునఁ జేకొను మస్మదభీప్సితంపుదీ
నారసహస్ర మెప్పటికి నందనులాభముతండ్రిఁ బొందదే. 734

క. తరుకోటరమున నీ వొక్కరుఁడవ వసియింపు మెరులు కనుఁగొనకుండం
బరిషజ్జనము రయంబున, వరుదెంచినఁ బలుకుసభ్యుఁ డని నిన్నడుగన్. 735

వ. అనినం గొడుకునకుఁ దండ్రి యిట్లనియె. 736

క. చెడుబుద్ధి నీకుఁ బుట్టెం. జెడితివి నన్నుం గృతఘ్ను చెఱిచెద యూఁకో
నొడఁబాటుగాదు చిత్తము, వెడఁగులపని పంపుసేయువిజేఁడి గలఁడే. 737

క. మొదల నపాయం బెన్నుట, పిదప నుపాయంబు లెక్కఁబెట్టుట తగునీ
చిద గొదలఁ గాదె ము న్నొక, మదికొక్కెర యనుఁగుసుతుల ముంగిస కిచ్చెన్.

గీ. అనిన దుష్టబుద్ధి జనకు నిరీక్షించి, యిట్టు లనియె నకుల మేకతమున
బకపికార్భకముల భక్షించె బకమేమి, సేసె నంతవట్టుఁ జెప్పవలయు. 739

వ. అని యడిగినఁ దండ్రి కొడుకున కిట్లనియె. 740

మ. కలదభ్రంకషభూజరాజిశుకపాకగ్రస్తశస్తస్వరు
త్వద్రుగ్వాక్యము కూలముద్రుజఝరీభంగాంగసంఘర్షజా
విలఘోషప్రతిఘోషితద్విరదవిద్విడ్భీమ ముగ్రద్విపి
స్థలకృత్కీలదరీనికాయ మొకకాంతారంబు దుర్వారమై. 741

ఉ. ఆవిపినంబునం దొకమహామహిజంబున నగ్రశాఖపైఁ
దా వసియించి యొక్కబకదంపతి పిల్లలఁ జేయుఁ జేయు నా
శీవిష మాసమీపబిలసీమమున న్వసియించియుండి వా
పోవఁగ నన్నిటి న్మెసవిపోవు సమాసమ నిర్విఘ్నంబునన్. 742

క. ప్రతిసంవత్సరమును నీ,గతిఁ బిల్లలఁ బాముపాలుగావించి మనో
గతి బకమిథునము పొగులుం, బ్రతిక్రియఁ గానక యలంతఁ బగలు నేరిలున్. 743

వ. అట్లుండఁ గొండొకకాలంబునకుఁ దననాతికిఁ బ్రసూతిసమయం బగుటయు భుజ
గభయానకం బగుబకంబు తిక మెకంబై సంతతిసంభరణంబునకు విరోధిసంహారణం
బునకు నుపాయంబుఁ గానక తానకంబుఁ బాసి ప్రియసఖుండు నాపజ్జయాభి
ముఖుండును నగుకర్తరీపాణినామకులీరకుం జేరంబోయి కాయం బడచిపడ బుడి
బుడికన్నీరు గ్రుక్కుచుఁ జిక్కకొన్నకంఠంబునఁ దనకుఁ బాటిలినచేటువాటు
ప్రసంగించి శోకించి పుత్రత్రాణవిధేయం బగునపాయంబుఁ జెప్పి యాపత్త్రా

వారతీరంబుఁ దెప్పవై చేర్పుము నన్నిఁ డేర్పుము నీవనికనికరం బొలయఁ బ్రార్థిఁ
బకంబునకుఁ గుళీరం బిట్లనియె.

క. భువనవిహారివి నవలా, ఘవమున లావును గొఱంతగా దెన్నటికిన్
దివిరిపథియింతు వనిమిష, నివహము నీయంతవాఁడు నెగు లెట్లొందెన్.

క. శోకార్తులకు నుపాయము, లేకరణిం దోఁచు ధైర్య మెవ్విధిఁగలుగున్
రాకడవోకడలకు జవ, మేకొమరున దొరకుఁ గడఁక లెటువలె నొదవున్.

క. ఐనను దీనికిఁ దగుతెఱఁ, గే నీకెఱిగింతుఁ జేయు మిది భవదీయ
స్థానతరునికటగతకా, దే నబిలంబునకు నకులదృఢబిలమునకున్.

క. ఎడత్రెవ్వకుండ మీలం, దడవైవుము వానినెల్ల భక్షింపుచు నె
వ్వడి నేఁగి ముంగిపాముం, బడలుపడం గఱచిచంపుఁ బగ నీ కణఁగున్.

క. చనుమని యాహారంబిడి, పనిచిన నప్పులుఁగు చనియెఁ బయనం బైత
ద్వనిత యొకకొన్నినాళ్ళకు, గొనబై యచ్చోట గూఁట గ్రుడ్లం బెట్టెన్.

గీ. పెట్టి ముదిగుడ్లునవమండఁ గట్టుఁగాచి, పొదుగుటయు నైతకొని కొన్నిప్రూఁటఁ
బికిలడింభంబు లాలోన బకవిభుండు, యెండ్రి చెప్పినగతి మీలనిండవైచె.

గీ. కవుచుగాలివాఁతఁ గవిఁ బాసి వెలువడి, వరుసమీల దినుచు వచ్చివచ్చి
పాముఁ జంపి పాదపముఁ బ్రాకి బకశిశు, ప్రకరభుక్తిఁ దనిసి నకుల మరిగె.

ఆ. ఒకఁడు సేయఁబోవ నొకఁడగు నీబుద్ధి, గూల నన్నుఁ జెఱుపకుము దురాత్మ
చెడిన నీవ చెడుము చెప్పకు మీమాట, యర్థభాండ మొల్ల నన్య మొల్ల.

క. అని మిగిలుంబలికిన నా, ననమున దైన్యంబుదేఱ నందనుఁ డాసె
ట్టనకాళ్ళమీఁదఁబడి యిఁక, వినునా వచనంబటంచు వేఁడుకొనంగన్.

తే. మోసపోవనివాఁడయ్యెఁ ముదుకఁడయ్యె, విధివశంబునఁ జెవివేఁటవేసి సె
యర్థరాత్రంబునం దేగి యడఁగియుండె, గూబచందాన నలవృక్షకోటరమున

వ. అంతఁ గొంతప్రొద్దునకుం బద్మబాంధవుండు పూర్వపర్వతశిఖరసింహాసనం
నప్పుడు పిన్నపెద్ద లుభయవాదుల రావించి వృక్షసమీపంబునకు వచ్చి య
య్యిరువురిలోన వంచకుం డెవ్వఁడు చెప్పుమని ప్రాంజలులై నిలిచిన.

క. ఎలుఁగొందఁగఁ దరుకోటర, తలమున నద్దుష్టబుద్ధితండ్రి మహాని
ర్మలధర్మబుద్ధి సుగుణో, జ్జ్వలు వంచకుఁ డనియె నెల్లవారు వినంగన్.

క. అందఱు నమ్మాటకు వెఱఁ, గందిరి యలదుష్టబుద్ధి యానందమునం
జెందినటియించెఁ బౌరుల, మందరఁగరతాళగతులు మొరయ న్నెరయన్.

ఆ. ధర్మబుద్ధి వగచి తలయూఁచి తనలోన, ననియె నేఁడు సత్యమణఁగె ధర్మ
మవని వెల్లవిరిసె ననృతంబు చూచితే, నిర్నిమిత్త మిట్టినిందవుట్టె.

క. తరువులు సాత్తులు వలుకునె, నరులడిగిన మనుజభాషణంబుల నిదిపో
యరుదు పరామర్శింపం, గరము ప్రయత్నంబు తోడఁ గల దిందనుచున్. 759

క. ఆకుజఘునకోటరమున, నాకలములు వైచి యనలమంటించిన న
స్తోకతరకీలసంయుత,మై కీలలు ప్రబ్బికొనియె నభ్యంతరమున్. 760

క. పొగ నుడ్డుకుడిచి మంట, న్నగమరుగం గాలి యేడ్వెసఁగ నన్నగమున్
డిగనుఱికి దుష్టబుద్ధిం, దెగితిట్టుచు బిడుగుబడుగుదేహము విడిచెన్. 761

వ. అప్పుడు రాజపురుషు లద్దుష్టబుద్ధి నిరీక్షించి. 762

సీ. చెల్లుసెల్లముల కీక్షింప నిచ్చినసొమ్ము మగుడ నీలేనికోమటి గులాము
చేసేత విశ్వసించినవారివెచ్చసచ్చములఁ గీడ్పఱుచువై జాతితొండ
తెగిగంటిలేనిపోటుగ నొడ్లయద్దల గిద్దఁ బొడుచువేగినబిగాది
బూసంబుదరిపి నేర్పున నమ్మికొనుటకుఁ గరవుఁగోరెడుదోసకారిబుడుగ
తే. యప్పు నెపమున నూఱాఱు లడిగి పుచ్చు, కొని నయంబునఁ దీర్పక కోఁకపోఁక
సరకుసప్పట సరిచెప్పి యరగఱాచు, చెడగరపుడొక్కయోరోరిసెట్టిమక్క. 763

వ. అనితిట్టి సొమ్ము ధర్మబుద్ధి కిప్పించి దుష్టబుద్ధిం గొఱఁతబెట్టిరి దుష్టబుద్ధి యగు
వాఁడు తనవారినిం జెఱిచి తానుం జెడు నిట్లు రాజునుం జెఱిచి తరువాత నీవునుం
జేటునొందెద వనిపలికి కరటకుండు వెండియు. 764

చ. కడుఁ జెడుకార్యము ల్దమనకా మనకా భయమయ్యె నేఁడు నీ
నడవడిఁ జూచి నమ్మదగునా నినుఁ జిల్వకుఁ బాలుఁబోసి ముం
గడనసియింపఁజేసి చిరకాలమువెంచిన మే లెఱుంగునే
కడఁగి బడల్పడం గఱుచుఁగాక కృతజ్ఞులె దుష్టమానసుల్. 765

క. తెలియనినరుఁ దెలుపఁగనగుఁ, దెలిసినమానవుని వలదు తెలుపఁగ మదిలోఁ
దెలిసియుఁ దెలియనికఱటికిఁ, గలితన మెఱిఁగింపఁ గమలగర్భునివశమే. 766

క. పతి కిట్లొనరించిననీ, కితరు లనం దృణకణంబు లెలుకలచే భ
క్షితమయ్యె ననుపత్రసను, కతవినవే మున్ను దమనకా నీ వనుడున్. 767

క. దమనకుఁ డలకరటకుది,క్కుమొగంబై యెట్లు నీతికోవిద యిది స
ర్వముఁ జెప్పుమనిన నక్క,థ,యమలమతిం జెప్పఁదొణఁగె నతఁ డాతనికిన్. 768

చ. ననిచి కవేరజాతటమున న్మహిసాళపురంబునం గృత
ఘ్నునిచెలి మందభాగ్యుఁడను కోమటి వత్తిలు విక్రయింపనుం
గొనఁ దిన లేమిఁ గూటికిని గోఁకకు నీదిరమై కృశింపుచుం
గనుఁగవఁ బ్రాణము ల్నిలిపి కాఁటియగాఁగ నతండు నిచ్చలున్. 769

ఉత్సాహ. కోరి మ్రొక్కఁ గ్రొత్తపెండ్లికూతుఁ గృష్ణఁ జూచి యో
వారిజాయతాక్షి భాగ్యవంతుఁ గాంతుఁ గాని వి
ద్యారణప్రవీణుఁ గాంచ కట్టిమత్సుతు ల్వనీ
చారులైరి చూడుమంచు సాధ్వికుంతి పల్కదే. 770

వ. అని తలంచి. 771

క. అతఁ డొకనాఁడు ధనార్జన, మతిఁ జనుచుం గతినలోహమయాతులసుహృదా
యతనమునఁ బెట్టితిరిగెం, గతిగలిగెడుననుచుఁ దిరుగగలచోటెల్లన్. 772

చ. సరకులఁ కేఁగి వేసరెఁ బసారముఁ బెట్టిన సెట్లఁ గూడి వే
సరె నడుగానఁ గానక యజస్రము గూలికిమూటమోసి వే
సరె మఱియుప్పుఁ గూరయును సంగులగొందుల విల్చివిల్చి వే
సరె నొకత్రోవయు న్ఫలమొసంగదు సెట్టిన భాగ్య మెట్టిదో. 773

ఉ. అల్లన మందభాగ్యుఁ డగునాతఁడు వేవిధులం గృశించియున్
వల్లముపచ్చగాక పసివాడినమోమునఁ దా నివృత్తుఁడై
తెల్లముగా సుహృత్తతుల దెస్మని వేఁడిన పంచనామతిం
గల్లలఁ బల్కె నాతఁ డెలుక ల్దినెఁ ద్రాసనియాసపెంపునన్. 774

క. ఆమాట కలకిరాట, గ్రామణి దలయూఁచి యట్లగాకున్నసఖా
యీమాడ్కి నాకుఁ జెప్పుదువే మిగుల నపూర్వమిదిసుమీ యేమారెన్. 775

క. అని వెగటుదోఁపకుండ, న్మనుపటివలెఁ దన్ని వేళమున వర్తిలుచున్
దనలో రోయుచుఁ గతిపయ, దినములు గ్రమియించి కలఁకదీఱినపిదపన్. 776

క. బడుగుం గోమటి తుకతుక, నుడుకుచుఁ దులదక్క ననుచు నున్నాఁ డోయిసీ
గుడిఁ ద్రిప్పినకపటాత్మునిఁ, దడయక గుట్టయినఁ ద్రిప్పెదం జేసేతన్. 777

క. అనితలఁచి యలకృతఘ్నుని, తనయునిచే నొక్కనాఁ డతఁడు నూనియను
న్నను కగునుసిరికపిండియు, జనవునఁ బట్టించుకొని ప్రజల్వీక్షింపన్. 778

క. స్నానవ్యాజంబునఁ జని, వాని నొకానొకసుహృన్నివాసంబున నా
లోనిడి క్రమ్మఱుటయుఁ జిం, తానతుఁడై వాని కాకృతఘ్నుండనియెన్. 779

శా. అయ్యల్ వచ్చెఁ గదయ్య నీపిలుఁద రాఁడాయె న్మహాసాధ్వసం
బయ్యెం జెప్పఁగదయ్య నావు డతఁ డత్యార్తుంబలెం బల్కె నే
నయ్యేట న్సలిలంబులాడఁగఁ దటన్యస్తాంఘ్రి నాహూద్ధతం
బయ్యా నీసుతుఁ గ్రద్దదన్నుకొనిపోయెన్ భీతివాపోఁపఁగన్. 780

క. ఏను వితాకుఁడనై నీ,తో నీచెడువార్తఁ జెప్పుదుం గాకనుచు
న్వే నిలువక వచ్చితి నన, నాననము వాడ నాతఁ డ[illegible]ని కనియెన్. 781

ఆ. చేఁపజెల్లగాదు చిట్టెలుకయును గాదు, పిట్టగాదు కోడిపిల్లగాదు
కొట్టిజుట్టుఁబట్టుకొనిపోవఁ బసిబిడ్డ, లేడ నీలగ్రద్దలేడఁజెపుమా. 782

క. వినసంగతిగాదు సుతుఁ, గొనితెమ్మన నతఁడు గ్రద్దగొనిపోయినబా
లునిఁ దేనగు మూషకములు, దినిపోయినయినుపత్రాసుఁ దేబాగైనన్. 783

క. ఇనుపతుల నెలుకదినఁగాఁ, గొనిపోవఁగరాదె గ్రద్దకు న్సఖ యుష్మ
త్తనయుని నీమాటలకుం, జెను వింతలె తెలియనెప్పటికి నామాటల్. 784

క. అని మాటమాట సరిపు, చ్చిన వంచకుఁ డెఱిఁగి యతనిచేతికిఁ దులని
చ్చె నతండును దాఁచినత, త్తనయుఁ గృతఘ్నునకు సమ్మదమ్మున నిచ్చెన్. 785

క. ఇదినీకు నిదర్శనమగుఁ, గద నిను మఱి నష్టగాఁగద యేమనిచె
ప్పెద వొప్పుగులుక నయగుణ, మదిలే దొట్టయిన సత్యమైనన నీకున్. 786

ఉ. ఆదరమొప్ప నుత్తముఁడై మనువాఁ డుపదేశికిం దృఢా
హ్లాదము సంఘటించుఁ బరమాదరణశ్రవణంబు పెంపునన్
ధీదశలేమి నష్టదుపదేశ మ్మధూక్తిశతంబు లక్కటా
సూదులుపోలు నీచెవులుసోఁకిన నొచ్చుసహింపకుండుటన్. 787

క. ఘనగుణములఁ దనుగుణముల, జనుఁ డమరు న్సాధ్వసాధుసంపర్కముచే
వనజనపదపథికుం డగు, ననిలుఁడు పోలెన్ శుభాశుభామోదములన్. 788

వ. కార్యాకార్యవిచారంబు చాలనిగురునయినఁ బరిహరింపవలయునని పలుకుచు దమనకుం బరిహరించుకొని కరటకుండు రాజనికటంబున కరిగె దమనకుండును దోడన జనియె నంతఁ బింగళకుండు సంజీవకుంజంపి విన్నయైన మొగంబున దమనకు నాలోకించి. 789

చ. ఇలఁగల సేని క్షేమిగడియింపఁగరాదు హితత్వసత్యని
శ్చలగుణశాలి యైనభటసత్తము నొక్కనిఁ గూర్పరాదు గా
కలవున నిట్టిబంటు దెగటార్చితి వృథా మతిలేక నీదురు
క్తులు విని చంపితి న్విగతదోషుని నష్టహనీయభాషునిన్. 790

వ. అనినఁ బింగళకునకు దమనకుం డిట్లనియె. 791

ఉ. వంచకులం బడల్పఁతిచినైచుట సత్పురుషవ్రజంబు ర
క్షించుట విత్తమాశ్రితులఁ జేర్చుట భూప్రజపై దయాగుణం
బుంచుట రాజధిహ్నములువో యభిషేకముఁ బట్ట బంధముం
గుంచెయు మంత్రతంత్రబలగుప్తియు బుంటికి లేకపోయెనే. 792

క. అరిమరణంబునకేలా, పరితాపము నొంద విరసభావముగలవోఁ
బరుతేల యుగ్రజానో, దరుసైనను జంపుదురు మొంద ల్రాజన్యుల్. 793

క. వైరముపుట్టినఁ బోరన్, శూరులు నిర్జరులు రాక్షసులఁ జంపరె యె
వ్వారికి నిది వింతయె బృం, దారకులును వారు నన్నదమ్ములు గారే.

క. విరసించినచో రాజులు, దురమున నెవ్వారినైనఁ దునుముదు రలుకన్
గురు నగ్రజు ననుజు న్సో, హవమున వధియింపఁ డో టుహారిసుతుఁ డరయన్

చ. పరుషసముల్లసన్మధురభాషిణిహింసయఖండసత్కృపా
నిరతవసువ్యయవ్యసన నిత్యధనాగమకోపసుప్రసా
దరనయసత్యసత్యపరితాపదసౌఖ్యదవారకామినీ
స్ఫురణనసత్యదాప్తిఁ బొలుచు న్నృపనీతి యనేకరూపమై.

వ. అనియిట్లు దమనకుండు బోధించినఁ బశ్చాత్తాపంబు మాని మృగరాజు ప్రాజ్యరా
సుఖంబు లనుభవింపుచుండె.

క. అని వినిపించినగురునిం, గనుఁగొని నృపపుత్త్రు లనిరి కమనీయగుణాం
బునిధీ రెండవతంత్రం, బనురక్తిం దేటపఱుపుమని యడుగుటయున్.

మ. ప్రతిబాధీకృతకామకామనుజభుక్ప్రధ్వంసనారంభణ
వ్యతిషంగవ్రతసత్వసత్వరవరవ్యాపారపూర్ణీభవ
న్నతసంకల్పవిశేషశేషరచితామ్నాయోక్తిపద్యవ్రతో
ద్గతరోమాంచవితానతానవరుజాధాటీభిషక్పుంగవా.

క. వనజభవతనయమేధా, వినుతవినీతైకదివ్యవృషభజగత్పా
వనపంచతత్త్వమయ వి, ధ్వనలోచన సర్వభూతహితసంచారా.

మాలిని. అవనలయకరాత్మా హారియుక్చిత్తవాత్మా
వివిధనిగమవేద్యా విశ్వసర్గోపపాద్యా
భవతిమిరపతంగా పర్వచంద్రోపమాంగా
హావిరశనబలిష్ఠా హార్యకల్పాజినిష్ఠా.

గద్యము. ఇది శ్రీ వేంకటనాథకరుణాలబ్ధసరససాహిత్యనిత్య కవితావిలాస సకలన
ప్రశంసాభాషణోల్లాస రాజకులపారావారపర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గ
శ్రమణధైర్యపర్యాయధిక్కృతనీహారపర్వతపర్వరాజకుమార నిస్సహాయప్ర
నిర్మాణభోజభూదారసుధామధురభారతీసనాథ వేంకటనాథప్రణీతం బయిన
తంత్రంబున మిత్రభేదం బనునది ప్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# పంచతంత్రము.

## ద్వితీయాశ్వాసము.

---



గౌరీవక్షస్తన
భోగాభిజ్ఞాననిశ్చలచపలాసం
భోగభ్రమరవ్యపత్యస
మాగమసురసింధురూపహరిహరనాథా. 1

వ. దేవా సుహృల్లాభాభిధాన ద్వితీయతంత్ర మాకర్ణింపు మధీతనీతిశాస్త్రి మర్త్యుం
డవ్విష్ణుశర్ముండు సుదర్శనకుమారుల కిట్లనియె. 2

క. సాధించెఁ గార్యముల ధన, సాధనములు లేక సారసౌహార్దసమా
రాధనమున ము న్నార్జిత, మేధాధృతిఁ గాక కూర్మమృగమూషకముల్. 3

క. నా విని రాజకుమారకు, లా విప్రునిఁ జూచి పలికి రదియెట్లు నయ
శ్రీవిభవ తెలుపు మన వి, ద్యావారిధి వారికద్ధరామరుఁ డనియెన్. 4

క. శతమఖవనసఖవిటప, స్థితిమహిళారోప్యనగరిచేరువఁ గలద
ప్రతిమం బొకబూరుగు లఘు, పతనకుఁ డను కాకి దానిపై వర్తించున్. 5

సీ. వసుధ నెవ్వనిసదన్వయకర్త జేజేలతోనికిఁ గుల ముద్ధరించుకొడుకు
పితృకార్యములు సమర్పింతు రెవ్వానికి నాదిత్యరుద్రవస్వగ్రభుక్తిఁ
బొదలు నెవ్వానిగృహంబున మనోహరభారతీభారవహముఖద్విజకులంబు
పథికసంతతి కెరుపణుచు నెవ్వనికంఠమిశ్రితారావంబు మేలుగీల్లు
తే. ప్రజ్ఞ పెంపున నెవ్వానిబలమునకును, బ్రహ్మకొడుకైన లెక్కఁ జెప్పంగఁజాలఁ
డతఁడు నగరోపకంఠచైత్రాగ్రవర్తి, పక్షిమాత్రుండె వాయసపరివృఢుండు. 6

క. ఆకాకి నాకపథమున, నేకాకిత మేఁతలాడ నీరము గములం
గీకామండల మగుసర, యూకాననమునకుఁ బోవ నున్నెడ నటకున్. 7

చ. వెడవెడఁ జంకఁ జిక్కమున వ్రేలెడుచల్దియు సందిలోహపుం
గడియము క్రూరదృష్టిగలకన్నులు నల్లని మేను మూఁపునం

బడిశము జుంజుఱుండల తపొరము జేగురుబొట్టు మేఖలం
గొడవలి గల్గివచ్చె నొకక్రూరకిరాతుఁ డమంధరత్వరన్.

క. వచ్చిన వాయసపతి దన యిచ్చ న్వెఱబొమ్మవంటియితఁ డెందులకై
యిచ్చటి కేతెంచెనొకో, యచ్చెరు వనుచుండ నద్దురాత్ముం డచటన్

క. పులుఁగుడిసెఁ బన్ని వల శాద్వలధరణిం బాఁదుపఱిచి ప్రసన్నకణం
ల్గలపులుఁగు దిను మిడి యగ్గలపుఁదమి న్దాచియుండఁగా దైవగతిన్.

శా. చిత్రగ్రీవుఁ డనంగ నొక్కవిహగశ్రేష్ఠుండు సత్కృత్యకృ
త్పత్త్రివ్రాతము వెంట గుంపుగొని రాఁ బైఁ బోవుచున్ శాద్వల
క్షేత్రస్థేమము దీమము న్గని వశః క్రీడాపరిత్యాగియై
ధాత్రి న్వ్రాలె ననాయ మధ్యమునఁ బత్త్రధ్వానము ల్భోరనన్.

క. పులుఁగులఁ బినుఁగు కిరాతుఁడు, వలఁదవులఁగఁ దిగిచి తగ్గి వగ్గరప
బలఘుతరకీలమున సంచలనముఁ గావింపుచుండె వలసినభంగిన్.

వ. అంతఁ బత్త్రిసుత్రాముం డనుజీవులఁ గేవలయత్నంబునం బిలిచి
లంబున నిందఱ మిజ్జాలంబునం జిక్కితి మీ యపాయంబున కో
యం బూహించితి యోగపద్యాభిమానంబున నిందఱ మిజ్జాలంబుం
బునం బెట్టుకొని దూరం బరుగుద మప్పటికి నొకగతిలేక పోయెడును
బంబున లెం డనిచెప్పిన నొప్పుకొని యప్పులుఁగు లొక్కయూ
బుగా నుప్పరంబున కెగసిన నున్మూలితకీలంబై జాలంబు వెంటరాఁగొ
లంబున గగనమార్గంబునం బఱచుచుండె.

అవిధి విధిమూఁడక వడిఁ, బోవఁగ నిది యననుభూతపూర్వం బనుచు
ధావనమున వనమునఁ బడుఁ, బో విహగముఁ లనుచు బోయ వోయె ని

ఎప్పుడు నేలవ్రాలు శ్రమ మేర్పడ ఱెక్కలు నొచ్చి పెచ్చుగా
నప్పుడ చిక్కు నిప్పులుఁగు లన్నియు నా కని నిశ్చయించి వాఁ
డెప్పటిభంగి వెన్దగిలి యేఁగుచునుండ విహంగమంబు లా
చొప్పున జాల మెత్తుకొని చూడఁగఁ జూడ నదృశ్యమాటయున్.

అతిలాఘవమున నలఘు, పతనకుఁడు న్దత్కపోతపతివెంబడిన
భూతలంబునఁ బఱచెం బత్తుతిర్ఘుంకృతు లఖిలదిశలఁ గ్రమ్ముకొనం

క. జాలగ్రాహి విహంగమ, జాలముఁ బరికింపలేక జాఱనిజాలిం
దూలుచుఁ గ్రూరకిరాతుఁడు, ప్రీలినచరణములతో నివృత్తుండయ్యె

క. ఆవడువున నలచిత్రగ్రీవుఁడు దూరంబు నరిగి భృత్యుల నటుసం

భావించి పలికె నోహో, ధావన మఱియిచట వ్రాలుద మెయిందఱముక్. 18

చ. సకలపథీనమానసుఁడు శాంతిసమగ్రుఁ డజాతశత్రుఁ డం
తకనిభపత్త్యుఁ డిష్టజనతాఘనతాపవిఘాతి సర్వమూ
షకములసార్వభౌముఁడు రసజ్ఞుఁడు ప్రాణముప్రాణ మాహిర
ణ్యకుఁ డిటనుండు నాయనదయామతి *నివ్వలవంతఁ బాడుదుక్. 19

చ. నిలువుఁడు నా విహంగములు నిల్చె బిలస్థలభూమి నంత న
క్కలకల మాలకించి పొడకట్టి యనాయగుణావృతాంగుఁ గే
వలసఖు జీవితప్రతిము వారితమత్సరు వీతరాగుని
ర్మలుఁ బతగాగ్రణిం గని హిరణ్యకుఁ డశ్రువిమిశ్రితాక్షుఁడై. 20

చ. పలికె సఖా యఖండనయపారగతుండవు దీర్ఘదర్శివే
వలన విపత్తిఁ జేట్పడని వాఁడవు నిత్యసుఖానుయాయి వి
య్యలమట నీకు నెట్లొదవెనయ్య విధాతకుఁ బాఁడిలేదు గా
వలయుఁ గదయ్య కర్మమెటువంటిది చూడఁగదయ్య యక్కటా. 21

క. అనిపగ మహిరణ్యకుఁ గనుఁ, గొని చిత్రగ్రీవుఁడనియె గూర్మిసఖా నా
యనుజీవు లలసి రేను, న్వనటం బెగ్గిలితి నఱుకు వలఁ గేవలముక్. 22

క. ఏవాసరమున నెద్దెస, నేవయసున నెట్టికర్మ మేమఱఁ డెవ్వాఁ
డావాసరమున నద్దెస, నావయసున నట్టికర్మ మతఁడుభుజించుక్. 23

క. కలకాలము లే దలమట, కలకాలము లేదు సుఖము కాయము మోసం
గలిగిననటు గొన్నాళ్ళీ, యిల నిటు గొన్నాళ్లు దీనికేలా వగవక్. 24

క. దైవికములైనపనులకు, వావిడుపఁ డవార్యధైర్యవంతుఁడు నయరే
ఖావిభవ యెప్పుడటువలెఁ, గావలెనటు కాకపోదు గా యనితెలివిన్. 25

వ. అనుచిత్రగ్రీవునకు హిరణ్యకుం డిట్లనియె. 26

క. వేసటనొందక లఘువి, న్యాసంబున నూఱుయోజనము లరిగి సుఖ
గ్రాసమునఁ బొదలివత్తు వ, యో సఖ నీకెట్లుమోస మొదవెం జెపుమా. 27

క. అక్కట యాపల్లతలం, జిక్కక నయసరణిఁ ద్రొక్కు చిత్రగ్రీవుం
డెక్కడ యానిర్బాధన, మెక్కడఁ గాలముఁ దరింప నెవ్వరువలఁతుల్. 28

క. ఆపత్సంపద లలఁతులఁ, బ్రాపింపవు ఘనులగాని ప్రజ్ఞంబొడవై
చూపట్టుచంద్రుఁ †డారెం, డోపతగాధ్యక్ష కలవె యుడుసంహతికిక్. 29

* వెల్లవంత=వలవలని బాధ. † ఆరెండు=ఆపత్సంపదలురెండు.

చ. ఉరువిహగవ్రజంబువల*నోదముదంతికిముందుచిల్వకుం
బరుషతమోగ్రహగ్రహణబాధ సుధాంశున కంశుమాలికిం
బరమదరిద్రతాప్తి మతిమంతులకుం గలుగంగఁజేసెనె
వ్వరు నవ తిందునందు బలవంతుఁడుపో విధి నాకుఁజూడఁగాన్.

ఉ. గగనమునంజరించుపతగంబు లగాధసముద్రవారిలోఁ
దగ విహరించుమీలు వలతంతములంబడిచచ్చునవ్విధిన్
దెగిచనస్థానశక్తిగలదే వల దేప్పడఁజింతదీనికై
తెగునెడ కెంతదవ్వయినఁ దెచ్చుగదావిధిదేహధారులన్.

క. అని †యాఖులేఖపతినె, మ్మనమున నస్తోకశోకమగ్నుండై వ
చ్చిన యచ్చెలికానిఁ దగు, లోకనినయనాయాంశ మెచ్చి కొలుకుచునుండెన్

వ. అప్పుడవార్యధుర్యతుహినగ్రావుండగు చిత్రగ్రీవుండు సుహృల్లోకశరణ్యుండౌ
హిరణ్యకునకిట్లనియె.

క. పరహితచరితా యస్మ, త్పరివృతబంధములఁబోలెఁ బరిచరబంధో
త్కర మేలనయుడుక విప్పుడు, పరివారములేనిభూమిపతి పూజ్యుండే.

క. సిరిగూడదు కూడినఁ బదు, గుణగలవాఁ డడఁచిపుచ్చుకొనుఁ బరవీరుల్
సరకుగొనరు సిరిదక్కదు, పరివారములేనిరాజు బ్రతుకునె పొడవై.

వ. అనునప్పలుకుల కలరిహిరణ్యకుండు.

క. హితభృత్యులతో నేభూ, పతిక లఘుస్నేహసంవిభాగము లమరున్
బ్రతివాసర మతఁడుబలో, ద్ధతుఁడై పాలించుఁజువ్వె త్రైలోక్యంబున్.

క. పరివారముపట్టునన్నా, దరలేశములేనిభూమిపవుఁ డభివృద్ధిం
బొరయఁడు సంతతికెడసిన, పురుషునివంశంబు నష్టిఁబొందినభంగిన్.

చ. అదనను జీవితంబిడమి యారజమాడుట లేనినేరము
ల్వెదకుట నిచ్చలు న్బరిభవించుట కింకరసంకులంబునె
మ్మదికినసహ్యమాట దయమానుట ‡పిమ్మటనాడికోల్మ హీ
పదవికిఁ బాసి యొంటిపడుబాటులఁబొందు నృపాలుచిహ్నముల్.

ఆ. సైన్యధాన్యబంధుసమృద్ధముల నెవ్వఁ, డోర్వ గిలిగి పుడమి నుల్లసిల్లు
నతఁడుసూవె నీశజాధీశ వసుమతీ, హిమమయూఖవదన కింటిమగఁడు.

క. అనిపలికి జాలగుణము, ల్దునిములుగాఁ జేసి ఖగపతుల వెడలించెన్

---

* ఓదము=వీన్గులుకూలుటకై మఱుఁగుపుచ్చినగొయ్యి. † ఆఖులేఖపతి=మూషికేంద్రుఁడు. ‡ పిమ్మటనాడికోలు=నున్న మొగముచాటైనతర్వాతదూషించుట.

జనితాదృతి మూషకపతి, ఘను లాప్తులసేగి కోర్వఁగాలేరుగదా. 41

శా. చిత్రగ్రీవునిఁ గౌఁగిలించుకొని తత్సేనందురంతాదృతి
చ్ఛత్రచ్ఛాయఁ బ్రహృష్టుఁజేసి యభివృద్ధి న్విందుఁగావించి యో
షత్రిగ్రామణి పోయిరమ్మనిన బాష్పచ్ఛన్నవక్త్రంబుతో
నత్రాతం దనుఁ దానవీడుకొనిపోయెం బక్షియాలోపలన్. 42

క. జాలమునఱికి విహంగమ, జాలము బ్రతికించి కొలముఃసాముల హేలా
లీలం గలపుటఁ గనుఁగొని, యాలఘుపతనకుఁడు మూషకాగ్రణికనియెన్. 43

సీ. పరధరాధిపభేద కరము నీకరము నీవివరంబు బహుమార్గవిశ్రుతంబు
రాజశేఖరకుమారకమనోహరము నీచర్య నీసన్మానసం బుదాత్త
మవిరళసుగతిహేతువు నీవినీతత్వ మలరునీగుణముధర్మానుకూల
మతివృద్ధిమహిమఁ జెన్నారునీయాకార మిష్టకార్యముల నీయోగి వెరుగు
తే. నీకరుణ లక్ష్మివాటిల్లు నీరసజ్ఞ, సత్యభారతి నిలుచు నీసన్నిధాన
మభిమతార్థంబు లొసఁగు ని న్నభినుతింప, శక్యమే నాకు మూషకక్ష్మాకళత్ర. 44

క. ప్రతిలేనికరుణ నీడజ, పతిమృతికింబాపి సుగతిఁబడసితి నీసం
గతి గాదే యీయాప, ల్లతలంటినమ్ముబోటులకుఁ గృతకృత్యా. 45

క భవదీయస్నేహము నా, కవిరళ తేజోవిధాయి యగు నెయ్యుఁడవై
తవతవలేక మనీషిప్రవరా వర్తింపు మన హిరణ్యకుఁడనియెన్. 46

క. కయ్యమునకు నెయ్యమునకు, వియ్యమునకు సమతపలయు వేఱొకఁడైనన్
గయ్యము గెలువదు నిలువదు, నెయ్యము వియ్యంబు పొసఁగనేరదు మొదలన్.

క. బలహీనుఁడ నేను మహాబలుఁడవు నీ వధముఁ డెల్లు బలవంతునితోఁ
జెలిమియొనరించు జెపుమా, తలద్రివ్వక మ్రింగఁజూచెదవు వెలువడినన్. 48

క. అమరదునీపొత్తు వృథా, భ్రమఁ బెట్టను భోక్త వీవు భక్ష్యమ నే నం
చు మొగంబోడక పలికినఁ, దపుకింపక మఱియు లఘుపతనకుఁ డనియెన్. 49

క. బలవంతము కాకము నే, బలహీనుఁడ ననుచు విడిచిపలుకకు ప్రజ్ఞా
బలమున నధికుఁడ వదివో, బలము శరీరస్థమైనబలము న్బలమే. 50

క. తలద్రివ్వక మ్రింగెద నని, పలికెద వేనట్టిదుస్స్వభావుఁడనే నీ
కలిమిపరాపత్తిదవ, జ్వలనఘనాఘనముగాదె సాధుచరిత్రా. 51

క నీవంటియుత్తముఁడు సుఖ, జీవితుఁడై యున్న నేనుజిరజీవిఁ జామీ
నీవింకఁగలుగఁ జిత్రగ్రీవుఁడు విపదంబునిధిఁ దరించెనొ లేదో. 52

చ. పరుషవిశృంఖలాలపనపంక్తుల సాధుమనంబు లీక్రియం
బొరయఁగఁజేయ నెవ్వరికిఁబోల దహో ఖచరాపగాపమో

ధరపరిరంభసంభ్రమణతత్పరతుంగతరంగహస్తసు
స్తరశరధిం దృణాగ్రశిఖితప్తముగా నొనరింప వేర్చునే. 53

క. అనలఘుపతనవుపలుకులు, విని మూషకరాజు పలికె వెఱ్ఱీ నీతో
ననుబోటి యలఁతినెయ్యం,బొనరించినఁ దగునె తేరొకో బలవంతుల్. 54

క. తనగుణముఁ బూనియున్నాఁ, డనిపగతునినమ్మఁబోల దనిశము మదిలో
ననలశిఖాతప్తోదక, మనలునిపైఁ జింది చల్లనార్చునొ లేదో. 55

క. పోలినదిపోలు నెచ్చోఁ, బోలని యదిపోల దంబుపూరంబునఁ బోఁ
జాలునె శకటములీల, న్నేలం బోతములు నేర్చునే యేఁగంగన్. 56

క. మోసంబూరకతలఁచుం, జేసినమేల్మఱచు విశ్వసించినఁ జెఱుచున్
నాసత్యము దుష్పురుషుం, డోసుగుణా వినుము చూడ ముత్తమునొకనిన్. 57

వ. సుజనశబ్దంబు పురాణోక్తంబుగా విచారించెద నిష్ఠుండయ్యును బహుసుకృతోపలాలితుండయ్యును దుర్జనుం డంకగతక్రూరోరగంబు చందంబున భయంబుసంపాదించుచుండునని వెండియు. 58

క. పరపురుషచింత యంతః, కరణంబునఁ గలిగి మగనిఁ గరఁగించుతలో
దరికరణి హృదయకలుషము, మఱుఁగిడి ఖలుఁడాడుమధురమధురతరోక్తుల్. 59

క. నేరములొనరించిన నుప, కారము సేయుదుము నొవ్వఁగాఁ బల్కునఁగై
వారము మఱపము మే మను, వారలకున్ ఖలులకొండవైగులుగారే. 60

ఉ. కావున నిన్నువంటిబలగర్వసముగ్రులతోడిమైత్రి దుః
ఖావహ మేఁగుమన్నఁ గరటాగ్రణి వహ్నిశిఖానురూపకో
పావిలచిత్తుఁడై పలికె నద్దిర మాటలజోలిఁబన్ననే లా
విను లక్షుఁడైనవదల న్నినుమూషకలోకవల్లభా. 61

క. చెలిమికి దూరస్థుఁడవై, తొలఁగిచన న్మదిఁదలంచెదో యదినాతోఁ
గొలుపదు త్రవ్వెద ధరణీ, తలవివరముఁ ద్రవ్వినల్లఁ ద్రావెదఁ బిదపన్. 62

క. అనలమునఁ గాఁచిలోహము, నెనయించినకరణి వేఁడినేనియుఁ బ్రజ్ఞా
ధనులఁ దనుఁగూర్చికొమ్మను, మనువచనము వినవె యదియు మత మెవ్వరికిన్. 63

క. ఖలుఁడుసుఖభేద్యుఁడతిమృ, త్కలశగతి న్సజ్జనుండు గాఢాగ్నిశిఖా
కులతప్తకనకఘటముం, బలె దుర్భేద్యుండు చక్కఁబడఁడు మృదూక్తిన్. 64

తే. అట్లుగావున నినువంటి యనఘచరితు, వెఱపునినైన సఖునిఁగావించుకొనఁగ
వలయు మేల్గోరనావంటివాని కనిన, సమ్మదంబంది మూషకస్వామిపలికె. 65

క. అరివలెనుండుట క్రియలం, బరమాప్తస్ఫూర్తిఁ దేటపఱచుట యదివో
యరయ సుహృల్లక్షణమో, కరటా నీయందుఁ దోఁచెఁ గదయీసరణుల్. 66

క. మతిశంకలేక మూషక, పతివివరమువెడలి కరటపరివృఢుతో న
ప్రతిమగుణరత్నఖనితో, గతకల్మషుతోడఁ జెలిమికాఁడైయుండెన్. 67

వ. అట్లు కృతసఖ్యుండగు నయ్యుందురుముఖ్యుండు విందుఁబెట్టి వీడ్కొలిపిన దరి ద్రునకు నిధానంబునుంబోలె సుహృల్లాభంబుఁ గనుట కలరుచు సింహవ్యాఘ్ర గజగవయ గండభేరుండ ప్రముఖజంతు వహనంబులగు గహనంబుల విశ్రమించి సారంబులగు సస్యాహారంబులఁదెచ్చియిచ్చుచు నచ్చిక బుచ్చికలడరఁ గొంతకాలం బుఁగడపి యొక్కనాఁడా వాయసపరివృఢుండు హిరణ్యకు డాయంబోయి యిట్లనియె. 68

ఉ. పోయెదనిప్పుడన్యవనభూమికిఁ బ్రాణసఖా ప్రమోదసం
ధాయక నన్నుఁబంపు మనినన్విని ధైర్యము వ్రస్సి వెల్వెలం
బోయినమోముతోడ బలిభుక్ప్రవరుఁ బురుషార్థసంగ్రహో
పాయు సుహృద్విధేయుఁ గని పల్కె హిరణ్యకుఁ డార్తచిత్తుఁడై. 69

చ. ఇట నను డించి యేమికతమేఁగెదు చెప్పఁగదన్న యెట్టు లె
క్కటినిజరింతువన్న త్రుటికాలమునిన్నెడఁబాసియున్కి దు
ర్ఘటముగదన్న నాకడనుగల్గినయీధృతియెందుఁబోయె ని
ప్పటికివిచిత్రమన్నవిధిభద్రవిరోధిగదన్నయన్నఁగాన్. 70

చ. అని కనుదోయిచెమ్మగిల నాకృతివిస్మృతినొంద మూర్ఛవో
యినబలిభుగ్విభుండు చలియించి గరుద్వ్యజనానిలంబునన్
దనువిడిఁదేర్చి యోపరమధార్మిక నిన్నెడఁబాసిపోవ నే
ర్తునె సకలార్థసిద్ధఫలదుండని చూతుఁగదయ్య నిన్నిటన్. 71

ఉ. నాపయనంబువిన్మ కరుణావరుణాలయ వృత్రశాత్రవా
సాపుతకాననోర్వి నాకసారసరోవర మొప్పనందు వి
ద్యాపరమేష్ఠి మంథరకుఁ డన్కమఠాగ్రణి మత్సఖుండు సౌ
ఖ్యారవహుఁ డుండు నప్పరహితార్థిఁ గనంగొని సాదరంబునన్. 72

ఉ. ఆతఁడు నాకుఁ బ్రీతివశుఁడై యొనరించు ననూనమీనమాం
సాతిథిజక్రియ న్బలసమగ్రుఁడనై చనుదెంతుఁ గ్రమ్మఱన్
నీతిధురీణ నన్ననుపు నీ వనఁ గన్నులశోకబాష్పధా
రాతతు లుప్పతిల్లఁగ హిరణ్యకుఁ డాతనిఁజూచి యిట్లనున్. 73

చ. ఉడుగనివంత నింతతఁడ వూఱటలేక పరాకువోలె మే
నడిచిపడంగ నున్కిఁ గహనాంతరచింత జనించె నంఘుఱ్ఱిలి
వ్వఁడవన నూదసైఁపవు కృపానిధి మందరకాంకు డుండు న
క్కఁడకరుదెంతు నింపడరఁగా ననుఁదోడ్కొని పొమ్ము నావుడున్. 74

వ. లఘుపతనకుం డిట్లనియె. 75

ఉ. కాదన నేలవచ్చెదవుగాక సఖా వెఱఁ గావహిల్లె ని
ర్వేదము నీకు నెట్టులొదవె న్వివరింపుము నావు డాత్మ సం
పాదిహిరణ్యకుం డనియె బల్కఁల కిందెడలేదు నెవ్వడిం
బోదము పోయియవ్విపినభూమి సమస్తముఁ దెల్పిచెప్పెదన్. 76

క. నావుడు దత్ప్రతిభాషావర్గుం డగుచు వాయసస్వామి నయ
శ్రీవిభవు మూషకాగ్రణి, వే వాతన్గఱుచుకొని దివిజమార్గమునన్. 77

వ. పఱచి యగాధశరంబగుతత్సరోవరంబున కరిగితీరంబున హిరణ్యకు నునిచిలఘుపతన
కుం డుదారస్వరంబునం బిలుచుటయు సందర్శనకుతూహలంబున మందరకుండచ్చెం
దమ్మికోలఁకు వెలువడి ప్రత్యుత్థానం బాచరించి వారిచరతరసాహారంబున విముక్త
మార్గశ్రములంగావించిస్వాగతాదికార్యంబులు వేఱవేఱనడిగినలఘుపతనకుండుకమఠ
పరివృఢునాలోకించి. 78

చ. అనుదినదూరితాఖిలశరా కమఠా యితఁ డాఖుఁలేఖరా
జనుఁగుసఖుం డుపాయసఖుఁ డార్తిశరణ్యుఁడు పుణ్యుఁ డిట్టియి
మ్మనుపథవర్తి వంత నడుమంబొడమం బొడవేఁది యిల్లువి
డ్కొనియిటకేగుదెంచె నినుఁగూర్చి సుఖస్థితినుండు నాతఁడై. 79

క. క్షణభంగురములు కపట, ప్రణయంబులు ప్రాణపతనపర్యంతంబున్
గుణవికలత శశశృంగము, ప్రణుతమతీ యిట్టిసాధుపథగాములకున్. ✓ 80

క. నావునకుఁ బాపెఁ జిత్ర, గ్రీవుని నిటువంటిపుణ్యకృత్యము లాహా
యేవేళ నెన్నిసేసెనొ, కో వేడుక నీహిరణ్యకుఁడు మందరకా. 81

వ. అని లఘుపతనకుం డుత్కర్షించిన నాశ్చర్యధుర్యుండై కమఠవర్యుండుహిరణ్యకున
కిట్లనియె. 82

చ. విమలనీచరిత్రములు వింటిఁ గృతార్థుఁడనైతి సత్యభా
షానిధి యోగిమానసముచాడ్పున నిర్మలమైననీమహా
మానస మెట్లు దుఃఖగరిమ న్భజియించె విచిత్ర మివ్విధం
బే నిటవిందుఁ జెప్పఁగదవే యన నాయన కాతఁడిట్లనున్. 83

ఆ. అనఘ సఖ సఖుండ వగు నీకు మామక, వ్యథనకథన మభినయం బొనర్చి
సరసతావకాశ్వాసనభాషితంబుల, గాఢసమ్మదంబుఁ గాంతు నేను. 84

సీ. విను మహీశారోప్యమనుపట్టణము సర్వసౌభాగ్యవిలసనాస్పదము గలదు
దానిచెంగట వసుంధర బొక్కయొనరించుకొనియేను గౌరవంబున సుఖింతు
నటకుఁ జూడాకర్ణుఁ డనుతుచ్ఛసన్న్యాసి చనుదెంచి యేనుండుమనికిలోను
గాఁ గట్టిమఠము భిక్షు మనుదినము ధరాత్రిదశులవీఁటఁ బెట్టుదురు గాన

తే. నెట్టుకొని పెద్దగాలంబు నిలువవాసి, స్నానమొనరింపఁ డోంకారజపముఁ దడవఁ
డాంతముగఁ జూడఁ డంతవేదాంతవిద్య, కడుపుకైలాస మగయ నక్కట్టయతికి. 85

క. భక్షింభరుఁ డగునలయా, భిక్షుఁడు వేసరక తిరగి భిక్షించినయా
భిక్షము భక్షింపుదు ర, క్తాక్షుండై కేలఁగోలనదలింపంగన్. 86

క. ఆయతిహారిమిసఖుఁడు క, థాయుతశతపాఠగుఁడు బృహస్ఫికనువాఁ
డాయెడ కేతెంచె నుతా, మ్నాయా యొకనాటిమట్టమధ్యాహ్నమునన్. 87

క. వచ్చిపురాణోక్తకథల్, నెచ్చెలి వినుమనుచు నాతనికి రసధారల్
పిచ్చిల వినిపింపఁగవిన, కచ్చెనఁటి పరాకుఁబోలె నటు మొగమయ్యెన్. 88

క. అగుటయుఁ గథకుండాయతి, మొగమారసి పలికె మాఱుమొగమైతివయో
తగునే నీతో రసపు, ష్టిగ నేరుపు మెఱసి కథలఁ జెప్పుచునుండన్. 89

శా. నాకీచందముఁ దెల్పిచెప్పు మని విన్నంబోయినం బల్కెఁ జూ
డాకర్ణుండు సఖా సుఖంబెఱుఁగ కిండ్లం భిక్ష భిక్షించి యం
టాకుం బొత్తికఁ బెట్టి తెచ్చి మఠమధ్యం జేర్చి తింజూడు నేఁ
డీకొండాటపు బెల్క యుల్కెఱుఁగ కిట్లేపార భక్షించెడున్. 90

క. నా కెక్కడిదిపరాక, స్తోకంబగు వలుక నెలుకఁ జూచెద నని చూ
డాకర్ణుఁడు పల్క బృహ, స్ఫి కాకర్ణించి యుల్లసిల్లుచుఁ బలికెన్. 91

క. ఇక్కలుఁగున నిమ్మూషక, మెక్కటి మెలఁగుటకు వలయు హేతువుగలుగన్
బొక్కలగములై యుండుట, నిక్కమిట్లొంటి నుండునే యుందురువుల్. 92

క. ఒలువనితిలలకు నొలిచిన, తిలలీ నత్రాడు వసుమతీసురభార్యా
తిలకమునం దొకకార్యము, తిలఘాతిని యూహ సేయదే పూర్వమునన్. 93

క. ఆకరిణి జాంగలంబున, నేకాకితఁ దిరుగు నెలుక యెడ నూహింతుం
గాక యొకకార్యమనఁ జూ, డాకర్ణుం డనియె నాదృఢప్రజ్ఞునకున్. 94

క. ఒలువనితిలలకు నొలిచిన, తిలలీనత్రాడు వసుమతీభార్యా
తిలకమునందే కార్యముఁ, దిలఘాతిని నిశ్చయించె దెలుపవె యనుడున్. 95

వ. బృహస్పతికిట్లనియె. 96

క. తొలుత నొకానొకభూసుర, నిలయము కడుపసతియగుట నివసించితి న
న్నిలయపతిప్రొద్దుపొడుపునఁ, గులభామం బ్రీతిఁ బిలిచికొని యిట్లనియెన్. 97

క. బాలాబుధసంతర్పణ, కాలంబిది యదనుగూడఁ గావింపు శుచి
త్వాలంకృతవై చరువన, లీలావతి పతికిఁ గొలుచులే దనిచెప్పెన్. 98

క. చెప్పినయజమానుఁడు సతిఁ, దప్పకవీక్షించి పలికెఁ దన్వీ గృహమం
దెప్పుడుఁ దఱుగదు కొలు చిట్లొప్పునె లేదని విలాసయుక్తులు నెరపన్. 99

క. సంచయముచితంబగు నతి, సంచయ మనుచితము సర్వజనులకు నెందున్
సంచయలోభంబున నొక, పంచక మారూఢచాపనశమునఁదెగదే. 100

క. నావినివాతెరపై నొఱ, పై విన్నాణంపునగవు లత్తమిల న
జ్జావతి పతిఁగనుఁగొని తన, కావిధ మెఱిఁగింపు మనిన నతఁడిట్లనియెన్. 101

చ. అవహితబుద్ధి విన్ము మధురాధర యామిషగంధదిక్కణం
బవునొకపక్కణంబున మృగావ్యాతిలిప్సుడు కూరిరపుల్కస
ప్రవరుఁడు గ్రాలు నాతఁడు ప్రభాతమున న్మృగఘోషభీషణా
టవిచొరఁబాఱి చేరి యచటం గిరిమేషము నేసె నెక్కటిన్. 102

క. వాలికతూపుల నేలం, గూలినయలకొండగొఱియఁ గొని తనియక నా
శాలంపటుఁ డొక్కఁడయా, భీలాటవిలోన నిర్లపితుఁడై తిరుగన్. 103

వ. ముందరనొకశాద్వలంబున. 104

ఉ. క్రమ్మి చతుష్ఖురిం జమురు కాలువలై ప్రవహింప రోమపుం
గుమ్మలఁ బార్శ్వభూజములు గూకలువ్రత్తులుగా ముఖంబునం
దుమ్ములురేఁగ మైమఱచి దున్నుచు ముస్తలఁదెల్చి కుంజముల్
గొమ్ములఁజిమ్ముదాని నొకఘోరవరాహముఁ గాంచియాత్మలోన్. 105

క. కలమంబోలినయీారమే, కలము మదాహారమునకుఁగా దైవంబీ
పొలముతలఁజూపెఁ బొమ్మని, యలరుచు వాఁ డప్పుడమ్మహాకిటి నేసెన్. 106

ఉ ఏసిన బద్ధరోషమున నేకల మేడ్తెఱఁదూఱిపుల్కసా
గ్రేసరు మోరనెత్తితలక్రిందుగఁద్రెళ్ళగవైచి వజ్రధా
రాసునిశాతదంష్ట్రికల వ్రచ్చి యచేతనుఁజేసి నొప్పిచే
గాసిలి ప్రాణముల్విడిచెఁ గన్నరమూసి ధరిత్రినత్తఱిన్. 107

వ. ఇట్లున్న మృగనరశవంబుల గాలివాఱఁ గాలప్రేరితంబై దహ్యాకనామధేయం
బొక్కజంబుకంబువచ్చి కొండగొఱియ రెండుదినంబులకు నేకలంబు పదినాళ్ళకు

నరుఁడు నాల్గువారంబులకుం జాలుఁ గృతసుకృతవిశేషంబునం గాక యీబహు
సంచయం బెవ్వరికి నని తలంచి హాలాహలాభంబగు లోభంబునఁ గొంచెపడు నని
యెంచి యం దేమిటిని గంటిపెట్టం జాలక పండ్లయూటలు ద్రావుచుఁ గొండొకతడ
వుండి మందుదండియాఁకటిచిచ్చునకుం గాక యబ్బక్కనక్క యెక్కిడిన శరాస
నంబుం గడిసి నేఁడీ ధనుఃప్రతిబంధంబునఁ బ్రొద్దుఁ బుచ్చెదం గాక యని నిశ్చయించి.

క. ఆపిసిని నక్క చాపము, కోఁపంగిట నిఱికి నరముఁ గొఱికినరభసం
బేపార మిడిసి మర్మని, రూపణ మొనరింప నక్క రోజాచుఁ గూలెన్. 109

క. అతిసంచయపర మిదిపో, రతిబోటీ వలగు దాఁపురంబన నగుచుం
బతికి సతిపలికె దాఁప, న్గతమేమీ ధాన్యమొదుఁగు గాలేదింటన్. 110

గీ. ఓలఁ దిలలు గ్రమ్మి తైలంబుఁ దివిచి ధూ, తౌఘవిసరకృసరమాచరింతుఁ
బుడమివేలుపులకు నిడుమన్న నవ్విప్ర, సింహుఁ డబల నట్లచేయుమనియె. 111

క. నూనియఁ దివియుటకై తిల, లానీరజనయన దెచ్చునపు డొకకాల
జ్ఞానిహలికాలయాగ్ర, స్థానంబుననుండి చేట జడియన్రావలెన్. 112

క. ప్రాలినఁ జెల్లాచెదరై, నేలందిలలొలికె నంతనివ్వెఱఁగున న
న్నాలోలక చూచునెడన్, వాలింపక సతికిఁ బ్రాణవల్లభుఁ డనియెన్. 113

క. కలికి యున్నట్టి యా క్రియ, నొలికినతిలలెత్తి దంపు మోర్పున నన న
క్కలకంఠి యట్లచేసె, న్నలి భీతిప్రీతులగ్గలములై పెరుఁగన్. 114

క. ఆమహీసురశరణమునకుఁ, గామందకి యనఁగ నొక్క గానులది సుతుల్
నేమింపఁ బేసగంపం, గోమలగతి నువ్వులమ్ముకొన నేతెంచెన్. 115

క. ఏతెంచినఁ బలుకులసరి, నాతీ ముడినువ్వులిత్తె నా కని విప్ర
స్త్రీతిలకము ముదలించిన నాతిలలది యంటువడియె ననియూహించెన్. 116

వ. అట్లు బుద్ధికౌశలంబున నేను నియ్యుత్తియ యెలుకచోట నిక్షేపంబుగలదని నిశ్చ
యించితినని చెప్పి ఫాలకుద్దాలంబుల నా మెలంగు కలుఁగుఁ ద్రవ్వి నాచేతఁ జిరస్థా
పితంబగు ధనంబుఁ బుచ్చుకొనియె నది మొదలు పొదలుటలేక కష్టోటనాహారో
పపాదనంబునకుం గాక వితాకుండనై మందు నాకఁటికి మిడికినడీఁకి యునికిపాసం
గక మఱియుమఱియు భిక్షాపాత్రంబువలగొనుచుండితి నట్టి నన్నుం గనుంగొని
చూడాకర్ణుం డుపాలంభగంభీరభాషితంబుల నిట్లనియె. 117

క. అతిరక్షితార్థమంతయు, నితరులపాలయ్యెఁ జెడుగు టెఱుకా నీయు
ద్ధతి మాన వీఁకనిదేమీ, గతవిభవులు సాధుతరులు గారా పుడమిన్. 118

క. ధనముడిగిన నుడుగ మునీ, తనుజనితంబైన దుర్మదము నేఁడనుచున్

గన లునికిఁ గనికరంబఱి, తనపదిలినకోలచే నతఁడు ననువ్రేసెన్. 119

క. వ్రేసినవ్రేటు దురంత, త్రాసంబున నోహటించి తప్పించుకొనన్
గోసంబున నన్యాస, న్యాసి నిరీక్షించి మఱియు నపు డిట్లనియెన్. 120

క. అర్థమునఁ బండితుండగు, నర్థమునం బలసమగ్రుఁడగు నర్థమునన్
బార్థివుఁడగుఁ బుణ్యుండగు, నర్థమునను భువనపూజ్యుఁడగు నరుఁ డెందున్. 121

గీ. అన్వవాయవృద్ధు లాచారవృద్ధులు, శౌర్యవృద్ధు లిద్ధసత్యవృద్ధు
లాగమార్థవృద్ధు లఖిలార్థవృద్ధులు గొలుతురర్థవృద్ధుఁ గోరి నేఁడి. 122

చ. వినఁ డని రోయ రంధుఁడనిపేఁగరు తుందిలుఁడంచు గేలిఁ గాఁ
గొనరు వికర్ణుఁడంచుఁ దగఁ గూయరు వామనుఁడంచుఁ బోరు దు
ర్జనుఁడనిపాయ రజ్ఞుఁడని మానరు నిష్ఠురరోగపీడితుం
డనరు కునిష్ఠుఁడంచుఁ జెడనాడరు భోగిను లర్థవంతునిన్. 123

చ. కనకముఁ గూర్చి యెన్నఁబడుఁ గాదె సమస్తగుణంబు లర్థమె
వ్వనికి వసుంధరం గలదు వాఁడె కులీనుఁడు వాఁడె పండితుం
డనఘుఁడు వాఁడె వాఁడె సకలార్థవిధిజ్ఞుఁడు వాఁడె వక్త వాఁ
డె నయపరుండు వాఁడె ప్రకటప్రియభాషణుఁడుం బ్రసిద్ధుఁడున్. 124

క. కలవానికిఁ జుట్టంబులు, గలరు హితుల్గలరు భటులు గల రఖిలంబున్
గలదు మఱి లేనియట్టిది, కలవానికి నీడు జోడు గలదా జగతిన్. 125

క. చిట్టడుగులేనియిల్లును, జుట్టంబులులేనిచోటు శూన్యము శూన్యం
బెట్టును దుర్జనహృదయము, కట్టా మదిసర్వశూన్యకము లేమి సుమీ. 126

క. ధనహీనుఁ డధముఁ డల్పుఁడు, ధనహీనుఁడె మూఢుఁ డప్రధానుఁడు ధన న
ద్ధనహీనుఁడు తలపెట్టిన, పని గ్రీష్మసరిజ్జలంబు పగిది నడంగున్. 127

వ. అని భిక్షుకుండు నన్నధిక్షేపించిన రోసి నివాసత్యాగంబు చేసివచ్చితి నిన్నుఁ
డాసితి. 128

క. త్రిదశవిమానారోహణ, మొదవిన నవమానధరణి నుండుట కష్టం
బదియొఱిఁగి నీతివిద్యా, విదుఁ డభిమానస్థలంబె వెదకుం బుద్ధిన్. 129

క. యమయాతన యవమాన, క్షుమబాధ యిఁకెద్ది దానిఁ గడచినవిద్యా
గమసౌఖ్యాగమవిత్తా, గమశూన్యంబైనచోటఁ గాదు వసింపన్. 130

క. పరదేశం బెఱుఁగక తను, గరగరిక న్విడువముదుఁ గలిగి నడుమఁ జే
దరికము వాటిలి తిరియ, న్దిరిగిన ననుబోఁటి కమరునే యింతైనన్. 131

ఆ. వెల్లివిరిసెఁ బెంటివిద్యలు మగవిద్య, లడుగుపట్టెఁ గ్రిందు పడిరి బుధులు

హీనజాతిపురుషు లెచ్చిరి యాచింపఁ, బోవు టెట్లు నేఁటిభూమిపతుల. 132

శా. ఏల త్రుందనతాన లేమయినలేవే యంచు బోధించునే
నూలంబెట్టఁగఁజాల మాధనృపుఁ డోహో నామహాసాహితీ
శూలంబు ల్సెవులాడసొమ్ములనొచ్చుంజచ్చుఁదత్కాల్మషం
జేలా యంజలిచేసి మ్రొక్కెదఁ బదార్థచ్ఛాన్నిశాచారికిన్ 133

క. అనుచితభాషణముఖరా, ననులమె విటగాయకులమె నటులమె గాఢ
స్తనసంభరనమ్రవధూ, జనులమె మమ్మేల రాజు సంభావించున్. 134

ఉ. కోరినగద్యపద్యముల గూరిచి యిచ్చెద నంటినేని ని
స్సారము లంచువిత్త మిడఁజాలక కేరడమాడులోభి యా
నేరుపు నేర్పుగాదు తనునిందలఁబెట్టు రసజ్ఞుఁడైనయు
ర్వీరమణుండుగల్గినఁ గవిత్వము సర్వఫలంబు లీదొకో. 135

చ. పలుకులశబ్దసర్గశతపత్త్రభవంబులు జాతవర్ణముల్
బలుకడుపుల్ నిరుక్తికలు ప్రజ్ఞ లనర్థకము ల్విచారముల్
వలవనికీవినవ్వఁ బెఱవారి నెఱుంగక తిట్టికూళ లే
పోలుపునఁదప్పులొప్పులనఁ బోదురొకో సుకవిప్రబంధముల్. 136

చ. మెఱసి బహుప్రబంధతను మెచ్చుట మెచ్చుట యెచ్చమంటి పా
పటిమటి నెన్ను టెన్నుట నిరక్షరకుక్షు లధీశశిక్షితుల్
కటకటులు భూరుహాశ్మపశుకల్పులు మత్కృతిఁ బ్రస్తుతించినం
గఱగఱఁబోవనాడిననుగల్గవు నామదిమోదఖేదముల్. 137

క. పరిహాసకులకు నటులకుఁ, దరుణులకును లంజెదారితమ్ములకుం గా
పురుషులకు గాయకులకుం, బొరయింతురు రాజు లీరుపో సవసులకున్. 138

ఉ. ఏపున సంచితార్థము పరేంగితభావ మెఱింగి యీఁగి మే
లై పొగడొందనిచ్చి నెఱయన్నఱచు న్నెఱదాత యిట్టిచో
దాపయిత్వప్రభోధవశతం బొరఖుంది యనంతరంబు సం
తాపమునొందువాఁ డధముదాత వృథాలపితంబులేటికిన్. 139

ఉ. దాతలు దాత లం డ్రదియతథ్యము లోకమునందులేఁదుపో
దాత యతండుగల్గినను దాతృతదాసకలార్థులందు నే
లాతులతూఁగకుండు నచలస్థితి నింతయెఱింగి యే నహో
దాతబుణాను బంధముగ దాయనిచిత్తమునందలంచెదన్. 140

క. తలలెత్తి మూఁపవెఱతురు, వెలవెలనై మాఱుపలుకవెఱతురు నెఱయం

జలియించిపఱతు రిస్సీ, కొలప గతులుగారె యాచకులు లోభులకున్. 1

క. చరణములుపడఁకు భీతిం, బరవశమానోడలు రాలుపడు నెలుఁ గాహా
మరణమున నెట్టి చిహ్నము, లరయ న్యాచకుఁడుదాల్చు నచ్చిహ్నములన్. 1

వ. అట్లగుటఁ జింతించి యాచకత్వంబునకుఁ జిత్తం బొడఁబాటుగాదు దారిద్ర
బునం బ్రజ్ఞాహైన్యంబు వాటిల్లుఁ బ్రజ్ఞారాహిత్యంబున సత్వక్షీణంబగు సత్వక్ష
శనంబునఁ దిరస్కృతివొడముఁ దిరస్కరణంబున నఖర్వనిర్వేదనం బావహి
నిర్వేదనంబు శోకంబుదెచ్చు శోకంబుబుద్ధిబాధకంబగు బుద్ధినాశకారి కావున
నంబఖిలవిపదాస్పదంబని పలికి మఱియును. 1

చ. సముచితభాషణంబులకుఁజాతురిసాలక యున్నమాన ము
త్తమము పరాంగనాగమనతత్పరుఁడయ్యెడు దానికంటె షం
డమతము మేలు చాడికినోడంబడియుండెడిప్రత్తికన్నఁ జా
వుమిగులలెస్స యాన్యవసువుల్గొనుకంటెను భిక్షమొప్పగున్. 1

క. దీపమునఁ దమము రోగ, వ్యాపృతిఁ జెలువంబుహరిహరాఖ్యానముచేఁ
బాపమువలె యాచ్ఞావిధి, వేపాయుగురుత్వ మతులవిజ్ఞాననిధీ 1

చ. అలఘుగుఘుత్వమూలమగునర్థిత కంజలిఁజేసి మ్రొక్కి వీ
డ్కొలిపి నృపాలురంగొలిచి కూర్చెదభూరితరార్థమంచు నేఁ
దలఁచితినేని పట్టియులఁతెంబడుటొక్కటి నిర్దయుల్ఖలు
ల్దులువలు హీనమర్త్యఫలదుల్నరవల్లభు లీరు విత్తముల్. 1

క. తానీఁగొఱమాలిమహా, హీననరాధిపుఁడు భాగ్యహీనుఁడను న్న
న్నానార్ద్రా లసుభటులవి, ద్యానిధులన్ హాలహలాభమగులోభమునన్. 1

వ. అట్లగుటరాజసంశ్రయంబును గూడదు ప్రేష్య భావంబు మృత్యుద్వారంబు రో
యుఁ జిరప్రవాసియుఁ బరాన్నభోక్తయుఁ బరగృహశాయియు జీవన్మృతు
చెప్పి హిరణ్యకుండువెండియు. 1

క. సంతుష్టిపర్ష్సంగు, ప్శాంతఃకరణునకువెఱచునతిశయతృష్ణా
క్రాంతములుభీతిచింతా, సంతాపక్లేశరుజలసంపాదింపన్. 1

ఉ. వీతఖలీనమై యతులవేగమున న్మానగాలు ద్రొక్కుతృ
ష్ణాతురగంబు నెక్కి యలసస్థితిఁజేట్పడకుండు వానికిం
జేతెడునేల మేరుగిరి సింధువువత్సపదంబు దూరతృ
ష్ణాతనుఁడైనవానికి నిజాంకగతార్థము దవ్వు పెద్దయున్.

క. ఆశాశృంఖలఁబడినా, నాశాభూములఁజరించునదిపో యాసుఖ

శ్రీశోభితుఁడై నిలుచును, ధీశరధీ మనుజుఁడొక్క దెసయురదేరన్. 151

క. పొట్టకుఁగా బట్టకుఁగాఁ, జెట్టాడుం దెలివిలేని జీవి నిజంబా
నొట్టపు శపథంబవుఁ దనుఁ, బుట్టించిన దేవుఁ డిచ్చుఁబో కర్మగతిన్. 152

క. కూరలు నారలు చాలవె, పూరింప న్మృష్టమేల పొట్టకు మఱి యే
నీరైనఁ జాలదే పన్నీరేటికి నింగిఁ గీలొక్క నినచిచ్చార్పన్. 153

ఉ. ఊయెలమంచము ల్పసిఁడియుప్పరిగ ల్గపురంపువీడెము
ల్మాయనిపుట్టము ల్రుచిరమండనము ల్గడలేని క్రొవ్విరు
ల్గాయనగాయనీమధురగానసుఖంబులు గన్నగాని సీ
పాయదె యన్నమాత్రమునఁ బస్తుసుజీవికిఁ జక్రవర్తికిన్. 154

చ. ఒకరునికిచ్చు నిచ్చి తిరియు న్మఱియొక్క. తఱిన్మహోగ్రుఁడై
యొకరునిఁ జంపుఁ జంపిపొలియు న్మఱియొక్కనిచే బలాఢ్యుఁడై
యొకరునిఁ ద్రోయుఁ ద్రోచి మఱియొక్కనిచేఁ బడు నేలు నొడ్ల నొం
డొకరునిఁ గొల్చు మానవుఁ డొహో సుఖవృత్తి విపత్తివృత్తులన్. 155

వ. అట్లగుట మేలుగీళ్ళు దేహధారులకుప భోగ్యంబులుగదా యని తెలిసి మదింబదిలంబు సేసికొని యిచ్చటికివచ్చితినని హిరణ్యకుండు చెప్పిన మందరకుండతని నాలోకించి.

క. నెలవునఁ బూజ్యంబులు నఖ, ములు దంతంబులు శిరోజములు గాలగతిన్
నెల వెడలియుఁ బూజ్యంబులు, పులిగోళ్లును దంతిదంతములు చామరముల్. 157

క. హరి పెంపువడయుఁ గరి పెద్దరికముఁ గను సజ్జనుండు తగఁ బూజ్యుండౌ
నిరవెడలియు నిరవెడలినఁ, గరటము దెగుఁ గుజనుఁ డీల్గుఁ గడచను మృగముల్. 158

క. అరివిదళన పరుషుండగు, పురుషుండెచ్చోటనయినఁ బూజ్యుఁడు గాఁడే
ఖరనఖరవిజితకరిహరి, తిరముగ మృగరాజ్యమేలదే పెఱయడవిన్. 159

క. కదలని నీటికి మీనము, లెదురెక్కు నెయుఱిదిఁ బాఱు నేటికిఁ బోలెం
బదవి నిరుద్యోగులఁ బొం, దదు సోద్యోగులనకాని ధార్మికముఖ్యా. 160

క. తనపుణ్యపాపవశమునఁ, దనివిసనవ్వచ్చు సంపదలు నాపదలున్
ఘనతకు నుబ్బక హీనత, కనుతాపం బందకుండునది సుజనునకున్. 161

క. శకటగతచక్రభంగి, న్సకథములై తిరుగుచుండు సుఖదుఃఖము లిం
తకు ఖేద మంద నేటికి, నకటా సంతోషయుక్తుఁడగు టొప్పుఁగదా. 162

మ. సతతోత్సాహపరుం గ్రియానిపుణు భాస్వద్దీర్ఘసూత్రుం గృత
జ్ఞతము న్సత్యధురంధరు న్మధురభాషావేది సౌహార్ద్రభా
సితు నారంభవిజృంభమాణుఁ గరుణాసింధు న్శుచి న్శాంతు ని

ర్జితకామ్ముం దనుఁదా వరించు సిరి నిర్ణిద్రానురాగంబునన్. 16

క. అవివేకి నలసు విగత, వ్యవసాయుని హీనుఁ గుటిలవర్తను నధముం
గువిచారుఁ జేర దిందిర, యువతీమణి వృద్ధుఁ గవయునొల్లనిభంగిన్. 16

క. సరసప్రజ్ఞోత్సాహ, స్ఫురితుఁడ వీ వెచటనున్నఁ బూజ్యుఁడవు గుణా
కర మూషకకులశేఖర, యురగేంద్రుఁడు గానునిన్ను నుత్కర్షింపన్. 16

చ. అడఁగని లేమిఁబొట్టుపొలయ్యును ధీరుఁడొకానొకప్పుడున్
విడిచిచరింపఁ డగ్రపదవిం గృపణుండ దసమానసంపదం
బొడవయి యుండియుం దనయఁబోఁ డదియెవ్వరికేదిమార్గ మా
నడవడి వారొకింతవిడనాడరుగా గడతేరునంతకున్. 16

క. ధనవంతుఁడనని మదమున్, ధనహీనుఁడ నని విషణ్ణతం బొందవు హ
స్తనిహతహేలాకందుక, మనఁ బాతోత్పాతములు జనావళికగుటన్. 16

సీ. జలధరచ్ఛాయయు ఖలమైత్రియును నవసస్యంబు యువతియు జవ్వనంబు
సంచితార్థంబు నీషత్కాలభోగ్యము ల్గావున వలవంత గా దొకింత
తెలు పంచగమికి నెమ్ములకుఁ జిత్రిత కీరములకుఁ బచ్చదనంబు గలిగె మొదలు
నేవేల్పువలన నద్దేవదేవుఁడు పోషకుఁడు సుమ్మె మదినేల కలఁబడఁగ

తే. జనుఁడు బ్రతుకునూఱు సంవత్సరములంత, కాల మెవ్వఁడుండు మేలుతోడఁ
గౌతుకమునఁ గొంతకాలము చను మహా, కష్టవిష్టిఁ గొంతకాల మరుగు. 16

వ. దానతుల్య యగు విధియును సంతోషసమం బగుసుఖంబును శీలసదృశం బగుభూ
షణంబును నారోగ్యసదృశం బగులాభంబును లేదుగదా ! యిమ్మాటలకుం
మదీయ స్నేహంబునఁ గాలం బపనయింతురుగాక యని మందరకుండు హిరణ్యా
నాశ్వాసింపుచుండె నప్పుడు లఘుపతనకుండు. 16

క. శమితశోకమహాని, ర్గమనప్రమదంబు హృదయగతచింతాశ
ల్యముఁ బెఱికివైవ నీమై, త్రి మనోజ్ఞవిశల్యకరణి ధృతినూహింపన్. 1

క. ధరలో సత్పురుషులు స,త్పురుషాపద్ధరణ హేతుభూతులు గారే
కరులుబ్బలిలోఁ జిక్కినఁ, గరులెత్తఁగఁ జాలియుండుఁ గాదే పుడమిన్. 1

క. నిధిసాధకుఁడు ఘనాంజన, విధిని క్షేపంబుఁ జూపువిధమున సుజనుం
డధికాపదార్తులకు హిత,మధురోక్తి నఖండసౌఖ్యమహిమ ఘటించున్. 1

మ. కరసీరేరుహమర్దిపాంచఁ బ్రతిపక్షత్రస్తుఁడై వచ్చి కా
తరబుద్ధి న్ననుజూడు మాటుసార నాస్థన్నిస్తులార్థాభయా
చరణప్రక్రియలం గృపామతిఁ దదాశాభంగవైముఖ్యముం

బొరయం గోరనివాఁడువో పురుషుఁడొప్పు న్వానిఁ గీర్తింపగాక. 173

చ. విటపసమృద్ధిభూజముల వీవలుల న్విరుల న్మరందలి
ట్పలివియత్ప్రదేశమునఁ బత్తులు వారిమరాళమండలం
బెటువలె నాశ్రయించి బలమెవ్విధిఁ గైకొనునేము నిట్టిచో
నటువలె నిన్నుఁజేరి ముదమందెద మోకమతాన్వయాగ్రణీ. 174

వ. అని లఘుపతనకుం డనేకప్రకారంబుల మందరకు నుత్కర్షింపుచుండె నాసమయంబున. 175

మ. చకితస్వాంతముతో మహామహిరజశ్ఛన్నప్రతీకంబుతో
వికసద్వక్త్రముతో బృహద్గతిజనిర్వేదైకనిశ్వాసవీ
చికతో బమ్మెరపోకతో నటకుఁ గళ్ళల్లధకక్షోభ మొం
డొకకాంతారమృగంబు భిన్నఖురటంకోదగ్ర మేతెంచినన్. 176

క. మ్రానికిఁ బొఱియను సలిల, స్థానమునకుఁ గాక వివరసజ్జలచరముల్
లోనెరసినభీతిఁ బసిం, దానిఁ గనుంగొని యథాయథముగాఁ బఱచెన్. 177

క. క్షితిజాతాగ్రస్థితలఘు, పతనకుఁ డద్దిక్కు లెల్లఁ బరికించి యుప
స్థితమైనది కించిద్భయ, మతిభయ మిచ్చోటఁ గలుగదని తెలుపుటయున్. 178

వ. హిరణ్యకమందరకులు బహిర్నిర్గమనం బొనర్చి వెగడుపడియున్నమృగంబు నూఱడించి యాతిథ్యం బొనరించి చిత్రాంగదుం డనునామం బిడి ముఖ్యసఖ్యంబున వలరించి భీతికి హేతువెద్ది చెప్పుమని యడిగిన నది మృగయుత్రస్తంబనిచెప్పె నమ్మువ్వురు నతండొక్కరుండునుంగూడ నలువురై యన్యోన్యస్నేహవ్యామోహంబునఁ గొంతకాలంబు గడపి రట నొక్కనాఁడు. 179

సీ. ఆహారవాంఛఁ జిత్రాంగదుం డడవికి బఱచి యొండొకచుంటఁబడియచోట
నలఘుసధీవరయంత్రవాగురఁ దగుల్కొని భీతినంగము ల్వడఁక గోడు
గుడుచుచుఁ దోనీడ్చుకొనుచు శుష్యద్గిరిపై వచ్చుచుండ వృక్షాగ్రవర్తి
యగుచు దూరమున వాయసనాథుఁ డచ్చోటఁ గని సుర్కి యెటువంటికష్టమొదవె
తే. నేమిసేయుదు ననుచు నహీనవేగ, కలన రెక్కల పటపటాత్కార మెసఁగ
నరిగి బాష్పనిరుద్ధాక్షుఁ డగుచు సఖునిఁ, గదిసి యిట్లనుఁ గంఠగాద్గద్య మడర.

మ. చెలికాఁడా పదబంధ మేవలనవచ్చెం జెప్పుమా నివ్వెఱం
గలఁగె న్మానసమన్న నాతఁడను బల్కుం దాల్మితే దెంతయుం
దెలియం జెప్పెదఁ బిమ్మటం బ్రతుకుఁగంటేఁ గ్రమ్మఱం బోయిని
ర్మలహృద్ధాము హిరణ్యకుం బిలిచి తెమ్మా బంధవిచ్ఛిత్తికిన్. 181

చ. మనుపఁ బ్రియంబయేనిఁ జనుమా యన నాయన నిర్భరత్వరం
జని నిరవద్యహృద్యగుణసారు హిరణ్యకుఁ జేరి చూచితే
చెనఁటివిధాతచేత మనుఁజిత్రమృగాగ్రణికృత్తివాగురా
భినిహతపాదుఁడయ్యె నినుఁ బిల్వఁగవచ్చితిఁ దత్ప్రశాంతికిన్. 18

క. నావిని మూషకపతి దుః, ఖావేశితహృదయుఁడై సఖా పోవలయుం
బోవలయు జాగుసేయక, వేవేగ న్నన్నుఁ జేర్పవే నీవచటన్. 18

వ. అనిపలికిన నతని మృదురీతిం గఱచుకొని చని వాయసకులవల్లభుండు నికటంబున నిలిచిన రుగ్ణునకు నౌషధంబును దృషితున కుదకంబును క్షుధార్తునకు మృష్టాన్నంబును నగాధజలపతితునకు నోడయు దరిద్రునకు నిధానంబునుంబోలె నుపస్థితుం డైన హిరణ్యకుం జూచి చిత్రాంగకుం డిట్లనియె. 18

క. మృగయుభయంబునఁ జీకా, కగుచున్నది మది భుజంగమాకృతిఁ గాలం
దగిలినయురిగోఁజికి భయా, ర్త్వగచిత్రగ్రీవుఁబోలెఁ దగు నను బ్రోవన్. 18

క. మందరకుండును గరటపు, రందరుఁడును నేను నీపరామర్శ న్నే
లందెదమని తలపోయుదు, మందెక్కుడిశంక నీదయకుఁ బాత్రంబున్. 18

క విచ్చలవిడి వాగురికుఁడు, వచ్చినఁ బ్రాణములమీఁద వచ్చును గృపనేఁ
డిచ్చొట్ట మాన్పు మనవుడు, నచ్చకితునిఁ జూచి మూషకాగ్రణి పలికెన్. 18

క. వెఱవకు వాగురదునియం, గొఱుకుటయన నెంత నీతికోవిద నీకే
తెఱఁగున నీదుర్దశ దుష్పరమై చనుదెంచెఁ దేటపడఁ జెప్పవనా. 18

క. అనిన నిది నేఁడ కాదట, మునుగలదన నతనిఁ జూచి మూషకరా జో
యనఘా నీతొలుతటికథ, విన నిష్టంబయ్యెఁ దెలుపవే నాకనుడున్. 18

ఉ. రంగదుపాయపారగుహిరణ్యకుఁ గన్గొని యొప్పఁ బల్కెఁ జి
త్రాంగదుఁ డిత్తెఱంగుఁ దెలియ న్వినుమా ఱవమాస మేగుచుం
డంగ సుగంధనై జననిడాఁపునఁ బర్వి యఖర్వపర్వత
ప్రాంగణశాద్వలస్థలిఁ బచ్చికమచ్చికమేయ నాయెడన్. 19

చ. వరనుతకీర్తియొక్కొలమునాఁ గటకంబునఁ బుష్కరుండు భా
స్కరకులుఁ డొక్కనాఁడు తెలిగన్నులయన్నులొయారమొప్పఁ జా
మరము లిడంగ దివ్యమణిమంటపమధ్యమృగేంద్రపీఠి నం
బురుహవిరోధి పూర్వగిరిఁబోలె రహిం గొలువుండె నుండఁగన్. 19

మ. తుటుమై యొక్కటఁ గూడి గూడెపుఁగిరాతు ల్వేను వీక్షింపఁగా
నటకాలోన హుటాహుటిం బఱచి పచ్చాకుల్ దృషత్సానము

క్రిటిదంష్ట్రి గ్గరిదంతము ల్సవరము శ్డేగ ల్కివాళ్ళుంగముల్
చిటుకలై వ్రేచిన మ్రోగువారువములుం జేకానుక లేన్రయుచున్. 192

గీ. మ్రొక్కి చేమోడ్చిమాయున్న చక్కఁజెప్పి, యెన్ని హరులెన్నియేనుగులెన్నిపంది
లెన్నిపులు లెన్నిమనుబిళ్లు లెన్నిలెళ్లు,చెప్పఁజిత్రంబు వేఁట విచ్చేయుమటకు 193

సీ. కోసవెంట్రుకలబట్టి కూపెట్టసింగంబుఁ బట్టితేకున్న నీబంటఁగాను
నెలవారసిలసొమ్మసిలవైచి శరభంబుఁ బరిమార్పకున్న నీబంటఁగాను
గండ్రగొడ్డటన వక్త్రంబుఁ జించి గజంబుఁ బడఁద్రొక్కకున్న నీబంటఁగాను
గండభేరుండపక్షుల నెత్తుట భూతబలిఁ జల్లకున్న నీబంటఁగాను

తే. గబ్బిబెబ్బులిడాకాల ద్రొబ్బి విరియఁ,బ్రామి రూపార్పకున్న నీబంటగాను
లాచిగవిఁ జొచ్చి యచ్ఛభల్లములగముల,బడలు వాపకయున్న నీబంటఁగాను. 194

వ. అని మృగారాతు లక్కిరాతులు పంతంబులు పలికి మృగయావినోదంబునకు మోదం బాపాదించినం బుష్కరుం డలరి వేటసన్నాహంబువీటఁ జాటించిన. 195

సీ. అడంగించుఁబో యిమ్మహాసారమేయంబు జముఁ డెక్కు కాసరస్వామినైనఁ
గూల్చుఁబో యమ్మహాకుర్కురం బర్థిశుముద్దులాయము కాలు మొసలినైనఁ
గఱచుఁబో యిమ్మహాకౌలేయకము విష గ్రీవు పేరెకిరింతగిత్తనైనఁ
బట్టుఁబో యిమ్మహాభషకంబు తోలుసంజ గన్నమానిసి వాల్మీకంబునైన

తే. నవఁగఁబులిగాఁడుచిలుకుటమ్మచ్చపచ్చి, మిరియమురిద్రాడుకాత్రేఁడు మెఱుపుదీగ
పిడుగుకలగూరగంపను పేళ్ళనలరు, నిడుదకుక్కల పట్టుపట్టెడలఁబట్టి. 196

గీ. పరుసుకరసానఁ దీటినపందిపోట్లు, భూరిభుజపీఠములయందుఁ బొందుపఱిచి
పరికరంబులఁ గొనుచు భూపాలునగరి,యేలుబడి వేంటకాండ్రు మున్నేచినడవ.

క. ఏలలఁ బాడుచుఁ దగ విలు,గోలలఁ గొని నల్లప్రజలు గుములై నడవ
న్నీలాంబరుఁడై విభుఁ డు, ద్వేలాశుకశావిరాజితేజీ నెక్కెన్. 198

క. ఎక్కినఁ ద్రొక్కనిచోటులఁ, ద్రొక్కుచు గుఱ్ఱంబునడవ దూరము లగుమా
యిక్కలకు వచ్చె నరపతి, పక్కణవాస్తవ్యసమితిపథ మెరిఁగింపన్. 199

తే. వచ్చి మాయున్నపొలమెల్ల వల్లెవైచు, చందమునఁ జుట్టుకొనినఁ బోసందులేక
చలితచరణంబులును బరాసన్నదృష్టి, గలిగియుండితి మచటఁ గాకవులకరణి. 200

వ. అంత. 201

క. పవికల్పప్రదరంబున, నవనీపతి దుప్పిదుప్పురనఁ బడనేసెన్
నవలాఘువ మేర్పడ రా, రవబాధకు మొదలుగారె రాజులు దలఁపన్. 202

క. శిఖిధూమశ్యామలములు, ప్రకరగరుద్విసరభాసురము లుద్యజ్జ్వా

ముఖరితములు రాజశిలీ, ముఖములు బహుపుండరీకముఖముల బ్రాలెన్. 2

క. తారలుచెడ నుడ్డీనో, దారగతు ల్నెఱపి గగనతలమున జవన
ద్భేరుండము లాస్యముల నపాఠముగాఁ గొనియె రాజబాణఫలంబుల్. 2

క. తులలేనిశైత్యములఁ జెఱు, బిలముల బురుడించుదొనలఁ బెరిగినశరముల్
పొలములు లాయంబులగళ, ములు మోవగఁ దుండషండములఁ బూరించెన్. 2

క. నిరవధికదానవిద్యా, పరఘనుఁడాఘనుఁడు దాత ప్రజ్ఞాని వనే
చరమృగచరజాంగకముల, శరధిపృషత్కముల సరభసంబునఁ గప్పెన్. 2

క. సమయించె ఖడ్గముల ఖ,డ్గములం గ్రూరాచ్ఛభల్లగణముల జగతీ
రమణుఁడు దుర్గాహవన, క్షమఁ గ్రూరతరాచ్ఛభల్లగణములఁ గప్పెన్. 2

వ. అయ్యాఖేటనంబు శాసితపశుప్రకరంబు గావున యజనవాటంబును ధ్వనిప్ర
నంబు గావున సుప్రబంధంబును భంగదుర్నిరీక్ష్యంబు గావున బయోనిధానంబు
నఖండధర్మసంపన్నంబు గావున కృతయుగంబును నిరూఢఋశ్యశృంగంబు గా
విభాండకాశ్రమంబును శిథిలీకృతాచ్ఛభల్లంబు గావునఁ బ్రభగ్నసంగ్రామంబు
గుంతీప్రవిహారయోగ్యంబు గావునఁ బాండురాజార్జనంబును నష్టసింహబలం
గావున భీమసేనోత్సాహంబును నపాస్తసింధురాజంబు గావున ఫలితార్జునప్ర
జ్ఞయు నికుంచితపంచకంబు గావున రాజనగరంబును నిశ్చేష్టితగవయంబు గావు
గుంభకర్ణసంరంభంబును సప్రకాశితపుండరీకంబు గావున శిశిరకాలంబును ననుకరి
నప్పుడు. 2

క. పోలములు వెదకి పక్కణ, పాలురతఱుముటయుఁ దల్లి ప్రజ లుద్ధురజం
ఘాలురు గావునఁ బరచిరి, పోలేకం దగులుపడితిఁబో వారలకున్. 2

క. వను నంతఁ జిత్రవర్ణుఁడు, గనిఁజంపక తెచ్చి పతికిఁ గైకానుకగా
నొనరించిరి శబరసుతు, ల్వాను రా జవ్వేటమీఁద విరిగె న్దిరిగెన్. 2

వ. తిరిగి మహీమహీశాకటకం బగుకటకంబునకు వచ్చి రాజు యువరాజునకు నన్ను
నిచ్చిన నచ్చెలువుండు నన్నుఁ గన్నవందనుకంటె నగణ్యకారుణ్యంబున రక్షి
నట్లు కుక్షిద్రక్షితుండనై యుండి యంతఃపురంబున వాసగృహంబున యువ
జొక్కురుండు పవ్వళించియుండ నేనును దత్సమీపంబున నుండితి నయ్యవస
త్రంబున.

క. ప్రతిగర్జత్కేసరియై, యతికంపజ్జంతు హృదయమై నిర్భిన్న
శ్రుతిహృత్పుటమై విద్యు, ద్ద్యుతివాంతధ్వాంత మగుచు నొకయుఱు మాఱె మొ

మ. తనకర్ణంబుల కెంతయాఘననినాదం బూర్జితామోదకం
బొనరింప న్సుఖమెత్తి వానతఱి యయ్యోపర్వతాధిత్యకా

వనుల నన్నద్వనులం గులప్రభులతో వర్తింతుఁగా యంచు బా
ష్ప నిరుద్ధాత్ముఁడనై సఖా మనుజభాషం బల్కితిం బల్కినన్. 213

చ. విని యువరాజు ద్రాసరసవిహ్వలుఁడై సదనంబు నద్దెస
ల్గనుఁగొని యేను నీమృగముకాని యొరుల్విహరింప రిందుఁ జె
ప్పను వినఁగూడు నే మనుజభాషల నిప్పుడు వద్భుతధ్వనిం
బనివడి ప్రోసి వేగి తెలుపందగు నీతెఱఁ గెల్లవారికిన్. 214

క. అనితనువు వేఁగ వేగినఁ, దన కాపుష్కరనరేశుతమ్ముఁడు నెమ్మిం
గనుఁగూర్కి వెఱచి యొకలా,గున నంతయు దైవచింతనుల కెఱిఁగించెన్. 215

క. ఎఱిఁగించి మృగములెక్కడ, తరి నేతన్మనుజభాషితము లెక్కడ నే
తెఱఁగో యేమిటొ త్పాతమొ, వెఱఁగయ్యెడు ననిన నవ్విద్వత్సింహుల్. 216

క. యువరాజుఁ జూచి ధరణీ, ధవనందన యేలవెఱచెదవు మృగజాతుల్
పవలూరకుండి నిశనవ, నవభంగి మ్మనుజభాషణంబులఁ బలుకున్. 217

క. నరసంచారవిహీనో ర్వర నని చెప్పుటయు భయము వదలి నృపాలా
వరజుఁడు నను విడిపించెను, గరుణాపరుఁడై దురంతకాంతారములన్. 218

క ఇది నాకు నేఁడ కాద, మ్మొదలం గలదనుచుఁ దెల్లముగ మృగము జగ
ద్విదితుఁడగు నెయ్యునకు నా, త్మదశం దడిలేని నోరఁ దనకథఁ జెప్పెన్. 219

క. అతివేలచింత నంతట, నెతమదిలో నెరసి సరసి వెలువడి మంద
స్థితి చాయఁ జూచుకొని య,ప్రతిమదయాశరధి మందరసుఁ డేతెంచెన్. 220

క ఏతెంచిన భీతి విని, ఖ్యాతహాతిం ధృతినగంబు ప్రయ్యలుగాఁ జిం
తాతంతుబద్ధమానసుఁ,డై తత్తర మెసఁగ మూషకాగ్రణి పలికెన్. 221

చ. అరయ నుపాయపారగుఁడ వయ్యు నయోదధివయ్యు సంతత
స్థిరమతివయ్యుఁ గానిపనిఁ జేసితి వమ్మసఖా మృగంబు ని
క్కరటము నేను నెప్పటికిఁ గాల్గలవారము చిక్కి మేరికి
ట్లురుగతి నీకులే దిచటికుద్ధురుఁడా మృగయుండు వచ్చినన్. 222

చ. అతివిమలాత్ముఁడైన సఖునందును బెంపొనరించు ధారుణీ
పతివరునందు భూరిగుణబంధురమైన కళత్రమందు ను
న్నతనయతత్త్వశాలి యగునందనునందు మనంబు సొన్పి యా
గతబహుదుఃఖము ల్దొలఁగుఁగాదె విచారధురీణుఁ డుర్వరన్. 22?

చ. అను నెడ వేఁటకాఁ డదయుఁ డప్పు డుపస్థితుఁడైన దైన్యమా
ననమున మోసులెత్త మృగనాథుఁడు బెగ్గిలినన్ హిరణ్యకుం

డనునయవాక్యము ల్మెఱయ నాక్షణ మంత్రిపరీతవాగురం
దునియలు సేసి మందరకు దూఱి యథాయథలయ్యె నయ్యెడన్. 2

క. జలచరుఁడు గనపరత్వర, నిలబోవం జేవలేక యెప్పటిచోని
ర్గళితగమనేచ్ఛఁ గచ్ఛప, కులనాథుఁడు శిరము ముడుచుకొని యుండుటయున్

క. సరినురికిఁ బాసి గాఢ, త్వరఁబఱచినమృగముఁ జూచి దారుణచింతా
పరితప్తుఁ డగుచు మృతయుఁడు మరుగుచు నచ్చో ముహూర్తమాత్రము నిలిచెన్

వ. అట్లుండి మందర మందరకుం గాంచి పట్టుకొని త్రాటంగట్టుకొని వింటికొప్పు
బెట్టుకొని విన్ననైన మొగంబునం దిరిగి యరుగుచుండె నప్పుడు హిరణ్యక లఘు
తనక చిత్రాంగదు లంతంత ననుసరించి చనుచుండి రందుందురు పురందరుం
తనలోన. 2

ఆ. అంబురాశిపారమైనను గననచ్చు, నిశ్చయింపవచ్చు నింగిపొడవు
బ్రహ్మ మిట్టిదనుచుఁ బలువంగనగు సుహృ, ద్వరహ మింతయనుచుఁ దెలియరా

తే. అదియ సువ్యక్త మది నిజప్రాణతుల్య, మదియ నిర్వాచ్య మట్లుగాదయ్యెనేని
జననిపై భార్యపైఁ దనూజన్ములపయిఁ గలిమిపై మైత్రిపైఁ బోలెఁ గలదె మమత

సీ. కర్మచేష్టితములు గాలాంతరావర్తితము లగు మేలుగీళ్ళు మరునైనఁ
గనుఁగొంటి మరిసమాగమవియోగములేల చెనఁటివిధాత సృజించె మొదలఁ
బృథులశోకారాతిభీతిఘాతిప్రమోదసంపాదిప్రీతివిస్రంభభాజ
నము మఱిరెండక్షరములఁ బూర్ణంబైనమిత్రశబ్దము మేర మెఱసి విడిసి

తే. యెట్లునిలువఁగూడు నెబ్భంగి రుచియించుఁ, గూడు కంటికెట్లు గూర్కు వచ్చు
నని హిరణ్యకుండు దనలోన దుఃఖించి యపుడు పలికె వాయసాధిపతికి. 2

క. ఈయధముఁ డెంతదూరము, పోయెడునో యెంతదవ్వు పోదము సర్వో
పాయములఁ గానలోపల, నీయెడ విడిపించుకొంద మిమ్మందరకున్. 2

క. నావిని లఘుపతనకుఁడును, లావుపసం బోర నలఁతులము మందరకుం
డేవడువున విడివడు నీ, చేవినికి దిక్కు చెప్పవే వెరవనినన్. 2

సీ. అశ్రుమిశ్రితనేత్రుఁ డైనహిరణ్యకుఁ డనియె నిప్పాపాత్ముఁ డరుగుత్రోవఁ
గలదు చెందామరకొలను దత్తటమున మృగముఖ్య చచ్చినపగిది నుండు
నేమించి యాదల నిలిచి లోఁజెవులను ముకుగోళ్ళఁ బొడుచున ట్లొకల గన్నుఁ
గ్రుడ్లూడ్చి మెసవులాగున నుండు ముండినవాపూఁట కచ్ఛపనాథుఁ ద్రోవ

తే. వేగఁ గేడించి యన్నిచు వెనుకఁజేసి, యరుగుమచ్చక్కికనికూర్చి యనుచుటయుఁ
ఖగమృగాధ్యక్షు లరిగి రాఘనులపజ్జ, నంత నంతట దానును నరుగుచుండె. 23

సీ. చిత్రాంగదుండు చచ్చినవానిగతిఁ బురస్సరణసరస్తీరధరణినుండె

వానిమస్తకమున వ్రాలి వాయసకులాగ్రణి కనుగ్రుడ్డులు గఱచి పెఱికి
కొని తినువానిలాగునఁ గావుకావున నఱచుచు ముఱియుచునంతలోన
నరుగుచున్నకిరాతుఁ డగ్రభాగమునఁ జిత్రాంగదుఁ గని మేనుపొంగ నురక

తే. కలిగెఁ దెకతేఱ నేతన్మృగం బనుచును, మందరవు డించి కాకి బల్మఱు నదల్చి
కొనుచుఁ జనుచోట మూషకకులవిభుండు, కూర్మవల్లభుబంధము ల్గొరికివైచె. 234

క. కొరికిన మందరవుఁడు దె, ప్పరపుపడింబఱచి సరసిఁబడె మూషకరా
జొరికె మృగవాయసంబులు, తెరఁగొప్పగఁ లేచి రెండుదిక్కుల కరిగెన్. 235

తే. అట్లు విఫలప్రయత్నుఁడై యడవిఁ బాసి, విన్నబాటునఁ జనియెను వేఁటకాఁడు
కమఠమూషకమృగమహాకరటవిభులు, గాఢతరమైత్త్రిఁ బొదలి రత్కంఠనందు.

వ. సుహృల్లాభంబున సాధింపరాని కార్యంబులు గలవే యని సుదర్శనకుమారులకు విష్ణు
శర్మం డెఱింగించె నెఱింగించిన. 237

క. విని రాజకుమారకు లన, ఘ నయాంశవిలాసదివిజగురు నిజగురునిన్
గని మాఁడవతంత్రము పా, యనిధీ మాతోడఁ జెప్పుమని యడుగుటయున్. 238

మ. అతికారుణ్యకటాక్షసర్వభువనై కాధ్యక్షరాధాసుత
ప్రతిపక్షప్రియచర్యకల్పకనిశా రాడ్ధుర్యచక్రత్రిశూ
లతిరోభూతరవిప్రభూతశుభలీలా పూతరూఢాంధకా
హితతేజోవిభవప్రచారణదయాహృష్టస్ఫురద్వారణా. 239

క. మాయాతీతమహాసిత, కాయభటీకృతమరున్నికాయతపస్వి
ధ్యేయ నిజభక్తరక్షో, పాయ విభూతిప్రధానపాండిత్యనిధీ. 240

మాలిని. నిరుపమితమహాత్మా నిశ్చలానందతత్త్వా, నిరతసుఖితలోకా నిత్యపుణ్యావలోకా
గరుడవృషపతాకా ఖండితానన్యశోకా, మరణజననదూరా మానిచేతోవిహారా.

గద్యము. ఇది శ్రీ వేంకటనాథ కరుణాలబ్ధ సరససాహిత్య నిత్యకవితావిలాస సకలసు
కవిప్రశంసా భాషణోల్లాస రాజకులపారావార పర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గప
రిశ్రమణ ధైర్యపర్యాయ ధిక్కృతనీహారపర్వత పర్వతరాజకుమార నిస్సహాయ
ప్రబంధనిర్మాణ భోజభూదార సుధామధుర భాగతీసనాథ వేంకటనాథప్రణీతం
బైన పంచతంత్రంబునందు సుహృల్లాభం బన్నది ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

---

శ్రీ ర స్తు.

# ప ం చ త ం త్ర ము.

## తృతీయాశ్వాసము.



శ్రీమద్వృషాకపాయీ
రామాసాపత్న్యరోషరసకృత్త్వరతో
భూమమకుటీవ్యోమధునీ
వ్యామిశ్రకటాక్షవీక్ష హరిహరనాథా.

వ. దేవాసంధివిగ్రహాభిధాన తృతీయతంత్రం బాకర్ణింపు మధీతనీతిశాస్త్రమర్ముం డ
విష్ణుశర్ముండు సుదర్శనకుమారుల కిట్లనియె.

క. ఆకడ వీరుం డగున, స్తోక ప్రతిపక్షుఁ బెనిచి తుది రాజు చెడుం
గాకంబుఁ జేర్చుకొని నుత, లోకబలోద్రేక మొకయులూకము చెడదే.

క. నావిని రాజకుమారకు, లావిప్రుని జూచి చిత్రమది చెపుమా భూ
దేవకులోత్తమ మాకును, దావహముగ ననినవారి కతఁ డిట్లనియెన్.

చ. మధురనభోమణిద్యుతిసముంచితరత్నవిరాజమానధా
మధురవిలాసినీశ్రవణమంగళరాగపదీరితేత్తుహృ
న్మధురధురంతసంప దభిమానతృణీకృతరాజరాజది
జ్మధురచెలంగుఁ బాండ్యమహీమండలిఁ దన్నికటాయతాటవిన్.

చ. ఫలరుచివిద్యుదర్చిఁ దెలుపం బలిభుగ్రుతు లుగ్రగర్జలై
యొలయఁగ బెల్లుగా డిగినయూడలు పుష్కరవర్షధారలై
నిలువఁగ వార్షికాభ్రసరణిం గగనస్థలచుంబియై దళ
ద్దళములకల్మిఁ గార్కొనుసుదగ్రవటం బొకఁడొప్పు నున్నతిన్.

చ. నటన ననేకకాకపృతన ల్ప్రతివాసరము న్భజింప న
వ్వటమున మేఘవర్ణుఁ డనువాయసవల్లభుఁ డుండు వాని క
త్కటభయకంపనంబు లెసఁగ న్నికటప్రకటాటవీకుటీ
వటమునఘూకసేన గొలువం బెనుగూబయఘునుండు నెప్పుడున్.

ఉ. ఆయరిమర్దనుండు మది వచ్చలమెచ్చఁ గృతాంతవాలకా
లాయుధకంఠఘోర తిమిరాకులమై నొకనాఁటిచీఁకటిం
బాయనిఘూకసేనఁ బనుపం బెనుపొందినమత్తి కేడ్తెఱం
బోయి యజాగరూకబలిభుక్పటలిం బరిమార్చి పోయినన్. 8

క. ఆవెంకిఁ గరటవిభుఁ డొక, కోటరగర్భమున నణఁగికొని యుండుట నా
చేటూదపదయ్యె వానికి, నాఁటికి వదిపోయె మఱుసు నాఁ డుదయమునన్. 9

వ. హతశేషానుజీవకోటిం గూడుకొని యతనిమంత్రు లుద్దీపియు సందీపియుఁ బ్రదీపియు నాదీపియుఁ జిరజీవియు ననువారేవురుం గలసి తంత నందఱుం గలయం గనుంగొని మేఘవర్ణుం డిట్లనియె. 10

ఉ. ప్రాఁకున నిద్రవోవ నరిమర్దనుపంపున వచ్చి ఘూకముల్
గాకముల న్వధించె నిది కక్కసపుంబని నిర్వహించువె
ట్లీకడ నీతికార్యపరు లిందఱు పోలినభంగిఁ జెప్పుఁడా
నాకిపు డంచు రాజడిగిన న్వినయవ్యతిషంగచిత్తుఁడై. 11

వ. ఉద్దీపి యిట్లనియె. 12

క. ఈదృశబలవంతులతో, వాదులకుం దించి బ్రతుకవచ్చునె యొండేఁ
బోద మశక్తుల కిది మర్యాద వృథా పోలిసిపోవ నగుఫలమేమి. 13

క. అనువచనంబులు వాయస, జనపతి విని యానతిచ్చె సందీపికి నీ
వును నొకకార్యముఁ జెపుమా, యను డాతఁడు విహితహృదయుఁడై పతి మొగమై.

క. ఇది యొకపక్షమ్మున మం, చిది యగు నగుఁగాక యేమిచిరవిక్రమసం
పద గలరాజున కుచితమె, సదనత్యాగంబు మానుషచ్యుతి గాదే. 15

క. స్థానంబు సకలఫలసం, ధానం బొనరించుఁ బతికిఁ దగ నజకంఠ
స్థానస్తనమిడునె యథా, స్థానస్తనభంగి మధురతరదుగ్ధంబుల్. 16

క. చేఁగలభూమిపతు లటు, గావునఁ గోరరు విదేశగమనము దేవా
నీవెఱుఁగనికార్యములుం, ద్రోవలు మఱియెవ్వరెఱుఁగుదురు లోకమునన్. 17

వ. అనుమాటలు విని రాజు ప్రదీపి నాలోకించి తోఁచినకార్యంబుఁ జెప్పుమని యడిగిన నతండు. 18

చ. తడయక బాలవృద్ధవనితాజనతాదులవైరికోటికిం
గడువడిఁ జంపు మంచు నిడుకం బెనయంబున సంధి సేయు టే
త్పడ నుచితంబు వైరుల నపాయబలాఢ్యులు రాత్రిచారు లె
య్యెడఁ దగ దీరసంబు బలహీనులకు న్మనబోటివారికిన్. 19

క. ఈవాలువచ్చి తేవం, జావంగా నున్న వారిఁ జంపెద నహితుల్
దేవా సంధి యనూనతు, భావహ మొనరింపు మస్మదాదేశమునన్. 20

వ. అనుభాషితంబు లాకర్ణించి యధిపతి యాదీపినడిగిన నతం డతని కభిముఖుండై 21

క. సంధికిఁ జనుచెట్లరులు దివాంధులు బలదుర్నిరీక్ష్యులయ్యును దుస్సం
బంధ మిదిగాదె మనము ని, శాంధుల మెట్లమరు దూత కరుగఁ దిరుగన్. 22

క. అటుగనుక సంధికార్యం, బెటువలె నొడఁగూడు రాత్రు లెదిరికి నెల వి
ప్పటికి మనకదను పగలు, త్కటగతిఁ జని సంహరింపుదము పగవారిన్. 23

వ. అని యుద్దీపి ప్రదీపి సందీపి యాదీపులు తమకుఁ దోఁచినట్లు చెప్పినవిని మేఘ
వర్ణుండు చిరజీవి నాలోకించి. 24

క. ఈతం డితఁ డితఁ డీతఁడు; చేతోగతిఁ దోఁచినట్లు చెప్పిరి పథ్యం
బై తోఁపదు కించిత్తుం, దాతా నీవేమిచెప్పెదవు నాతోడన్. 25

క. నీసద్బుద్ధిబలంబునఁ, జేసెద రాజ్యంబు నేఁ డజేయదివాంధ
త్రాస ముదయించె నీకిది, పోసమయము ప్రాప్తకాల ముపదేశింపన్. 26

క. హరిపరిణామమునకు ని, ర్భరనీతిపరుండు గురుఁడుబలె నాభద్రం
బరయుటకు నీవెకా కెవ్వరునాఁ జిరజీవి మేఘవర్ణుని కనియెన్. 27

క. అలఘునయవినయనిధు లీ, నలువురు విన్నపముఁ జేసినా రిష్టతమం
తులకంటెఁ గార్యనిశ్చయ, బలమున నధికుఁడవె యంతపాండితిగలదే. 28

ఆ. వీరు నీకుఁ బరమవిశ్వాసఘటకులు, వీరినీతిరీతి వినుట యొప్పు
నైన నాకుఁ దోఁచినంతయు వినుపింతు, నేకతంబువలయు నింతదడవు. 29

క. హితుఁడని యొకనికిఁ జెప్పిన, నతఁడును దనకూర్చుసఖుని కది దెలుపు నర
క్షితమై నృపమంత్రం బీగతిఁ బలువురు వినుటచే విఘాతతనొందున్. 30

క. అతిగుప్తమయ్యు మంత్రము, హితనికరశ్రుతము చేత నివురంబడు ని
కృత యెఱిఁగి ప్రాంతజనసం, గతి రాజు రహస్య మొసఁగి కావఁగవలయున్.

వ. అని యేకాంతంబు నడసి చిరంజీవి మేఘవర్ణునకు సంధివిగ్రహయానాసనద్వైధీభావ
సమాశ్రయంబు లనుగుణంబులం బ్రారంభోపాయపురుష ద్రవ్యసంపద్దేశకాలవిభాగ
వినిపాతప్రతికారంబు లనునంగంబుల సామదానభేదమాయోపాయంబు లనుచతు
రుపాయంబులఁ బ్రభుమంత్రోత్సాహశక్తుల విచారించి యం దుచితం బగుదాని
నంగీకరింపుము నాకుఁ దోఁచినకార్యం బొక్కటి ప్రతిపక్షు లుదగ్రసత్త్వద
ర్పులు మనకు సమరసామర్థ్యంబు చాలదు దేశకాలంబులు విచారణీయంబులు.

క. మీనోదవునంతకుం జనఁ, గానక బకముండుకరణి ఘననీతిధనుం

డైనయుతఁ డూరకుండుం, దానహితుఁడు చిక్కుపడినదను కతిశాంతిన్. 33

క. తనసత్వ మెదిరిసత్వముఁ, గనుఁగొన కెవ్వాఁ డఖర్వగర్వమునం బో
రునకుఁ దుదఁ గాలు ద్రవ్వు, న్వినుమ ముముక్షురునిఁబొందు విపదోఘంబుల్. 34

చ. సురియఁ గరంబునం గొనక శూరుఁడు నీతి కళావిలాసభా
సురుఁడు వధించు వైరి వితతుం దవుదవ్వులఁ జెంతనుండియున్
సురియ ధరించియు న్మగువచొప్పున నేమియుఁ జేయలేఁడు త
న్నెరలఁగఁ జేయుమానసనికృష్టుఁడు మాటలు వేయు నేటికిన్. 35

క. తాలిమియు ధృతియుఁ బ్రజ్ఞా, శీలతయుఁ బరాత్మగుణ విశేషజ్ఞతయుం
గాలోచితశౌర్యము గల వాలుమగం డేలు వార్ధివలితధరిత్రిన్. 36

క. సిరిపొందును పాయకళా, పరిణతుఁ దనుఁ దానపాయపారగుసభయుం
బరుషోక్తిఁ జేరరాదిం, దిరకీలం గురులఁ బట్టి తివిచినయినన్. 37

క. గృహపేటినుండుమంత్రో, త్సహనాథ్యునకు న్రమాభుజంగినుమంత్ర
గ్రహణవిమూఢున కది దు, స్సహభీతి ననారతంబు సంపాదించున్. 38

క. మతిమంతుఁడు శాంతుఁడు వి, శ్రుతగుణసంసిద్ధుఁడు న్విశుద్ధుఁడు నీతి
ప్రతిరహితుఁడు బలసహితుఁడు, గతభయుఁ డనఘుండుఁ గార్యఘటకులుసుమ్మీ.

వ. విశేషించి యిట్లు చెప్పవలసి చెప్పితిఁ గాని యుద్ధ మెప్పటికి నకరణీయంబు. 40

సీ. కోశమంత్రములు దక్కవలు గాకుండినఁ గలుగులెక్కలకు నగ్గలము బలము
శాంతులు నిర్మలస్వాంతులు విక్రమోదయులు నిర్భయులును ధర్మమయులు
కఠినశాత్రవుని సాగావిత్తవంతుని వేల్పుగాఁ జూచి సేవింతు రెపుడుఁ
బ్రభుతసహాయనిబంధనం బనిచెప్ప విందుము నీవును వింటివట్లు

తే. కులము గుణము రూపు చెలువంబు మురిపంబు, మానధర్మ విక్రమ క్రమముల
వానిఁ జూడ దబ్బవాసిని నిరపాయ, శూరసంగ్రహంబుఁ జూచినట్లు. 41

క. ఏరీతి జైత్రయాత్రా, ప్రారంభము సెల్లుఁ బతికిఁ బ్రజలేమి నభి
శ్చారత గూడునె పక్షికి, భూరిబలాఢ్యతుపక్షములు లేకున్నన్. 42

క. ఘోరారివీరపారా, వారం బెప్పాట దాఁటవచ్చు సహాయా
ధారతతి తారఁ గోరక, పౌరుషసంపన్నుఁ డగునృపాలాగ్రణికిన్. 43

క. ధనమంత్రసహాయంబుల, నొనరినభూవిభునకన్నియును గల వట్ల
య్యును సమరమకరణీయము, చన నేరదు సంధి సహజశత్రుల మగుటన్. 44

వ. ఘూకంబులకుఁ గాకంబులకు సహజవైరానుబంధంబున నకాదె వాక్పారుష్యం బెవ్వ
రికిఁ జేటుఁజేయదు. 45

క. భీషణశార్దూలతనూ, వేషము దన కమర దాల్చి విశ్రుతసస్యా
న్వేషణతత్పరమతివా, గ్ఘోషంబున నొక్క ఖరము గ్రుంగదె పుడమిన్. 46

క. నావిని వాయసపతి చిర, జీవికి నిట్లనియె నీతిశీలా యేలా
గీవిధము దేటపడఁ జెపు, మా వినియెద ననిన నతని కతఁ డిట్లనియెన్. 47

క. ఒకపురి నొకచాకలవాఁ, డొకదిక్కున నొకనిచేత నొకగాడిద వి
ల్వకుఁ బుచ్చుకొనియెఁ బార, ప్రకరపటీభృతికి మేనుబటువై యునికిన్. 48

క. వలువలు చలువలుసేసెడు, నెలవునఁ బగలెల్ల నిలిపి నిశియగుటయు న
ప్పలుగాకి చాకి పెనుగ్రొ, వ్వులిచర్మము గప్పి సస్యముల కెగవిడుచున్. 49

క. అది కడుపుకొలదియును దిని, సదనమునకు మగిడివచ్చు సరిప్రొద్దున ని
ట్లద నరసి యెరుగఁ దిరుగం, బొది చెడియెం బైర గొన్ని పూఁటలుచనియెన్. 50

క. పొల మరయుకర్షకులు మదిఁ, బులిగాఁ దలపోసి భీతిఁ బులిపులి యనుచున్
దలసాలవెడల రందొక, హాలికుఁడు శరచాపహస్తుఁడయి నిశ్శంకన్. 51

క. నెలవొడిచినధూసరరుచిఁ, గలగొంగడిముసుఁగుఁ దిగిచి కడువడిఁ దనయి
ల్వెలువడి చని కని తనమం, గలబొంచినవానిఁ జెండి గాడిదె యనుచున్ 52

క. మెండుగ నుత్థాపించిన, దండము గమనమున కెగ్గుఁదలఁపఁగ వీనుల్
బెండువడ నోండ్రపెట్టుచు, దుండగపుఖరంబు దన కెదుర్పఱ తేరన్. 53

క. హాలికుఁడు నీవాయనుచుం, జలివిడిచి ప్రహాస మెసఁగ శయములఁ గాళ్లం
బిలపిల నెదురుగఁ బఱచిన, నలగాడిదెయుం దువాళినటితికివచ్చెన్. 54

వ. వచ్చిన. 55

క. తగిలి తనపైరు మేసిన, పగ యగ్గలమగుటఁ గినిసి పటుముష్టిని వి
ల్దిగిచి ఘనతరశరంబునఁ, దెగనేసిన గార్దభంబు ద్రెళ్లెం బుడమిన్. 56

ఇది వాగ్ఘోషఫలంబని వెండియు. 57

క. అనిచెప్పిన చిరజీవిం, గని వాయసరాజు పలికెఁ గౌశికములకున్
మనకు న్బగ వాగ్ఘోషం, బునఁ బాటిలె నంటి విదిచెపుము వినవలతున్. 58

వ. అనినఁ జిరంజీవి మేఘవర్ణున కిట్లనియె. 59

చ. అపరిమితానురాగమొలయ న్వలయాద్రిపరీతభూపత
త్రిపటలిమంత్రగూటమొనరించి మదాంధదివాంధము న్మహో
త్కుపితముఁ బక్షిరాజ్యమునకుం బతిగా నొనరింపఁ బూనియుం
న్నృపు డొకవృద్ధకాక మటకై యరుదెంచినఁ బుల్గులన్నియున్. 60

వెడవెడ నొండొకొండొక, తడవు విచారించి సమతఁ దమలోననియెన్

జెడకిది బహుకాలంబులు, గడపిన యడిగాన యుచితగతి నెఱిఁగించున్. 61

వ. కార్యాలోచనంబున నిందఱ మసమర్థులము కార్యనిర్ణయసమర్థం బగుదీని నడిగి చూతమే యనుచు నాతిథ్యం బాచరించి పరివేష్టించి తమయభిప్రాయంబుఁ జెప్పిన నప్పక్షులకు వాయసాధ్యక్షుం డిట్లనియె. 62

సీ. కర్ణహృత్పుటసూచికాయమానోత్తానవికటఘోషము విన్న వెగటుగాదె
కాలకాకోదరోగ్రస్ఫుటాస్ఫుటముఖం బాలోకనముసేయ నళుకుగాదె
భ్రమదుల్ముకభ్రాంతిభాగవీక్షణదృష్టిసరణిఁ ద్రిమ్మరుచుండ జాలిగాదె
కర్కశవ్యాయామగరుదమంగళమరుత్ప్రతతి సోఁకినఁ బీడవట్టుకొనదె

తే. దారుణాకార మప్రియదర్శనంబు, ప్రకృతిరౌద్రంబు క్షుద్రం బపక్షమంబు
ఘూక మేయూరు పికశారికాకలాప, కీరికాముఖఖగణ మేయూరుచెప్పుఁడ. 63

క. దారుణదృష్టివికారా, కార మతిక్రూర మహముఁ గానదు కరుణా
దూరం బెట్లయ్యెడు ర క్షారంభం బెఱుఁగఁజెప్పుఁడా వినవలతున్. 64

క. వ్యపదేశక్రియ మెఱసిన, నృపు నింపెసలార నాశ్రయించినఁ గలుగున్
విపులసుఖ మమృతకిరణ, వ్యపదేశతఁ గుశలమంద దా శశ మడవిన్. 65

క. అనుకాకమునకుఁ బులుఁగులు వినయంబునఁ బలికెఁ దెలుపవే శశకం బ
వ్వనజరిపుని వ్యపదేశం, బున భద్రముఁ గనుట గరటముఖ్యా మాకున్. 66

వ. అని యడిగిన వాయసపుంగవం బవ్విహంగంబులకు నిట్లని చెప్పందొడంగె. 67

మ. అగళద్దుర్భరతీక్ష్ణభాస్వదభిషువ్యాఘాతపాతక్షుర
న్మృగ మస్తక్షతజంబు పశ్చిమమరుద్వ్యాధూతత్రిధామజ్వల
న్నగ మంతర్జ్వలనిర్ఝరంబు మృగతృష్ణావాహినీ సంచితా
ధ్వగ ముష్ణాగమమయ్యెఁ దొల్లి పురజిత్ఫాలాంబకాభీలమై. 68

వ. అక్కాలంబున. 69

చ. జలధరము ల్దరాస్థలికి జాఱినన న్దిననాథరశ్మికిన్
దొలఁగ కహో బయల్మెఱసెనో తిమిరంబులు నాఁగజంగమా
ద్రులగతి గండకంపితగిరు ల్దరులారయ లెక్కకెక్కుఁడై
యలఘుమృగేంద్రభీతిరహితాటవిలో విహరించు నేర్పడన్. 70

క. ఏకసరోవర మగునల, భీకరగహనమున నిలువ బెగడి పిపాసా
వ్యాకులితమానసము లపు, డాకరు లిట్లనియె యూథపాధ్యక్షునకున్. 71

క. ఇచ్చోటిసరము శరముల్, నిచ్చలుగొన నివిరె మేఁపునీళ్లకయో ని
ప్పచ్చరమై యెవ్విధి మన, వచ్చు నవారిగఁ బ్రవారివలె మాకాసన్. 72

క. ఆపాతాళగభీరప, యోపూర్ణమహాప్రవాహమైనను గూపా
రాపరిమితసరమైనం, జూపుము విఱవిఱకపోవఁజొచ్చెం దనువుల్. 72

వ. అని వదనోదకంబులఁ జూపి విన్ననయి యున్న నన్నిచదళపశావల్లభుం డరసి నిమి
షంబునం దడయక యప్పటికి సత్వక్షీణంబులు గానివానిఁ గొన్ని గజంబులఁ
బిలిచి మనుజీవులారా యప్రతిహతమనోరథంబుల గహనఘంటాపథంబులం బఱచి
యగాధశరం బగుసరంబుఁ గనుంగొని రండు పొండని నియోగించిన. 74

సీ. మదవనేచరవధూమధురగానధ్వానవివశకుంజక్రోడవిపధరములు
పరిపక్వఫలవిలుబ్ధస్వర్ధరోమ దంష్ట్రాగ్రటంకభిన్నగోత్రారుహములు
ధరచరత్ననబాంధవదన వ్యాఘ్రయూమధూమకల్పితమేఘదుర్దినములు
చరమదిఙ్ముఖపతజ్జరఠకాసరవిరక్త వ్యాఘ్రభీతఖడ్గవ్రజములు
తే. పవనతరసరస స్తేయసారమేయ, దళనదంశననిష్ప్రాణితరుణహరిణ
నాభిసౌరభ్యదళదిశాంతస్థలములు, ఘోరకాంతారములు కొన్నికొన్ని గడచి. 75

క సరినెరసి మెఱసి బిలములు, దరిసి ధృతు ల్బెరసి దొరసి దంతావళముల్
వరశిఖరం బగు నొకమల, సరస న్సరసారసరసి సరసి న్గనిరొగిన్. 76

వ. తత్సరోవరం బావిష్కృతపుష్కరంబు గావున యాదవస్థానంబును మత్స్యకూర్మ
విలాసభాసురంబు గావున యోగిరాజును బ్రకాశితాహిమకరంబు గావునఁ బ్రాత
కాలంబును నధిగతబ్రహ్మారథంబు గావునం బర్యాప్తవితానంబును నారాధితా
కులంబు గావున నపారబలసంపన్నంబును బకవిహారయోగ్యంబు గావున నేకచ
క్రపురంబును నూర్మికాభిరామంబు గావున నలంకృతుం బురుడించి యొప్పుచుండు.

క. కని యనురాగరసాబ్ధి, న్మునుము న్నోలాడి భిన్నముఖకమలవనీ
ఘనపరిమళగుణచిక్కణ, వనజాకరవారిలో నవారిగ నాడెన్. 78

ఉ. ప్రావృతచూతపోతమృదుపల్లవపారణకారణంబునన్
లావుపహించి సొంపు వొదల న్బొదలం బదలాఘవంబునం
బోవఁగఁ బ్రోయుచు న్మరలిపోయి సరోవరలాభవార్త యా
క్రేవఁ జరించుయూథపతికి న్వినిపించె గజంబులన్నియున్. 79

ఉ. చెప్పిన నప్పు డుల్లసిలుచిత్తమునం గరిరాజు గౌరవం
బొప్ప మహాహితద్విరదయూథముఁ దోకొనిపోయెఁ బోవ నా
చొప్పున దాఁటిపోవ నొకచోటును గానక తత్పదాహతిం
జిప్పలు గుల్లలై పొలిసె శీఘ్రమె పెక్కుశశంబు లచ్చటన్. 80

సీ. అచ్చోట్లఁ జూచియు నంతశిలీముఖుం డనుశశరాజు దైన్యావలంబి
యగుచు మంత్రుల కిట్టులనునీతి నిధులార యబ్ధికి వారివాహములవోలె

సరమున కలఘుతృష్ణాభరంబున నేఁ డవారణ నీదారివారణములు
పఱతెంచుచున్నవి పరికింపు మల్లవె కుంభేళ్ళు వీనిత్రొక్కుళ్ల మడిసె
తే. ద్రాసకర మైనయీశశప్రళయమునను, నకట యెబ్బంగి శాంతికార్యంబు దొరకు
నేమిసేయుదు ననునంత నెదుర నిలిచి, విదితనీతికళాశాలి విజయుఁ డనియె. 81

క. దేవా నేఁ గలుగఁగఁ జిం, తావారిధి నేలమునిఁగెదవు శశములకుం
గావించెద శుభ మిభముల, రావిడువం జూడు నాపరాక్రమ మనుడున్. 82

క. పలికె శశరాజు గాఢో, త్కలికన్నయనిధి దేశకాలవిభాగం
బులు నీక తెలియు నిట నీ, కలిమిఁ గ్రియాసిద్ధి యెట్లు గాలేకుండున్. 83

క. ఆలస్య మకర్తవ్యము, కాలం బారంభమునకుఁ గరులు మదరులన్
ద్రోలి శశప్రాణంబులఁ, బాలింపుము నీయుపాయపాటవ మమరన్. 84

క. అని యాజ్ఞాపించిన నయ, వినయపరాక్రమవిధానవిజయుఁడు విజయుం
డనిలరయంబున నెదురుగఁ, జని యూథపుఁగాంచి మానసము గలఁగుటయున్. 85

క. గజమంటినట్ల యడచు, న్భుజగము మూర్కొనినయట్ల పొరిగొను ధరణీ
భుజుఁడు నగినట్ల చంపుం, గుజనుఁడు మన్నించునట్ల కొను బ్రాణంబుల్. 86

క. కావునఁ గరినికటమునకుఁ, బోవం గార్యంబు గాదుపో యిపుడు మహో
ద్భావనమున నుపకంఠ, గ్రావాగ్రం బెక్కి ముఖ్యకరిఁ బలికెంతున్. 87

చ. అనిగిరి నెత్తమెక్కి శశ మగ్గజవల్లభుఁ జూచి యిట్లనుం
గనలున నీకు రాఁబొలుము గాదిది నిల్కలు చందమామ న
న్ననుపఁగ నచ్చితిం బనునమై యలజాబిలిలో శశంబుగా
మనమున నన్నెఱింగికొనుమా యన దంతి వరంసుఁ డిట్లనున్. 8

క. ఏమినిమిత్తము శశక, గ్రామణి నిన్నిటకుఁ బంపెఁ గైరవమిత్రుం
డామాట తేటపడఁ జెపు, మా మాకన విజయుఁ డగ్గజాగ్రణి కనియెన్. 89

క. హేతులు పైఁబడునపుడున్, దూతలు సత్యంబుఁ బలుకుదురు తద్భాషా
వ్రాతమునకుఁ గలఁగరు ధా, త్రీతలవల్లభులు నగరు తెగ రెప్పటికిన్. 90

క. అలనెల తనమాటలుగా, నలవున నీతోడ నాడుమని నన్ననుపన్
దలమోఁచి చెప్పవచ్చితిఁ, దెలియ న్వినుము యూథపక్షితిప యప్పలుకుల్. 91

ఉ. చారువిచార యిక్కొలను చంద్రసరోవర మిందుఁ దారకా
ధారుఁడు చంద్రుఁ డిష్టవనితాజనతాయుతుఁడై యథేష్టసం
చారవినోదము ల్సలుపుసంతతము న్వినుమట్లు గాన నె
వ్వారికిఁ బోవరా దెలుఁగవాలుట కిత్తెఱఁ గింతవింతయే. 92

చ. నిశతము నీయరణ్యధరణీసరణిం జరియించునీశశో
త్కరములు నాకుఁ జుట్టములుగాఁ బరికింపుము చంద్రనీరజా
కర మతిభీకరంబు తడగాఁజను నా విహితోపదేశ మా
దరమున వీనుల న్దొనుపు దవ్వుఁ బవాఁడవు గాక నీతికిన్. 93

చ. సరసికి మీ రఖండతరభసంబున రాఁ బరికించి యాసుధా
కిరణుఁడు నేఁడు మేరుగిరికేసరుల న్మిముఁ జంపఁ బంపఁగాఁ
పరశువు గోరఁబోవుపనిపట్టున నేమిటికంచు మాన్చియీ
తెరువున మిమ్ము నిల్పఁ జమదెంచితి నీతిపరుండఁ గావునన్. 94

క. చావక నోవక యాదల, పూ వాడక నానియోగమున నెందైనన్
బోవుట శోభన మన దం, తావళ మి ట్లనియె శశవతంసంబునకున్. 95

సీ. అదిచంద్రకాసారమాసారమానసతారలు దారలై తనుభజింప
జలవిహారం బందుసలుపు నె నిలుపు నె యొరులెవ్వ రిటకు రాకుండ విధుఁడు
పంచాననముల మాపైఁ బంప ననుకంప మాన్చి యేతెంచితె మమ్ముఁ గావ
నీవంటి కారుణ్యనిధి యెన్నిభవములం గలుగు నీకతమునఁ గలిగె బ్రతుకు
తే. మగిడి పోయెద మనుచు నమస్కరింపఁ
బ్రత్యయముపుట్ట నక్కరి ప్రవరుఁ గొనుచు
విజయుఁ డారేయి గొలనిలో వెలుఁగువానిఁ
జంద్రు ననుబింబితుని జూపి జరుగుమనియె. 96

వ. అవ్విజయు నియోగంబున దంతిపతి వనాంతరచింతం బఱచె నంత శిలీముఖ ప్రము
ఖశశంబు లానందించె గజంబులఁ దిరుగఁ ద్రిప్పుట శశంబుల ప్రశయంబు మాన్పు
టచంద్రవ్యపదేశంబునం గాదే యట్లగుటఁ బ్రసిద్ధుం డగు రాజు నాశ్రయింప
వలయు దాన సుఖలాభంబులు దుఃఖక్షోభంబును నగు నీయులూకంబు ప్రసిద్ధం
బగురాజ్యంబున కర్హంబు కాదనిచెప్పి కాకంబు వెండియుం బులుఁగుల కిట్లనియె.

క. సముచిత మెఱుఁగక క్షుద్రుం, గ్రమరహితుగు ఱించిపోవఁ గడుఁగీడొదవున్
దమలో నొంటక మార్జా, లముడగ్గటి శశకపింజలంబులు దెగవే. 98

క. నావిని విహగములను వయ, కోవిద యారెంటికేల గొదగొదపొడమెన్
జావేలవచ్చె నోతువు, చే వానికి నింతపట్టుఁ జెపుమా తెలియన్. 99

చ. అని తనువేఁడుకొన్నఁ గరటాగ్రణి పక్షులఁజూచి యిట్లను
న్వినుఁ డలవింధ్యభూమి నొకవీరమహీరుహమూలకోటరం
బునికి యొనర్చి యమ్మనికినుండుఁ గపింజల మప్పవిత్రితో
నెనసి తదైకదేశమున నేనును నుండుదు సఖ్య మేర్పడన్. 100

చ. తగ గగనప్రచార మవితారివిభాకరుఁ డస్తమింపఁగా
ఖగము నగంబుఁ బాసి పలుకంచువల స్నెనుమంద పెంటలం
జిగి నిగుడం జదల్మెదలు చేఁడెలపండినపూరిదారులం
బొగసినపొళ్ళమేఁపుఁగొనఁబోయి హుటాహుటి రాకతక్కినన్. 101

ఉ. డేగకుఁ జిక్కెనో యురువడిం ధృతి గాడ్పడి దవ్వుపోయెనో
లాగము దక్కి మచ్చువలలంబడెనో వెరవేదిపాదినెం
దేగనొ పుట్టలెక్కి కర మేమఱి పాములచేతఁ జచ్చెనో
యేగతియంచునో తెలియ దింతయు రాఁడు వయస్యుఁ డక్కటా. 102

క. అని బాష్పవారిధారల, ల్గనుదోయిం జెమ్మగింపఁగా నలుదిక్కుల్
గనుఁగొనుచు వితాకుఁడనై, చన నేరక యుంటి నన్నిశాఖాముఖమునన్. 103

శా. ఆహా కృచ్ఛపలావిలాస మఖిలప్రాణిత్రుతివ్యగ్రగ
ర్జాహంభావసమగ్ర ముగ్రరయనద్యంబూత్థితాంభోనిధి
వ్యూహం బాహతకాననజ్జ్వలన మోహో మింటితో వ్రేలఁగా
లాహిం గట్టినచాడ్పునం గురిసె ఘోరాసార మచ్చీఁకటిన్. 104

క. అలజడి యలజడి చేతం, గలఁగి మహాశకము దీర్ఘకర్ణం డనువాఁ
డలఘుకపింజలకోటర, నిలయంబున నంఘ్రులూఁది నెమ్మదినుండెన్. 105

క. జడిగొన్నవాన నేనుం, దడిసితి నాలో నొకింతదయవుద కానె
వ్వడి సడలె నడఁగె నుఱుముల్, నిడిమించులు మాసె వెలుఁగు నిలిచె న్వెలిచెన్.

ఉ. తెక్కునఁ బ్రాంతపక్కణకుటీశిఖరంబుల నెక్కి లాఁచుచుం
గుక్కుటకోటి మ్రోసె నెసగూరుమిటారులపుట్టినిల్లు గ
బ్బెక్కినమబ్బుశ్శైలగుహ లీఁగె దిశ ల్వెలుఁగొందె నిక్కలం
జక్కవజోళ్లు గేరె జలఁ జాత హితుం డుదయించెఁ దూర్పునన్. 107

క. పొలమున మేఁపాడి కపిం, జల మత్తఱి మరలివచ్చి శశము నివాస
స్థలిఁ గనుఁగొని యదలింపుచు, నలఘుతరక్రోధహృదయమై యిట్లనియెన్. 108

శా. ఔరా కన్గొన మెంచు నీతగవు లెస్సాయెం బురే యెవ్వరి
ట్లూరం బుట్టనివింత యన్యగృహమం దుండ న్విచారింతురే
రాహాపుల్గొఱగావు నేఁటి కొకనేరం బోర్చితిం జావకో
రోరీ యెచ్చటికైనఁ బోయెదవొ పోపో యింతక్రొవ్వేటికిన్. 109

క. ఇది నాయది నాకేలీ, సదనము నీ కిందు నిల్వఁజను నె దురాత్మా
పదటతన ముడిగి యుంతేఁ, గదలుము లెమ్మనిన దీర్ఘకర్ణుం డనియెన్. 110

చ. బిరుసులుపల్కి నన్ను వెఱపింపఁదలంచెదొ కట్టిపెట్టు నీ
గరువము వెట్టి యీశశశిఖామణిముందర నేడ నెవ్వరె
వ్వరు వసియించి యుండి రది వారిదకాననభూమిజాతకో
టరముల నాఁపువెట్టెనె యొడంబడి పక్షుల కుర్వి చెప్పుమా. 111

క. చెఱువులు బావులు గృహములు, తరువులు వృత్తులు ననారతము గాచినయా
నరు లయవి యనుచు మనువు, త్తర మొసఁగఁడె తొల్లి దేవతా సంతతికిన్. 112

క. బలవంతుఁ డైనధరణీ, తలభర్తకుఁ బోలునిట్టితగ వకటవకటా
పులుఁగులకును గుందేళ్ళకుఁ, బలుకులు నేయేల చెల్లుబడి గాదుసుమీ. 113

క. జగతీరుహవివరమునకు, ఖగనాథా నీకు లేదు కారణమేలా
తెగిపోర నాకు నీకుం, దగ వెక్కుడికేని నరుగుదము గమ్మనుడున్. 114

వ. మదీయమైత్రీమంజులం బక్కపింజలం బిట్లనియె. 115

క. ఒప్పితి నిటఁ దగ వెవ్వరు, చెప్పెద రెఱిఁగింపు మతనిఁ జేరఁగ నెడలే
కిప్పుడ యరుగుద మనవుడుఁ, గప్పినతమకమున దీర్ఘకర్ణుం డనియెన్. 116

సీ. తపనజాతటమున దధికర్ణుఁ డనుమహావృద్ధమార్జాలంబు విహృతిసల్పు
నది రుద్రచాంద్రాయణాదికార్యంబులఁ దనువు సన్నముఁ జేసికొని విరోధి
షడ్వర్గ మణఁగించి శాంతివర్తిలుబహువ్యవహారదర్శి నయాంబురాశి
యది నేర్పుమన చిక్కువదలింపఁ బెనుజోలి ద్రవ్వక నిమిషంబు దడయకటకుఁ
తే. బోదమావాద మాఱడి బోకపోవు, నని ప్రబోధించి శశ మమ్మహాకపింజ
లంబుఁ దోకొని చనుచుండె లాఘవమునఁ, దలలు వడుచోటికేగుపాదములు గానె.

క. ఏను గపింజలుఁ జిరమై, త్రీనిధి విడనాడలేక వృక్షులతాగ్ర
స్థాని విడనాడి యెపుడెం, తేనెవ్వడిఁ గూడిపోయితిం జెలికానిన్. 118

మహాస్రగ్ధర. చని కంటిం బ్రాంతకాంతక్షమనిదవధికశ్లాఘ్యసౌరభ్యసంప
ద్వనజాతవ్రాత రోధోవనవమధుమధువ్యగ్రమత్తాళిగీతన్
జనితశ్రద్ధానిమజ్జజ్జనఘనహరణోచ్చండకాండప్రపూతన్
వినిపక్షబ్రహ్మనిష్ఠద్విజహితసికతాస్వీతఖద్యోతజాతన్. 119

తే. కని తదంచితమణివాలుకావితర్దిఁ, జరణములు మోఁపి నిర్గతశ్రముఁడ నైతిఁ
గంఠపర్యంతపరిమిళద్గ్రాసమంద, జవనపవనాభిగమసమాచారకలన. 120

సీ. మనికిచోటిదిగాదె యనువాసరాచాంతఖచరజీవితమరుత్కాళియునకు
నాటపట్టిదిగాదె యరిపభాగతగోపవేషబృందావనవిష్ణువునకు
నిష్టమజ్జనగృహంబిది గాదె రాసనృత్తశ్రాంతకాంతాసతంసములకు
హాలహాలంబిదిగాదె హాలోద్ధతప్రలంబారిలాంగలకేళి హానమునకుఁ

తే. ప్రతిదినము గ్రోల నిది గాఁడిబావిగాదె, కృతశకృత్కారినందగోబృందమునకు
క్షేత్ర మిది గాదె దివసకృజ్జలజమునకు, నని నుతించితి సంవిదాయమునయమున.

సీ. అచటఁ గపింజల మావృద్ధమార్జాలపతిఁ జూచి చిత్తంబు పల్లటిలినఁ
గదియఁగూడక దీర్ఘకర్ణుఁ జూచి నిజాలతగవరి యని వీనిఁ బొగడితీవు
కుటిలమానసుఁ డతిక్షుద్రుండు కేవలజఠరపూరకుఁడు మార్జాలజాతి
బెడిదుండు వీని నమ్మెడితెఱం గెయ్యది యొద్దికిఁ జనఁ జిత్త మొప్పకొనదు

తే. తగవు దయ్యానె ఱుంగు నీతగవుపట్టు, ప్రాణమేటికిఁ దెకతేరఁ బాపికొనఁగ
ధర్మమునకొండుకడ కేగుదము దురాత్మ, మగుడు మనుటయుఁ గనలి యమ్మదటశశము

చ పలికెఁ గపింజలంబున కపారకృపానిధితుల్యదర్శికే
వలపరిశుద్ధుఁ డార్తజనవత్సలుఁ డుత్తముఁ డబ్బిడాలభూ
తలపతి యిట్టిధర్మపరతంత్రుఁడు నమ్మినవారిఁ జంపఁగాఁ
దలఁచునె యేమిపల్కితి పతత్రిపసంశయ మొప్ప దియ్యెడన్. 123

చ. ఇన్నియుఁ జెప్పనేమిపని యింకిట నీవది నంతసాధ్వసం
బున్నబిడాలముఖ్యుకడ కొక్కట నిద్దఱ మేగి సర్వము
చ్ఛిన్నమనీషవిన్నపముఁ జేయుద మూరకవత్తు మంచు ము
న్విన్నను గానలేక పిఱుబీకులు సేయ ఖగంబు బీరమై. 124

వ. యాగపద్యాభిమానంబున శశకపింజలంబులు డాయం బోవుచుండె నప్పు డారెంటికి నిత్యప్రత్యయం బారాధించుటకుఁగా దధికర్ణుండు ధర్మవాక్యంబు లుచ్చరింపం దొడంగె. 125

క. ధర్మంబు తన్నుఁ బెనుచున్, ధర్మం బభివృద్ధిఁబొంది తను బ్రదికించున్
ధర్మము శర్మకరం బని, ధర్మం బేమఱరు సంతతము దత్త్వజ్ఞుల్. 126

ఉ. ఉపగతులై భజించుతనయు ల్సహజన్ములు గూర్మిచుట్టము
ల్విపులతరైకదుఃఖముల వేగుదు రింతియ రారు వెంబడిన్
నిపుణులకేల తన్మమత నెట్టన దేహి శరీరమూడ్చి చ
న్నపుడును ధర్మమొక్కఁడ సహాయము దానిఁ ద్యజింపవచ్చునే. 127

క. పురుషార్థపరున కిహముం, బరముం గలదండ్రు సత్యపరతంత్రు సురా
సుర లర్చింతురు గావునఁ, బరహితసత్యములు విడువఁబడ వెప్పటికిన్. 128

తే. ఆత్మవత్సర్వభూతాని యనుపురాణ, వచనమూని బహుప్రాణివత్సలుఁడయి
సుఖము దుఃఖము సమముగాఁ జూచికొనుచు, దేహి పరలోకచింత వర్తింపవలయు.

చ. సొలవక మేను కంటకము సోఁకినఁ గొండొకశోణితంబు పి
చ్చిలి తనకెంతనొప్పి యగుఁ జెప్పెడి దొండొకఁ డేమి దేహముల్

గలిగినవారి కివ్విధముగాఁ దనువేదనలంచు నేరిపై
నలుగుటలేక హింస కెడరై చనఁగాఁ జనుసద్వివేకికిన్. 130

క. అనుదధికర్ణనిపలుకులు, విని నిర్భయవృత్తిఁ గొంకువీడ్కొని కదియం
జనితనతనవాగ్వాదము, లనుదానికి శశకపింజలంబులు సెప్పెన్. 131

సీ. చెప్పిన నప్పు డాజీర్ణోతువారెంటి కనియె మీరేమనియెదరొ వినము
తెగనిచాంద్రాయణాగ్నివ్రతంబుల దేహ మతికృశం బొనరించుకతనఁ జెవులు
తానకనూత్నశబ్దస్వీకృతిం బాటిగావు గావున నీవు నీవు నిప్పుడ
శ్రవణము ల్గదిసి యుచ్చైస్స్వనంబులఁ బల్కుఁ డేర్పడ మీసుద్దులెల్లఁ దెలియఁ
తే. గదవె మమునంటిమునులకుఁ దగవుదీర్ప, వేపురుండంగ మము మీరు విశ్వసించి
దూర మరుదెంచితిరి కానఁ ద్రోవరాదు, జాగుపనిలేదు మాకనుష్ఠానవేళ. 132

క. అరుదెండని నికటంబున, కరిగినదధికర్ణుఁ డంప్రిపాతి నారెంటిన్
దొరకుపడఁ బట్టుకొని కం, ధరవిరియం గొఱికిచంపి తగభక్షించెన్. 133

సీ. క్షుద్రాశ్రయంబు నొమ్చుటకు జచ్చుట కాదికారణం బనిచెప్పి కాక ముఖుల
ఖగములఁ జూచి ఘూకం బేడఁ బక్షిసామ్రాజ్యాభిషేకసంరంభ మేడఁ
బనిగానిపని మానుఁడన రోసి కూడినపులుఁగులు చదలఁ బేరెలుఁగులెసఁగ
వెసఁగన్న దెసఁ గుబ్బెసలారఁ బఱచిన దర్పాంధ మద్విహంగంబు గనలి
తే. పసపుఁ జేగురుకొఱకచ్చు మిసిమిదేర, మిట్టకనుగ్రుడ్లు మిడిమిట్లు మిడిసిపడఁగఁ
గంఠఘూత్కారములదిశ ల్గలవరింప, గర్వదుర్లోకమునకుఁ గాకమున కనియె. 134

క. ఏమినిమిత్తము కుటిలా, త్మా మత్స్వామికిని నెగ్గుఁదలఁచితివే నీ
కేమిదురితం బొనర్చితి, నేమంటి భవద్విరోధి నే యిదితగవే. 135

క. శైలవనవహ్నిశిఖలం, గాలిపొదల్పొదలుఁ బరశుగతిఁ ద్రవ్వి మనున్
సాలములు సత్క్రియూప్రతి, కూలవచోదగ్ధమునుఱకొన దింతైనన్. 136

ఉ. కుచ్చితమేమిగూడు సమకూడినరాజ్యము పీటఁబుచ్చఁగా
వచ్చినలాభమేమి మఱవంబడదా తరువాత నిట్టినీ
యొచ్చపుఁజేఁత సౌఖ్యమున నుండుదుగాకని పల్కిపోయె న
వ్వెచ్చఁజూమీ విరోధ మొదవెం గరటాళి కులూకజాతికిన్. 137

క. నావిని వాయసపతిచిర, జీవికి నిట్లనియె నీతిశీలా హితసం
భావన కిఁక నీతడవే, లా వేగమ తెలుపు మనిన నతఁ డిట్లనియెన్. 138

వ. సంధివిగ్రహంబు విచారణీయం బాసనము బలిష్ఠమయ్యె నుపస్థితరిపుస్థానం బగుట
నదియునుం గూడదు యానంబునకు లావు చాలదు స్థానత్యాగంబు లాఘవమూలంబు

ప్రత్యాసన్నవిరోధిబలం బభావంబగుట ద్వైధీభావంబు పొసంగదు సంశ్రయం
బన్నిటికిం గర్తవ్యంబు విను శరీరపతనపర్యంతంబు నీకార్యంబున కేఁ బాటుపడఁ
గలవాఁడ. 139

క. పలువురకృతవైరులు మతి, బలధుర్యులు విమతులున్నఁ బరకార్యంబుల్
పొలిసిపడుం జెడు మునుధూ, ర్తులు మేఁకం గుక్కఁ జేసి తోలరె విప్రున్. 140

క. నావిని వాయసపతి చిర, జీవికి నిట్లనియె నీతిశీలా యేలా
గీవిధము తేటపడఁజెపు, మా వినియెద నన్న నతని కతఁ డిట్లనియెన్. 141

సీ. చెనఁటి యాకులపాటుచే నలంగినసాధుతరుల కుబ్బొసఁగు నాదరణమూర్తి
భీమతీవ్రాంబకాభిహతి స్రుక్కిన మహాపథికధర్మ్మనినొప్పి మాన్పువెజ్జు
ఫలభంగమున మాటపట్టుజారిన పికమునకు సత్యోక్తు లిచ్చినసుదాత
వాలినమత్తచండాలుర మాధవార్చనధురంధరులఁ జేసిన ఘనుండు
తే. కాలగతిఁ జేర్చు నలజళ్ళఁ గలఁగఁబడిన, సరసులకు నిర్మలత్వంబు సంఘటించు
సౌఖ్యసందాయకుండు సాక్షాత్క, రించె, సన్మతానంతుఁ డవనిపసంతుఁ డంత. 142

సీ. ముక్తపత్రవ్యాజమునఁ జీరవడలించి కళికలఁ బులకల గలుగఁజేసి
పాలిపోనితావులఁ బూవుదండలఁ జుట్టి కడలేనిమధుసాత్త్వికమునఁ దేల్చి
రణదళిఝంకారమణితము ల్పాటియించి దీవిచక్కరలూఱు మోవియాని
సరవినున్నతఫలస్తనములఁ గబళించి కళదేఱుతనువల్లి గౌఁగిలించి
తే. కలికిరాచిల్కపల్కుఁబలుకుల నలర్చి, సురభికర్పూరరజముల సొంపొనర్చి
కలితవనలక్ష్మిఁ గూడి రాగము వహించె, మాధవుఁడు వ్యాప్తనిఖిలతమాధవుండు.

వ. మఱియు నవ్వసంతంబు కళికాభిరామంబై యుదాహరణంబును శుకసూక్తిసందర్భ
గర్భితంబై భాగవతంబును గలకంఠికలాపదీపితంబై రాజావరోధంబును ప్రకాశిత
ప్రవాహంబై సముద్రతీరంబును సంధృష్టశారికాజాలంబయి వీణాయంత్రంబును
బురుడించు నక్కాలంబున.

చ. కలఁ డిల ముగ్ధభూసురుఁ డొకానొకఁ డాయన యధ్వరార్థమై
బలిసినమేఁకపోతు మెడ పగ్గమునం బిగియించి యీడ్చికొం
చలవున నింటికై యరుగ నప్పుడు గొందఱు ధూర్తు లిచ్చలో
పలఁ దలపోసి యయ్యజముఁ బాపఁదలంచిరి దుర్ణయంబునన్.

క. తలఁచి యొకఁడొకఁడ చని లో, కులు నవ్వ న్విప్రుకక్కఁ గో
నులశీలంబులు వఱదం, గలపితి విఁక నేమియని వికావికనగుచున్.

క. ఈగతి నందఱు యాజన, చ్ఛాగముఁ గుక్కగముఁ జేసి చనుచు

నాగరిక మేదివిప్రుఁడు, వేగలమున నిలిచి భ్రాంతి వికలుం డగుచున్. 147

క. ఒకరిరువురు గా కందఱు, నకటా ఛాగంబుఁ గుక్క యని పోయెద రే
టికి బ్రమసి వేఁపిఁ దెచ్చితిఁ, దుకతుక నను నవ్వకుండుదురె తత్త్వజ్ఞుల్. 148

వ. అని విహారణస్థలదచ్ఛాగం బగుభాగంబు విడిచి విప్రుండు ఘూర్ణశరం బగుకాసారంబునకు స్నానార్థియై చనియె నప్పుడు ధూర్తులు ప్రహాసభాసమానాననులగుచు నొండొరులకరంబు లప్పళించుకొనుచు నయ్యజంబుం జంపుకొని భక్షించి రట్లు ప్రజ్ఞాశౌర్యధైర్యాదిగుణంబులు గలవారలు పరులకార్యంబుల విఘాతంబుసేసి స్వకార్య ముద్ధరింతురని మఱియుఁ జిరంజీవి మేఘవర్ణు నాలోకించి. 149

క. తనలావుఁ జూచి మృతకా, కనికాయశరీరరక్తకణములు మేనన్
జినికిపటుతటమునందిడి, చనుఁ డుపహతిరహితభూమిజాతంబులకున్. 15)

క. అరిమర్దనుండు సరిప్రా, ద్దరు దెంచుం గొరలి తరలి హతశేషనట
త్కరటవ్యాతికటభజింతున్, హరుఁ డాపగవారిఁబోలె నాపగవారిన్. 151

వ. భజించి నీకార్య మార్యసమ్మతంబుగా నిర్వహింపం గలవాఁడనని పలికిన మేఘవర్ణుండు లుంఛితగరుజ్జాలుం గావించి విస్రం బగు కాకజరరాస్రంబుఁ జినికి యచ్చిరజీవిని న్యగ్రోధాగ్రకోటరంబునం బెట్టించి సపరివారుండై నిరుపహతిస్థానంబున కరిగె నాసమయంబున. 152

చ. అరుణగభస్తిబింబ మపరాద్రిఁ దిరోహితమయ్యెఁ బన్నగా
భరణి శిరోధిహాలహాలభంగి నిజు ల్మెరసె న్విరోధిభీ
కరగతి వంతకాఁబపరిగాఢమహీధరభూజమర్గకో
టరములు నిర్గమించి వికటప్రకటాననము ల్మడింనుమన్. 153

క. అరిమర్దనుఁ డనుపబల, స్ఫురణోల్లోకములు ఘూకములు పటుకరటా
హరణేచ్ఛఁ గదలి బహుపా, ద్ధరణీరుహ మాశ్రయించి తద్విటపమునన్. 154

క. కాకములు మెదలకున్నన్, ఘూకంబులు కర్ణఘోరఘూత్కారహతా
శాకులము లగుచుఁ గ్రమ్మఱి, పోకను నఱిదుచున్నపుడ భూజమునన్. 155

క. మతివిదులకు నుచితమనూ, ద్యతనము సారంభుఁడయ్యె నాకృతకార్య
స్థితిఁ గడఁగనియునికి మహో, న్నతియని మను వానతిచ్చినాఁ డట్లగుటన్. 156

క. అనితలఁచి నిలిచి రివిం, బనివడి చిరజీవి యేయుపడ నొకనెట్టం
బొనరించినఁ గ్రమ్మఱి పరి, మునుమై యత్తోలులఁ జట్టుముట్టె న్బట్టెన్. 157

క. పట్టుకొని చంప నొంపం, గట్టాయితపడక యరుగుఁ గావున నతనిం
జుట్టముపలెఁ గొనిచని పతి, కట్టెదురం బెట్టి కౌశికంబులు నిలిచెన్. 158

క. దూరితగరుదుత్కరుని, ప్రారుణఘనలోహితాకృతాకృతి నతనిన్
దేరికొనఁ జూచి గర్వస, మారంభోక్తుల విరోధిమర్దనుఁ డనియెన్. 159

క. ఓరీ నీవెవ్వఁడ వీ,తీరేమిటికైతి వనిన ధృతిపెంపున నా
పేరు చిరజీవి యనిన య,పారగుఁ డాయన యులూకపతి కెఱిఁగించెన్. 160

క. ఎఱిఁగించిన మించిన ని,వ్వెఱ నిట్లను ఘూకలోకవిభుఁ డిట్లగునే
తెఱఁగు చిరజీవి నిన్నఱ, మఱలే కకాకరాజు మన్నించుఁగదా. 161

వ. దివస్పతికి బృహస్పతియుంబోలె మేఘవర్ణునకు ముఖ్యప్రధానుండవు నీతిపథికుండవు ధన్యుండవు నీయట్టి కృతకృత్యునకు నిన్నిచదశ రానేర్చునొకో సర్వంబునుం జెప్పుమనిన జిరజీవి యరిమర్దను నాలోకించి. 162

చ. తనపెనుగాకిమూఁకల నదాటున నీభటకోటిముట్టి కా
వనితఱిఁ జంపి చన్నమఱునాఁడు మృతేతరభృత్యవర్గము
ల్గనుకనిఁగొల్వ నచ్చిలిచి కార్యము వాయసభర్త వేఁడినన్
మనమునఁ గొంకులేక యరిమర్దనునిం గనుమంటి నాతనిన్. 163

చ. ఘోరబలుం డగాధతరుకోటరదుర్గవిహారిరాత్రిసం
చారనిరంకుశుండు పటుశౌర్యధనుం డరిమర్దనుండు క్రూ
రోరగభంగిఁ జంపఁదలనుండఁగ నెవ్విధి నిద్రవచ్చు నీ
వారికి నీకు నెట్లుమునవచ్చు శుభంబు భజింపుమా యనన్. 164

క. అరిమర్దను నిటఁగని మని, తిరిగినజమునోరు దన్నితివి నాబుద్ధిం
జరియింపు మనిన వాయస, పరివృఢుఁ డందులకు మండిపడి నావంకన్. 165

ఉ. చూచి హితప్రధానుఁ డనుచు న్మదిఁబెద్దయు నమ్మియుందు ని
న్నీచు విరోధిపక్షుఁ డని నేరనయో తుది నిశ్చయింప నిం
దీచెడుగొట్టుకాల్నిలిచె నేనిఁ జెఱుం బ్రతుకంచు నూఁచిపో
వైచి యులూకభుక్తి కినవత్సుఁడై విడిపించె మన్త్రిపైన్. 166

తే. ఎఱుక పిడికెడుధనమంచు రిదినిజంబు, నేరయునీమూఁకమున్నున న్నెఱుఁగుఁగానఁ
గనలి చంపక నొంపక గావఁబమున, దేవ నీపాదములమ్రోలఁ దెచ్చి నిలిపె. 167

తే. తోడిమంత్రులజాడ నాదుర్మదాంధుఁ, డాడిన ట్లావ కుచితకార్యంబుఁ జెప్పి
సిగ్గుగోల్పోతినని చిరజీవిజాతి, బాష్పుఁడై చెప్పెఁ దనచేటుపాటుఁ బతికి. 168

క. ఆవేళ ఘూకపతి నయ, కోవిదు లగుమంత్రివరులఁ గూర్చి ప్రభుత్వ
ప్రావీణ్యంబున నచ్చిర, జీవిచరిత్రంబుఁ బ్రీతిఁ జెప్పెం దెలియన్. 169

తే. చెప్పి వాయసరాజన్యశేఖరునకు, మాననీయుండు ముఖ్యప్రధానుఁ డితఁడు

దీని కిత్యాదితెఱఁగు వేర్వేఱఁ బలుకుఁ, డనిన నయదత్తుఁ డను రక్తాక్షుఁ డనియె

క. చేరినమృత్యువు రిపుఁ డ, క్రూరాత్ముఁడు చిక్కినపుడ కొంకక చంపం
గోరుట నీతివిధానము, వైరికి దయఁదలఁచువెఱ్ఱివాఁడుం గలఁడే. 17

సీ. ఇతఁడు వాయసధరాపతికి మాన్యుఁడు ముఖ్యదండనాథుఁడు నీతిధాముఁ డనుచు
నానతిచ్చితి నిట్టివానికి నిట్టిదుర్వేషంబు వచ్చుట నెఱుఁగు గాదె
ప్రత్యర్థికర్మమర్మము లెఱుంగుటకు రాజ్యప్రతిష్ఠకు నిట్టిసాధుమతులు
విను నీచవేషమైనను బూని బద్ధవైరులలోఁ బ్రవేశించి చెలిమిఁ జేసి

తే. చిచ్చు దాలిసొచ్చి వృక్షంబుఁ జెఱిచినట్లు, పొదివి నానాఁటి కభివృద్ధిఁ బొందిపిదప
జెఱిచి పోదురు వీనిరక్షింపనేల, చంపి రాజ్యంబు సేయుము నిశ్శంక నధిప 17

క. అని రక్తాక్షుఁడు చెప్పిన, వినఁగూడక ఘూకభర్త విశ్రుతనయధీ
ధనదత్తునిఁ గ్రూరాక్షుని, గనుఁగొనుటయు నతఁడు మధురగతి నిట్లనియెన్. 17

క. శరణాగతురక్షించిన, పరహితచరితున కిహంబుఁ బరముం దురగా
ధ్వరఫలముం గలదనిరొ, యరిమర్దన కావు మిమ్మహోచిరజీవిన్. 17

తే. అనుచు గ్రూరాక్షుఁ డాడిన నద్దిశాంధ, వల్లభుఁడు విని దీప్తాక్షువంకఁ జూచి
నీకుఁ దోఁచినకార్యంబు నీవు సెప్పు, మనిన నంగీకరించి యిట్లనియె నతఁడు

క. క్రూరాక్షునినీతి సుధా, పారంపరి యెట్టిసుస్వభావుఁడు జంపం
గోరఁడు శరణాగతు నన, ఘూకరాజకు నీకుఁ దగవు గానేర్చునొకో. 17

క. ఈరీతి నీతిగలిగిన, సూరిజనుం డేచె యుపఁజూచుం జనతా
వైరి యగుదొంగబంటుప, కారము వృద్ధునకుఁ దొల్లి గావింపఁడొకో. 17

క. నావిని యరిమర్దనుఁడును, భావుని దీప్తాక్షుఁ జూచి ప్రభునీతికళా
సేవధి విన నింపయ్యెఁడు, నావిధ మెఱిఁగింపు మనిన నతఁ డిట్లనియెన్. 17

చ. కుండినరాజధానివసుగుప్తుఁ డనంగఁ బ్రధానసార్థవా
హుం డఖిలార్థసంతుఁడొకఁ డుండు నతండు ప్రియావియుక్తుఁడై
పండినమూర్తితోడ నగుబాటున కుంకువఁ దన్వినొందుచో
నండజయాన రూపవతి యన్నులకన్యకఁ బెండ్లియాడినన్. 17

క. అలరుంబ్రాయపుఁగన్నుల, కలికికి ముదిమఁగడు బూఁచిగావున గవియ
న్దిలతైలమువలె నెనయక, తొలఁగుం జెలిసెట్టిఁ గన్నఁ దుప్పానసుమియన్. 18

క. వెతలం బొగులుచు నెట్టన, రతిగతికిం బిన్నపడుచ రారమ్మనుచుం
బతిమాలి పిలువ విన దది, పతిఁబట్టిన చెవుడు దన్నుఁ బట్టినభంగిన్. 18

మ. పలితశ్మశ్రుశిరోజరోగలతికోపఘ్నుం ద్దనుర్భంగురున్
ఫలియుగ్వక్త్రనిత స్తతశ్చలితనిస్వస్థోత్తమాంగుం గర

స్థలయష్టిం బటలావృతాక్షు విగళద్దంతు న్వయోగర్వని
స్తులరోమాశిత్వక్కుల మేళ్వడం బరిహరించు న్త్రాలవానింబలెన్. 182

సీ. పాఱవేయుటె కాని భత్యంబు లిచ్చిన వాతెర నంట దవ్వాలుగంటి
చించివైచుటె కాని చీరలిచ్చినఁ గటీరమునఁ గైసేయ దాఱంపులాడి
తొలఁగఁబెట్టుటె కాని తొడవులిచ్చిన సొంపుపస మేనబూన దప్పలుపచెలువ
మగుడనిచ్చుటె కాని మాడలిచ్చిన ముల్లెఁ గట్ట దాజగజాఁగ కలువకంటి

తే. యింటిముంజూరుపెండెలో నిడుటె కాని, పువ్వులిచ్చిన ముడువ దప్పొగరుమగువ
కుడిచి కూర్చుండి యిదియేమి గొడవఁ జేసె, వార్ధకంబున నాసార్థవాహకుండు 183

ఆ. చెనఁటిభార్య పేరుఁ జెప్పగ పెఱబోటి, పేర సిగ్గుఁ దొలఁగఁ జెట్టె సెట్టి
ముదిమి నేడ రోఁత యిదె నాకవిటవిటీ, జాతివశ్యభేషజంబు లడుగు. 184

సీ. మొరడువంగిన సెట్టిముదుకకు జవరాలిమోము గాననివానిముకురమయ్యె
నగ్గుభర్తకు నాఁతి వాతెర చండాలవాటికండిన పిండివంటలయ్యె
గొయ్యలూడిన పెండ్లికొడుకుకుఁ జెలినవ్వు విపినమండలిఁ గాయువెన్నెలయ్యె
వయసుపోయిన బేరివానికి సఖిచన్ను గొండలందనిమానిపండులయ్యెఁ

తే. బలితునకుఁ గోకిలాలాపజిలుఁగుటెలుఁగు, బధిరునకు నయిన సంగీతపాకమయ్యె
మొలఁతనీక్షించి గ్రుక్కిళ్ళు మ్రింగుఁగాని, సౌఖ్యమేమియు నెఱుఁగఁ డజ్జరఠతముఁడు.

చ. నెలకొకనాఁడు గట్టెదుర నిల్వఁగఁ జూచినవాఁడు గాఁడు వీ
నుల కొకనాఁడు మాటవిన నోఁచినవాఁడును గాఁడు నవ్వులన్
వలపులఁ జల్ల మేల్గనినవాఁడును గాఁ డతఁ డెందువాఁడు గాఁ
డలజవరాలితోడి రతి యందని మ్రానిఫలంబు సెట్టికిన్. 186

వ. ఇట్లు సన్నిహితవిశేషవేదనాజాతఖేదంబున నారాటంబు బుట్టి యడియాసపస నుసు
రుఁ బరిత్యజింపంజాలక ఈలకఱుచుకొని యెడతెగక నిగుడు నమందోష్ణనిశ్వాస
మాతరిశ్వంబున నధరపల్లవం బల్లలనాడ నతం డొక్కనాఁడు శయ్యాతలంబున
నొడలుపడవైచి దాసీజనంబులు తనకాచరించునూడిగంబులఁ గోడిగంబులం జేసి
కూడునీళ్ళకుం బాసి గాసిపడుసమయంబున రజస్వలాంభోజినీదివాసంగమక్రీడా
సంప్రాప్తదురిత ప్రాయశ్చిత్తార్థంబు భృగుపాతం బొనర్చినవిధంబున దపనుం డపర
గిరిఁ దిరోహితుం డయ్యె నయ్యెడ. 187

సీ. పిసవెత్తిఱంకుగుబ్బెతలతప్పులు దప్పదాల్పుట కిది కన్నతల్లియిల్లు
కడుపుకక్కుఱితిపిల్పుదుగను ముదిలంజె నఱుముల కిది పిన్నవయసుమందు
గడికన్నగాండ్రయక్కఱలకు నిలుచూఱ పొరువుసొమ్మిడనిది పూఁటకాఁపు

కలవ ర్తకుల కన్నుఁగవలఁ బాయనినిద్రఁ గదలింపనిది నిమ్నకాయపులుసు
తే. ప్రభకుఁ బాసినకుముదినీపత్రనేత్ర, రంజనంబున కిది విశుద్ధాంజనంబు
నాఘనాఘనకాళిమోన్నతి వహించి, కటికిచీఁకటి జగమెల్ల గప్పుకొనియె. 188

తే. మానసాటవి నేర్చుమన్మథదవాగ్ని, బాహ్యసంచారమునకుఁ బొల్పడియె నవఁగ
దీపములు సార్థవాహులమందిరములనందుఁ, బ్రకరశిఖ లుల్లసిల్ల జూపట్టినపుడు. 189

క. ఆరూపవతి ససారా, హారంబుల దృప్తిఁబొంది యపుడేకభంగిం
బోరామి ఘోరనరక, ద్వారములలె వృద్ధపతినివాసముఁ జొచ్చెన్. 190

తే. చొచ్చి వచ్చినచండాలుఁ జూచుమాడ్కిఁ, జూడకల్లంత నోసరించుచు గృహాంత
కాంతభిత్తికఁ జెంతఁ గంకటికి వరుగు, బిటికి నీక్షించి యప్పటిపెద్దసెట్టి. 191

తే. విరహదహనగ్రహంబున విగ్రహంబు, కోలిమి నూఁదినగతి వేఁడి గలిగియుండ
సెజ్జ నారాటపడుచు నక్షీణవిభవు, భల్లకంపితభవు మనోభవుఁ దలంచి. 192

ఉ. లేరె ధనుర్ధరు ల్భువమి లెక్కకు మిక్కిలి యొండు రెండుగా
వా రడరింతు రేటి నెఱవాదితనం బదిరెండు నొండుగా
నారసి వేయ నేరవలదా మఱినీవలె నెంతవింత యా
నీరజగర్భుఁ డుండుఁ గడునీకరకౌశల మెన్న మన్మథా. 193

ఉ. ఇంపున నన్యచాపధరు లేసినతూపులు బాహ్యమాంసముం
జింపక మర్మభేదనముఁ జేయుఁగఁజాలవు బాహ్యమాంసముం
జింపక మర్మభేదనముసేయు భవద్విశిఖంబు లెట్లుగీ
ర్తింపుదు నీదుచాప మహధీరితశంబరకాంచనాంబరా. 194

క. తీరనికోలపగయుంబలె, నీరమణీమణికి నాకు నెనయదు విరహాం
భోరాశి నెట్లుగడతు, నీవారో త్తమ నన్నుఁ గూర్పవే కలకంఠిన్. 195

క. అని వెన్నునికొమరు మరు, న్వినతామరు విరహిభయదవిధసమరుఁ గన
త్కనకమణినిచయచామరు, ననుషక్తభ్రమరు దూఱి యతఁ డున్నంతన్. 196

తే. కుశలగతి మజ్జనములాడి కుడిచి కట్టి, ప్రజలు నిద్రించి రయ్యర్ధరాత్రవేళ
ఖడ్గఖేటకపాణియై గస్తుదిరిగెఁ, బెద్దతలవరి కింకరోపేతుఁ డగుచు. 197

వ. అంత. 198

సీ. భవనదీపాహితభ్రమరపేటికవాలుకాభస్త్రితలము ఖృగద్దగోళ్ళు
ములుదోరణముబట్ట మొలత్రాటిపులువాఁడికైదువు దెసకట్టు కావుబొట్టు
జిలుఁగుగన్నపుఁగత్తి బలపంబు మొగమాయమందు తొలపుటాకు మైలగోఁచి
మదుపుటాకులు పోఁకపాడికాయ మోరచ్చు చెప్పులు భుజగవృశ్చికచికిత్స

తే. సుప్తివృద్ధికరౌషధక్షోద మనిత, వసనభంగంబు పెదతలవంకనికయుఁ
గాఱునునుమేను నెట్టినికన్ను లమర, దూరితత్రాసుఁడపుడొక్కఁడొంగబంటు 199

సీ. వచ్చి త్రిమ్మరుతలవరులు గన్గొనకుండ బవరిచుట్టును బలపమున వ్రాసి
ముంచి కన్నపుఁగత్తి మొనకెత్తిపెట్టించి యొయ్యనొయ్యన శిలలూడ దివిచి
వివర మేర్పఱిచి యావెంబడి బదములు వడపి నల్వంకలు దడవిచూచి
యలికిడిలేకుండఁ దెలిసి యిల్సొరఁజాఱి వాకిటిగడియ నెవ్వడిసడల్చి

తే. గాలిరాకుండ వెలుతురు గాకయుండఁ, గఱకుగఱబట్ట గన్నపుగండిగప్పి
యొడలిసొమ్ములు వేర్వేర నొలిచికొనఁగ, సరస కేతేర బరికించి జలదరించి 200

క. కచభరము విరియ హార, ప్రచయం బల్లాడఁబఱచి పరిరంభించెన్
రుచిరగతి రూపవతి నిజ, కుచలికుచాగ్రములు నాఁటుకొనఁ బ్రాణేశున్. 201

సీ. యువతిసేసిన యపూర్వోపచారమునకు వెసమిన్నుముట్టి యమ్ముసలిసెట్టి
యిచ్చనచ్చెరువంది ముచ్చటయినను మొగం బీనిరక్కస దనుదాన వచ్చి
ననునిటు గౌఁగిలించినది నేఁడిందుకుఁ గారణం బేమేనిఁ గలుగవలయు
ననిలేచి నల్వంక లరసి యొక్కెడ భయంకరహేతికరునిఁ దస్కరుని గాంచి

తే. యితఁడుపో మూల మీశుభస్థితికి ననుచుఁ, బెన్నిధానంబుఁ జూచిన పేదవోలె
నీరదోదయ మరసిన నెమ్మివోలె, సమ్మదంబంది యాపరాస్కంది కనియె. 202

క. పొడపులువుంబలె ననుఁ దన, కడకన్నులఁ జూడరోయికన్నులకలికిం
గడువేడ్కఁ గూర్చితిఁకనె, క్కడఁగలఁ డిటువంటిచెలిమికాఁడాదసినన్. 203

క. మానగుమహీజక్రోడ, స్థానంబున వెలుఁగుమదనదావానలకీ
లానివహము చల్లార్చెను, దీనిపయోధరము లద్వితీయచరిత్రా. 204

క. చోరకుఁడవె యతిసమ్మద, కారకుఁడవుగాక తీర్చగలనే నీస
త్కారఋణ మీభవంబున, దూరీకృతకలుష వడ్డితోడంగూడన్. 205

క. తనగృహమునఁ గలవాసో, ధనకనక ము లెల్లనిచ్చెదను ధృతిమీఱన్
గొని చనుమని యంజలిసే, సినఁ జోరుఁ డతిప్రసన్నచేతస్కుండై. 206

చ. నెఱయఁ జెలంగియున్నయతనిం గని యిట్లను సార్థవాహ యి
త్తెఱవ భవన్నియోగమునఁ ద్రిమ్మరదే యది క్రొత్తగాదె నా
మఱఁదివి నీవు చెల్లెలిది మమ్మవలోకముఁ జేసికాదె బ
ల్వెఱపున నిన్నుఁజేరి పొదవెం దనచక్కనిసోగచేతులన్. 207

క. నీనిలయంబునఁ గలసొ, మ్మేనొల్లం బడుచుకరణ మిచ్చితినిది నీ
తో నలగిన వేసారిన, చో నను మదిఁదలఁపు మలయుచుం బఱతెంతున్. 208

క. చెలియలనిచూడఁ గినిసిన, దలఁ గోయుదుఁ బతికి సమ్మదముగానిది య
వ్వలకేల హితులకేటికి, లలనామణి యిదిమొదలై తెలఁగు నీయాజ్ఞన్. 209

వ. అని భయంబుఁ బుట్టించి కృతసత్కారుండై చోరుండు సార్థవాహు వీడ్కొని చని
యె నాసమయంబున. 210

సీ. రాజాస్యముఖతామరసవాసనల గ్రుక్క నానుముక్కనబంటి యైనదనుక
ధరపయోధరసుధాధరరసంబునఁ జొక్కుఁ బంచబాణపిపాస పాయుదనుకఁ
జంచలేక్షణఘనస్తనగుళుచ్ఛకముల నలముహస్తగ్లాని వోఁగుదనుక
నాతిగాఢాలింగనమునఁ దెప్పలఁదేలు బొందితాపము శాంతిఁ బొందుదనుకఁ
తే. బ్రాయు ముడిబోయి కసరెంకఁ బాఱియుండు, పంటిచాట్పున నెఱవేరుపడినయొడలి
పరుసుసెట్టన బీదచే పడినపగిదిఁ, గుఱుకుగుబ్బెతవయసెల్లఁ గొల్లలాడె. 211

సీ. ఉదయవేళకుమున్నె నిదురమేల్కొనివచ్చి ప్రాణవల్లభుపదాబ్జములవ్రాలు
వ్రాలి నిర్మలతరజ్వలనతప్తసువర్ణకలశోదకంబుల జలకమార్చు
జలకమార్చి సపర్వశర్వరీశాతపోత్తాలచేలంబులఁ బాల్పనిచ్చు
నిచ్చి పొచ్చములేక హేమపాత్రంబున నిష్టాన్నముల భుజియింపఁబెట్టుఁ
తే. బరిమళముఁ బూయుఁ గపురంబు సురటి విసరుఁ
బూవుదండలఁ జుట్టుఁ దాంబూల మిచ్చు
బడక సవరించుఁ జిటిపొటినడుగులొత్తు
నలముఁ గౌఁగిట నాతిచోరాతిభీతి. 212

ఉ. ఏరికినైనఁ జోరుఁడు సుహృత్తముఁడే యతఁడేలనేసెస
త్కారము సార్థవాహునకుఁ గన్గొన నిచ్చిరజీవితావకీ
నారికి ముఖ్యమంత్రియగు నైనను నీతిపరుండు గాన నే
తీరుననైన నిట్టిసుమతిప్రవరుం డశుభం బొనర్చునే. 213

క. అని దీప్తాక్షుఁడు చెప్పిన, విని యరిమర్దనుఁడు నీతివిభవవిలాసున్
వినుతాసువక్రనాసుం, గనుఁగొనుటయు నతఁడు కౌశికప్రభుమొగమై. 214

క. కంటకులు రిపులు దమలో, నొంటకపురిఁ బాసి యూరనొకఁడై వినుమి
ట్లొంటిఁ గృశియింపుచుండుట, గెంటనిశోభనముగాదె క్షితిపా నీకున్. 215

ఉ. ఈతఁడు మేఘవర్ణునకు నిష్టము గల్గినవాఁడు సత్క్రియా
న్వీతుఁడు రాజకార్యపరినిష్ఠితుఁ డీతఁడు లేమి లేమిను
మ్మాతని మార్జితైకవిజయస్థితి నీకితఁ డున్కిఁ జేసి వి
ఖ్యాతివిహీనతు శత్రుబలహైన్యము నీకు శుభంబు గాదొకో. 216

క. వైరులు రాయుట హితస, త్కారమునక యసువులిచ్చెఁ దస్కరుఁడు లఘు
క్షీరమహాగోద్వితయము, రారాపున గృహికి బ్రహ్మరాక్షసుఁ డిచ్చెన్. 217

క. ఆనవిని యరిమర్దనుఁ డా, నన మలరఁగ వక్రనాసునకు నిట్లను ది
గ్వినుత నయప్రథ యక్కథ, వినవేడుక యయ్యెఁ దెలుపవే నాకనుడున్. 218

వ. వక్రనాసుం డిట్లని చెప్పం దొడంగె. 219

చ. కృతవిదధీశ చెప్పెదఁ బరిగ్రహలబ్ధము భూరిదుగ్ధగో
ద్వితయము పోల్చ నొక్క జగతీసురు లోఁగిట దానివంచనా
మతి నొకటన్ హరించుటకు మందచరుం డనుతస్కరుం డళి
ప్రతినవకాలకూటరుచిబంధుర మైనయమాస చీఁకటిన్. 220

క. నెవ్వెఱుఁగక చనఁ గానల, చొప్పున నొక బ్రహ్మరాక్షసుం డరుగుచు నా
దెప్పరపుముప్పు నచ్చోఁ, దప్పక వీక్షించి యద్భుతధ్వనిఁ బలికెన్. 221

క. ఓరీ యిఱులూఱెడునీ, దారుణనిశి నెందుఁబోయెదవు చెప్పుమా దు
ర్వారత్వర ననుటయు నల, చోరకుఁ డా బ్రహ్మరాక్షసున కిట్లనియెన్. 222

క. జయసిద్ధి యనుధరామరు, నయనంబునఁ గలదు గోద్వయము దాని నతి
ప్రియతం గొని చనునాతఁడ, నయిపోయెద నొంటి నిమ్మహారాత్రమునన్. 223

ఉ. కందెనదాయచాయకొఱ కచ్చులమేళము లక్షగోళము
ల్గుందెనమారునోరువసిగొమ్మ్యలదండులుపండు లిట్టిరూ
పెందును జెప్పఁ జూపనరు దెవ్వఁడవీవని వేఁడినం దరా
స్కందికి బ్రహ్మరాక్షసుఁడు సత్యపురస్సరభాషనిట్లనున్. 224

క. ఈనిశ నిట నేవిప్రుని, ధేనువులం ద్రాలనీవు దివియుటకై చో
రా నేఁ డరిగెద వత నిన, తానకమునఁ జంపఁబోయెద న్బలాశిన్. 225

క. నావిని చోరకుఁ డంతం, బోవక యనునిన్నిశీథమునఁ గ్రోధమునన్
భూవిబుధుఁ జంపఁబోయెదొ, కో వాఁ డెటువంటి నేర మొనరించెనొకో. 226

క. కారణముఁ దెలుపుమన నల, చోరకునకు బ్రహ్మరాక్షసుం డను రజనీ
చారపలాయనమంత్రక, శారూఢుఁడు గాఁడె యరయ నవ్విప్రుండున్. 227

చ. జరఠకపిత్థరంధ్రములు సాలబిలంబు లగాధనింబకో
టరములు మజ్జిమానితొఱట ల్పెనురావిఁతొఱ్ఱలు న్మహా
నిరవధితింత్రిణీమహిజనిర్వ్యథవంబులు తొంగిచూడరా
దరసిన బ్రహ్మరాక్షసుల కద్ధరణీసురుచేతిరాయిడిన్. 228

క. మెఱమెఱసి యద్ధరామరుఁ, బఱిమార్పం బోవరాదు బ్రహ్మకునైనన్

మొఱఁగి నిదురించుచో నిది, తఱి యగుటం జంపఁబోయెదం బదవునుచున్. 229

వ. ఇరువురు చని యవ్విప్రగృహంబు ప్రవేశించి రందు బ్రహ్మరాక్షసుండు ప్రతి
రోధి కిట్లనియె. 230

క. తొలుదొలుత నరిగి విప్రుని, బొలుపారం జంపి కడపఁ బోయెద నాలోఁ
దలఁకక నీ వరిగి నిరా,కులవృత్తిం బసుల నాఁచికొనిపొమ్మొకటన్. 231

క. తీఱిదియని చెప్పినవిని, చోరకుఁ డా బ్రహ్మరాక్షసున కను నీద
ర్పారంభ మెఱిఁగిరేని మ, హారభసము పుట్టు నీగృహంబున నకటా. 232

క. ఈనెఱి నలికిడిపుట్టిన, ధేనువులను ముచ్చిలింపఁ దీఱునె నాపూఁ
పైనతరువాత దూరము, గా నరిగినమీఁదఁ జంపు కాదన విప్రున్. 233

ఉ. నావిని బ్రహ్మరాక్షసుఁడు నన్నిటులాడఁగ నెంతవాఁడ వీ
లేవడి నిన్ను వేఁడ నవులేకలిగెం దొలుదొల్త నిద్ధరా
దేవునిఁ జంపెదం గనలు దీఱఁగనం చడరంగ దొంగయుం
బోవను పోవు మం చతనిభూరితరధ్వని నడ్డగించినన్. 234

వ. అక్కలకలంబు విని బ్రాహ్మణుండు మేల్కనియె నప్పు డతనికి విశ్వాసంబుఁ బు
ట్టింపందలంచి. 235

క. మును బ్రహ్మరాక్షసుం డి,ట్లను ననఘా తావకీన మగుగోద్వయమున్
గొన నున్నత్రాసదీపితుఁ, డని చోరునిఁ జూపె నిజకరాంగుళికోటిన్. 236

క. చోరుండును బటురౌద్రా,కారుండై నినువధింపఁగా నదయుండై
చేరినక్రూరుం డితఁడని, యారాక్షసుఁ జూపె భూసురాధ్యక్షునకున్. 237

క. నేరముఁ దప్పించుకొనం, జోరుండును బ్రహ్మరాక్షసుండును దనతో
నీరూపునఁ జెప్పినముఖ,సారసరిపుమీఁద హాసచంద్రిక మెఱయన్. 238

క. ధరణీసురుఁ డిట్లను మీ,రిరువురు పరమాప్తు లనఘు లిందెవ్వరిపైఁ
గెరలెదను చనుఁడు గాఢ,త్వరఁ గ్రమ్మఱ మీరు మీనివాసంబులకున్. 239

క. దీవింపవలవ దవనీ,దేవత లామోదవనధిఁ దేలిన శాపం
బీవలవ దలఘుసంతో,షావిలచేతస్కు లమ్మహామహులయినన్. 240

వ. బ్రాహ్మణద్వేషంబులేక బ్రతుకుం డని వీడ్కొలిపినం బోయి రాచోర బ్రహ్మరాక్షస
వివాదంబు జయసిద్ధికింబోలె మేఘవర్ణ చిరజీవి సంవాదంబు నీకు నిస్తులకల్యా
ణంబుఁ జేయునని విన్నవించి వక్రనాసుండు వెండియు. 241

సీ. తనమేనికండలు దఱిగి డేఁగకు మేఁపి ఖగముఁ గావఁడె శిబిక్ష్మావరుండు
గరుడుని కాహారకబళమై నాగేంద్రవరుఁ బ్రోవఁడే మేఘవాహనుండు

నిజకళత్రద్రోహి నిర్దయాత్ముఁ గిరాతు మనుపఁడే నిర్ణిద్రమైత్రిపత్రి
శత్రుసోదరువిభీషణు సమిద్భీషణు రక్షింపఁడే తొల్లి రాఘవుండు
తే. సకలదిక్కామినీకుచస్తబకములకుఁ, దారహారకలాపమై తద్యశంబు
నేఁడు నాఁడును నున్నది నిత్య మగుచుఁ, గంటె శరణార్థి మనుచుటకంటె శుభము.

సీ. అని వక్రనాసుఁ డిట్లాడుమాటలు విని యందఱు వేర్వేర నడుగుబుద్ధి
నపుడు శివాభీతనృపతివికారకర్ణునిఁ జూచి తోఁచిన ట్లనఘ నీవు
పోలినతెఱఁగుఁ జెప్పవు గాక యనునంత నెడసొచ్చి రక్తాక్షుఁ డిట్టులనియె
నేకార్య మెఱుఁగును రిందఱు పలుగూఁత లఱచెద రవివేకి వగుటఁ జేసి
తే. మంత్రులకు నైజములు మృదుమధురఫణితు,లవి యథార్థీకరించి వాయసముఁ బెంచి
యేలచెడిపోయెదవు నేన నేలచెఱిచె, దహితు నిర్జింపు నాబుద్ధి నాదరింపు. 243

క. నేరము ప్రత్యక్షంబై, చేరువ నుండంగ సంతసిల్లి సజారన్
దార న్నాథూక్తుల రథ, కారుఁడు శిరసావహించుకథ యిదియయ్యెన్. 244

క. అనవిని యరిమర్దనుఁ డా, యన నాలోకించి యోనయార్ణవ యిది యె
ట్లనురాగంబునఁ జెపుమా, వినియెద నన నతఁ డులూకవిభునకు ననియెన్. 245

క. కేరళదేశంబున రథ, కారప్రమదామతల్లి గల దవ్వికచాం
భోరుహముఖి యువజారో, దారవృషంబులకు వల్లెత్రాడై మెఱయున్. 246

ఉ. జారులకొంగుపుత్తడి యసభ్యులచేరువపంట మన్మథ
ప్రేరితకోటి కేడుగడ పెన్నిధి గాముకజాతికిం బర
ద్వారులపట్టుగొమ్మ యుపవల్లభసంపదపాంథబృందమం
దారము పల్లవాంగణనిధానము దానివిలాస మారయన్. 247

ఉ. క్రొవ్వినచన్నుదోయికులుకు న్ననుబయ్యెదఁ దెల్పఁ జూచిన
న్రువ్వునఁ బర్వుచూపులదరు ల్చెదరం బటుపాంథమర్త్యముల్
ద్రవ్వ మెఱుంగుమేనిచెలువం బెడఁజేయక చూడఁ గోడెకాం
డ్రువ్విళులూఱ నూత్న మెఱయు న్రథకారవధూటి నీటునన్. 248

చ. మెఱుఁగులఁ గ్రుమ్మరించుకనుమించులు త్రొక్కనిచోట్లు ద్రొక్కఁ గ్రి
క్కిఱిసినగుబ్బచన్ను లెడయీక విరోధులజోక నొండొక
క్లోఱయ నితంబబింబమున నొక్కొకయించుక జాఱఁగట్టుఁగ
ట్టొఱపు ఘటింప నేగునలయుగ్మలి దూరపుటేటినీటికిన్. 249

శా. ఆవృత్తస్తని రూపలక్ష్మి కనువిందై యుండ నిర్గ్రాహమో
హావేశక్షుభితుండు గానినరుఁ డిష్టాహారసంచారని

ద్రావైముఖ్యము లేనివాఁడు గృహకాంతాకాంతసంతానచి
న్తావైరాగ్యవశుండు గానిజనుఁ డెన్నఁ డేఁడు లేఁ డొక్కఁడున్. 250

సీ. పలుమెఱుంగులు మోవిపై నటింపఁగఁ గేరి నవ్వు నొక్కొకసారి యవ్వనవ్వు
జారకర్ణ గ్లాని చేర నారజముగా బలుకు నొక్కొకసారి పచ్చిపలుకు
ముఖదృష్టియుపమర్మములు గ్రుచ్చి పారంగఁ జూచు నొక్కొకసారి చులుకఁజూపు
గిలుకుమెట్టెలఱంతు బెళుకుసంపాదింప నడుచు నొక్కొకసారి బెడఁగునడుపు

తే. పదనుగా జాజుచేసినపసిఁడిరేకు, పోల్కిఁ జూపట్టు దూతికపోఁతలము
తమ్మరస మంటఁగఱచుప్రాయంపుకలిమి, మురియు నొకసారి నడ్లంగి మోహనాంగి.

సీ. ఏతెంతువనియు పొక్కిడిపోయి మత్తాళిచూడ నాకట తొంగిచూడవయితి
చేసేఁత నప్పుడ యచ్చికబుచ్చికపుమాటలాడ నాతో మాటలాడవయితి
కమ్మోవిరుచులఁ జొక్కించి తింతియుముద్దుగుమ్మగుబ్బలఱొమ్ము గుమ్మనయితి
నను నేకతమువ రమ్మని యొప్పి రప్పించి తెఱవ యేటికిఁ దల్పుఁ దెఱవవయితి

తే. నీవుఁ జరణానతుఁడ నైతి నేత్రజితచ, కోరనన్నిచ్చలో నేఁటికోరవయితి
వందు రాత్రప్రపంచకు లైనజారు, లెదురుతాఁకైన నవ్వాడవది నెఁగూర్చి. 252

తే. పరుషటంకకుఠారసంభరణకరణ, జనితతాపరసక్లాంతశాంతకాంత
హస్తములఁ దేర్చునొక్కొక్క యవసరమున, శైత్యభైషజ్యమున దానిచన్నుదోయి.

క. కైసేసిబిడ్డపాపల,తో సందడిలేమి నొడలు దొడలుం బిఱుఁదిం
తేనికుచంబులు మెఱయం,గా సుందరి పోతబొమ్మగతిఁ జూపట్టున్. 254

క. చెలిచెలువు తెరువుగొసయం, బలె నానాపథికభోగపాత్రంబై వ
ర్తిలుచుండ దానిచెడుపో,కలు దెలిసెం బతికిఁ గొంత కాలంబునకున్. 255

క. తెలిసి యొకనాఁడు వాఁడా, లలనాతిలకంబు తలతలం బట్టుకొనన్
వలయునని తలఁచి వెంగలి, కలికిం బరికించి నిర్వికారతఁ బలికెన్. 256

. ఏలినయీకేరళీవర,పాలుఁడు నా కానతిచ్చెఁ బయనము చాలన్
గాలవిళంబన మోమహి, శాలీలం దెమ్ము సంబళముఁ గంబళమున్. 257

క. వేఱూరికిఁ జని యిట కై, దాఱుదినంబులకు వత్తు నద్దివసము లా
ఱ్ఱాఱునుమీ నీసంగతి, జాఱుట నాకనినయోష సంతోషమునన్. 258

సీ. చివురువాతెర యచ్చుసేయుఁబో వేఱూరి యొసపరిగానిపల్లొత్తుకెంపు
తమిగుబ్బచంటిపాళెముడిగ్గుఁబో వింతగుమ్మచిమ్మటప్రేలిగోరి తాఁకు
మోముదామరతావి ముదమందుఁబో క్రొత్తబొజుఁగుకస్తురిచుక్కబొట్టుతేఁటి
చిన్నారిమేనవాసించుఁబో పొఱుగింటికలికిచుట్టము ఱొమ్ముకమ్మపూఁత

తే. తనచొకాటపుఁజెక్కుటద్దములఁ బ్రతిఫలింపఁబో మాఱుమగనిక్రొమ్మించుమోపు
ప్రాఁతపోరాటమెుండుఁ బఱచెననుచుఁ బొంగె లావణ్యసీమ వక్షంగితేమ. 259

క. తలపేనుపంటిసందిది, పులుకాలనుముల్లు వస్త్రమున యూకకటి
స్థలితిఁటపాదరక్షన్, శిలవోలెం బ్రాఁతమగఁడు చేసెన్వరికిన్. 260

ఆ. నెరసుతోడఁబోలె నేత్రంబు దుర్భర, వ్యాధితోడఁ బాసి యంగకంబు
కాంతి నుల్లసిల్లుగతి వీనిఁబాసి యి,చ్ఛానురూపవృత్తి నగుదు నేను. 261

క. అనిమూఁపులు మూఁడై లా,లవరథకారునకు సంబళము గంబళ మి
చ్చి నిలిచి కుహనార్తి గడ,ల్కొన నప్పుడనిలిచి పేరుకొని పతికనియెన్. 262

ఉ. నిక్కవ మారికేగెదవె నీకు దయారహితాత్ముఁడైనరా
జెక్కడఁగల్గె నిన్ను నొకయించుకనే పెడఁబాసి యుండలే
నిక్కడ నేను మీపిఱుఁద నిప్పుడవచ్చెదఁ దోడుకొంచుఁబొ
మ్మక్కఱదీఱ నాహృదయ మక్కట నీవశమాయెఱుంగవే. 263

క. నిమిషము దివసంబై దివ,సము నెలయై మాసకంబు సంవత్సరమై
సమయుగమై చింతించెద, రమణా భవదీయయోగరాహిత్యమునన్. 264

ఉ. ఈచెలు వీకళావిభవ మీగుణ మీకమనీయవిగ్రహం
బీచతురత్వ మీగరిమ మేమగవారికి లేదు చూచితిం
జూచితిఁ బ్రాణనాథ నినుఁ జూచినకన్నుల కాలతాంతనా
రాచుఁడుఁ బట్టఁడీవు మృగరాజవు రాజవు నిక్క మింతయున్. 265

ఉ. కేవలసాధనంబు లిరుగేల వహించి నటించునమ్మహా
భావజునట్లు యుక్కటులిబాడిసయుం గొని నీవు మామకీ
నావసథంబున న్మెలఁగ నచ్చెరచాడ్పునఁ గన్నులార్ప కిం
పావహిలంగఁ జూతు దరహాసపరిస్ఫురితాననాబ్జనై. 266

క. విడిఁగలమాణిక్యము పు, త్తడితోడం గూర్చినట్లు తనతో నిమసాం
ఘటరం గూర్చినబ్రహ్మకుఁ, దడయక చేమొత్తి మ్రొక్కెదనె ప్రాణేశా. 267

క. తడసినఁ జత్తు న్వడి ని,క్కడి కేతెమ్మనుచు ముచ్చ గన్నీరొలుకన్
బుడిబుడియేడ్పులతో న;వ్వెడమాయలప్రోవు మగనివీడ్కొల్పటయున్. 268

ఉ వంచనఁజేసి వాఁడు తలవాకిలి వెల్వడి పోయిపోయి య
స్తాచలకుంజకోటరమునం దినుఁ డేగినఁ డక్కబెట్టి యా
ముంచినచీకటి న్మసలి ముచ్చవలెం జొరఁబాఱి యింటిలో
మంచముక్రిందఁ దూఱుకొని మానముఁ గైకొనియుండె నంతటన్. 269

ఆ. జలములాడి మేనఁ గలపంబు నలఁది యచ్చెలువ చలువ వలిపెచీరఁ గట్టి
ముడిచి కుడిచి లేచి విడియంబు సేయుచు, మొదలియామమయిన యదను నెఱింగి.

ఉ. ఆ తెలిగంటిగంటి నెరసైనవిభుం డరిగె న్నిరంకుశ
ప్రీతి రమింపవచ్చు నిటఁ బిల్వుము నీవని తెల్పిన దూతి యా
ఱేతిరిఁ బోయి చీరనగరి ప్రతిరథ్యముసుం గొనర్చి సం
జాతకుతూహలుం డగుచు జారుఁడు తత్సదనంబుఁ జేరఁగన్. 271

ఆ. కోల్లుమూ యదుద్దుగొంగడిఁ బఱచిన, మంచమునకుఁ గ్రొత్తమగనిఁ గొనుచు
కులుకునడల నరిగి కూర్చుండె దాని క్రిం, దింటిమగఁడు డాఁగు టెఱుఁగలేక. 272

చ. ప్రవిఘటితానురూపదృఢబంధ మసుంధర మోదకృద్గళా
రవము కటీకపోలముకురస్తనదృష్టనఖక్షతంబు కై
తవపరిహాసభాషితమతాంతచపేటము పాస్తలజ్జము
ప్రవసుపగూహ ముల్లసిలె సంగమ మిద్దఱకు న్నిరంధ్యమై. 273

క. సాధీయఃకృతధారా, సాధారణకరశిఖరనిశాతనఖంబుల్
సాధింపఁగ రతినాథా, యోధనసాధనములయ్యె యువయువతులకున్. 274

క. ఆసతి యుపపతియును నిజ, వసతిం జెలరేఁగి యట్లవారణగాఢో
ల్లసనమునఁ బెనఁగ దుసికిలి, వెస నచ్చెలికాలు మగని వెన్నొఱయుటయున్. 275

క. దిటచెడక యద్ధరిత్రి, కటిమదిలో నిశ్చయించెఁ గనలున నీచేఁ
కటి నెక్కుటి నిక్కుడికం, కటి క్రిందిటువచ్చె గట్టిగా మగఁ డనుచున్. 276

క. రతితృప్తిఁ బొంది యయ్యుప, పతి నాతిం జూచి పలికెఁ బద్మముఖీ నీ
పతిరతిలో నారతిలో, మతిఁ దలఁపఁగ నీకు బ్రియతమం బెయ్యదొకో. 277

క. నోరార్పక నిక్కము జెపు, మా రామా ప్రేమ ననిన నది వానిదెసన్
గూరిమిఁ గలిగియు నలరథ, కారమనోరంజకంబుగా నిట్లనియెన్. 278

మ. *పతికందర్పరహస్యకేళికిఁ దలంప న్నాక్షరోచ్చారణ
స్థితి ముంగొంగుపసిండిగాదె యది నాతిం బ్రీతిఁ దేలింపఁగా
రతివారాగతుఁడై విరక్తిఁ దొఱఁగంగాఁ జేరుజారుండు నీ
సతమే చెప్పను వానితోడి రతి నిస్సారంబు రాజాస్యకున్. 279

క. ఇదియేటిమాట యేలా, వదరెదు నిను నీవెఱుంగవా నారమణుం
డుదధిచిఱుపడియ వీవ, ల్లది నే ననకున్నఁ దెలియుదా నీమదికిన్. 280

క. రోఁతనినువంటిమానిని, క్రోఁతికి నామగనిఁ బేరుకొనఁ జక్కఁదకున్

---

* ప్రతిప్రాణేశరహస్యకేళికి నని పాఠాంతరము,

జేతికిఁ గలవాసి సుమీ, కాతాళముగాదు నీకు ఘనుఁ డాతనికిన్. 281

ఉ. ఒండనఁ నేల నామగనియొద్ద రమించుట యింద్రభోగమై
యుండునయో యనుంగువిభుఁ డూరికిఁ బోవు టెఱింగి యొంటి ని
ట్లుండఁగ వచ్చి పట్టికొని యోరిదురాత్మక సిగ్గుగొంటి పి
పెండయుఁబోలె వేఁడి ఘటియింపదె నాకిటువంటికూరిమిన్. 282

ఉ. రాచపను ల్వహించి వలరాచకుమారునివంటిదేవుఁ డ
య్యో చని కాళ్ళతో నరిగె నూరికి నెప్పుడు వచ్చువాఁడు తే
తే చవిగావు కండ్లు వెకలింపుచు నున్నవి ప్రాణవల్లభుం
జూచినదాఁక యెట్లునిలుచుం దను వెట్లు సహించియుండుదున్. 283

శా. కాయం బెక్కడనుండెనేమి వనితాకందర్పుఁ బ్రాణేశ్వరుం
బాయంజాలవు ప్రాణము ల్మనసురుబ్బాబూళ్ళుగాఁ జేయుటన్
డాయ న్వచ్చెఁగదా పయోధరము లంటం గౌఁగిటం జేర్చి యా
చాయం బైకొని చెక్కునొక్కు రతిరాజ్యశ్రీలఁ దేలింపుదున్. 284

చ. అగునగు బైసిమాలిచితినంచు విజృంభణవృత్తి నివ్విధి
న్నొగయనిమాటలం జెవులు నూఁడను సైఁచినదానఁ గాను నా
మగనికి నిన్నువంటికొఱమాలినమానుసులీడె *భర్తతోఁ
దెగి యెడద్రవ్వకం బ్రదికితే మని యైదువనై సుఖించెదన్. 285

చ. అనుతనుమధ్యభాషితము లారథకారుఁడు సాదరంబుగా
విని యిది నాయెడం బ్రణయవిశ్రుతయా నటుగాకయుండినన్
నను ననుకూలుఁడంచు నుపనాథునితోడ శఠౌననంబుల
న్వినుతి యొనర్చునే పరిభవింపక చంపక కాతు మెచ్చితిన్. 28[illegible]

ఉ. ఏను బ్రవాసినై యెఱిఁగి యింతట నంతట నాకుమాఱువ
ర్లని దెఱింగి కన్గొని చలింపక వీఁడిలుసొచ్చి యుద్ధతుం
డై నిలుపోవలేక కదియంబడెఁ గూఁతలు రోఁతలంము ల
జ్ఞానిధిగాన మెత్తఁబడి సాధ్వి రతిస్థితి నూరకుండెడున్. 287

ఉ. చిక్కితి వీనిచేత రొదసేయుట సిగ్గులచేటు పొందులం
జొక్కక వేగ నిల్వెడలఁ జూడఁడు మచ్చటఁ దీర్చుకున్న నేఁ
డుక్కున నేమిసేయునో భయోదయ మయ్యెడునంచు నోడి యా
చక్కరముద్దుగుమ్మ సరసప్రియభాషల నింపొనర్చెడున్. 288

* భర్తతం దెగి యెడద్రెవ్వనం బ్రదుకఁజే యని పాఠాంతరము.

క. అతివా నారతిలో నీ, పతిరతిలో నిష్ట మెద్దిపలుకం దగునం
చితఁ దడిగిన హితరూపా, న్వితుఁడని నన్నబల పొగడె వినిం దెగడెన్. 289

ఉ. వంచన యిప్పు డీతులునవంకజనించె జనించుఁగాక యీ
చంచలనేత్ర నాయెడఁ బ్రసన్నమనోరథ దీనిమాటలన్
గాంచితి మోదమంచు రథకారుఁడు వేగ సజారదారతో
మంచము నెత్తికెత్తుకొని మంజుగతిం జని వాడవాడకున్. 290

ఉ. వాకొని యెంతశాంత యెటువంటిపతివ్రత యెంతయుత్తమ
శ్లోకవివేకరాశి యనుచుం బ్రియు నెన్నుచు హస్తతాళమా
నైకలఘుప్రచారగతి నాడెఁ బ్రహాసవిలాసవక్త్రులై
మూఁకలుగట్టి నాగరికముఖ్యులఁ దన్బరికించి నవ్వగన్. 291

వ. ఇచ్చరిత్రంబు సాపరాధుం డగుచిరంజీవిం జేపట్టిన నీ కుదాహరణం బగు నని రక్తాక్షుండు చెప్పిన నప్పలుకు లాదరింపక నులూకేశ్వరుం డూరకుండె నంత నయ్యభిప్రాయ మారసి. 292

క. తనను నులూకత్రాసము, మనుగడ కుపహతి యునబహుమానత్వము లే
దని తెలిసి తెలివిఁ గలయా, వనమునఁ జిరజీవి ఘూకనాథుని కనియెన్. 293

. నీరిపుచే నూరక యవ, ధీరణఁ గాంచితి జగద్విదితమతి నయ్యున్
గ్రూరాగ్ని కాహుతిగ దను, ధారణ మీఁకజాలు వేల్చెదం బ్రాణంబుల్. 294

. నావిని రక్తాక్షుఁడు చిర, జీవిం బరికించి చచ్చి చేసెడుపనియే
మీవివరపుట్టఁ జెపుమా, నీవనుటయు నాతఁ డాతనికి నిట్లనియెన్. 295

. ఈకాయ మనలముఖమునఁ, బోకార్చి యులూకయోనిఁ బుట్టి బలిమిమైఁ
గాకముల గర్వరేఖా, స్తోకములం ద్రుంతు మనసుతుందుడుకారన్. 296

అనిన విని రక్తాక్షుండు. 297

లోకదృశుఘనసమీరమ, హాకుధరంబులవరింతు నని కాదాపూ
ర్వాకృతికి వచ్చె నొక్కతె, కాకికి నీకేల కౌశికత్వము గల్గున్. 298

అనురక్తాక్షునిఁ గనుఁగొని, ఘనుఁ డచ్చిరజీవి వలికె గాఢప్రజ్ఞా
ధన వినఁగోరితి నిక్కథ, యనురక్తిం జెప్పుమనిన నతఁ డిట్లనియెన్. 299

. కైటభాహితపదాంగదమాత్తికిచ్ఛాయ విధికమండలుసమన్వితమరాళి
మారారిమకుటమందారమాలికవియత్కృష్ణధేనుక్షరత్క్షీరధార
సాధుజీవంజీవచంద్రికసగరజస్ఫాటికస్వర్గసోపానపంక్తి
చిరతపోవిత్తసంచితభగీరథకీర్తి వారాశిహృదయకర్పూరచర్చ

తే. పరుషహాసిత్వశాపసం ప్రాప్యమాణ, మిత్రసహపుత్ర గీర్వాణశత్రువేష
సముదితక్లాంతివ్యాతిసమ్యగమృతవృష్టి, గంగ పొగడంగ నెగడు శంగ తరంగ 300
సీ. తజ్జలంబుల నొక్కతపసి యాస్వాదింప శయపుటంబల్లనఁ జాఁపుపోటఁ
దటకుటానిలనటద్విటపకాండనిషణ్ణ ఘనగృధ్రచంచునిర్దళిత యగుచు
మూషికపడియె నమ్ముని దానినిజతపోమహిమ నొక్క మనోజ్ఞమహిళఁ జేసి
కన్నకూఁతునకంటెఁ గడుగారవంబునఁ బోషింప నొకకొన్నిపూఁటలకును
ఆ. గుఱులుగూడెమేను మెఱుఁగెక్కెఁ బాలిండ్లు, బయలు మెఱసెఁ బిఱుఁదు బలిసె నడలు
ముతిప మెటిఁగె సిగ్గు మోమున నివుఁ రొత్తెఁ, దోయజాస్య కలరుఁ బ్రాయమైన.
క. కలితరుచిమించునించున; ఫలముంబలె నూఁగునూఁగుఁబ్రాయము చెలిపై
నిలువం గని ముని మనువీ, ఎలెవని తలపోసె నధికవాత్సల్యమునన్. 302
క. ప్రతినూతనర్తువేళా, న్వితరెమ్వ్వతె యవ్వధూటి వృషలి యగు న
త్పతిపాణిగ్రహణముఁగా, మతిఁ దలఁపరు సుమతుల నభిమతమై యునికిన్. 303
వ. ఇంతపమున్న వివాహంబు సేయలేనైతి నిచ్చిపుచ్చుకొనువారికిఁ గులధనాది గౌర
వంబులు సదృశంబులునయిన ననురాగంబు పెరుగు రూపయౌవనాదులు పరస్పరాను
రూపంబు లయియుండిన సతిపతులకుఁ బ్రేమాంకురంబులు వృద్ధిఁబొందుఁ గావున
నివ్వనజగంధి మహానుభావుండగు సూర్యదేవునకుం బరిణయంబు సేసెద నని య
మ్ముని తీవ్రధాము నాకర్షించి. 304
సీ. తనునోరఁ బేరుగ్రుచ్చినవారి కారోగ్య మిచ్చువాఁ డఘములవ్రచ్చువాఁడు
పరరాజసంబాధ విరియుచక్రముల రక్షించువాఁ డిఱులశిక్షించువాఁడు
వేదాంతశుద్ధాంతవీధుల నోలగంబుండువాఁ డాపద ల్చెండువాఁడు
దుష్టమందేహ సందోహంబు నెలగోలు తరమువాఁడు మురారి తిరమువాఁడు
తే. సంప్రదోషవచష్టిస్తతి జలదరించు, ననిజనులకు దృష్టిపాటవము నిచ్చి
మించువాఁ డెల్లదిశల దీపించువాఁడు, సారసాప్తుండు మునికి సాక్షాత్కరించె.
చ. ముని యలతీవ్రధాముని సముజ్జ్వలధామునిఁ బూజసేసి యి
ట్లను దిననాథ యిక్కసలయాధళ పెంపుడుబిడ్డ నాకు నీ
కెన సుముహూర్తవేళ పరియింపుము నీకిదె యిత్తునన్న న
వ్వనరుహబాంధవుండు శ్రుతవంతుఁ బ్రశాంతునిఁ జూచి యిట్లనున్. 306
తే. అనఘ నాకన్నఁ బర్జన్యుఁ డధికుఁ డభ్ర, సంచయంబున నను నిరోధించుఁ గాన
నమ్మహాత్మున కీకన్య నఖిలమాన్యుఁ, బరిణయము సేయు మదినీకుఁ బరమశుభము.
క. అనిచెప్పి తపనుఁ డరిగిన, ననఘుం బర్జన్యు నంత నాకర్షింపన్
జనుదెంచి నిలిచె నతఁ డమ్ముని యవ్వేల్పునకు నెయ్యమున నిట్లనియెన్. 308

క. కన్య న్భవనత్రయమున, న్మాన్య వనన్య న్వరింపుమా యిచ్చితి నీ
ధన్యత్వ మమర ననఁ బర్జన్యుం డిట్లనియె మౌనిజనమాన్యునకున్. 3

క. మరుదభిహతిదూరీక్రియం, దరలుదు నాకన్న ఘనుఁ డతం డాయన కి
త్తరశాఖి నిచ్చి సంయమి, వర పెండ్లి యొనర్చు మనుచు వాఁడుం బోయెన్.

క. పవమానుఁ గ్రోధహతశై, పవమానుఁ దలంపఁ దపసిపాలికి నతఁ డా
ర్జవజవము లమరవచ్చిన, వివిధాతిథ్యముల గారవింపుమఁ బలికెన్. 3

చ. ఉచితసభాయితాఖిలపురోపవనాపవనాసురాసుర
ప్రచయములందు నీసవతు రాఁ డొకఁ డిష్టజనప్రసన్నతా
రుచుల నతౌ కెఱింగి గుణరూపవయోనయధన్యఁ గన్య నీ
కచలమనీష నిచ్చెద సదాదృతిఁ గమ్ము వివాహ మీవనన్. 3

చ. నరులు సుర ల్భవాదృశులు నన్ను మహాబలుఁ డండ్రు సత్కృశా
పరపరమేష్ఠిశైలము లపారబలంబులు నే నెఱుంగుదుం
బరు లనకున్న నేమి కనుపట్టిన పట్టిధరాధిభర్త కా
దరమున నిత్తుఁగాకని సదాగతి సెప్పి యథేచ్ఛ నేగినన్. 3

క. ధరములఁ దటఘటితపయో, ధరముల సంగీతముఖరదైవతవిద్యా
ధరముల శ్రీగరుడసుధా, ధరములఁ దలఁచుటయుఁ బర్వతము లేతెంచెన్. 3

క. ముని యద్ధరణీధరములఁ, గనుఁగొని యిట్లనియె నాత్మకన్య ననన్యన్
జనలోకమాన్య నిచ్చెద, గొనకొని యొండొకఁడు పుచ్చుకొనుఁ డింపెసఁగన్.

చ. అతిశుభలగ్న మీసమయ మన్న నమస్కృతు లాచరించి ప
ర్వతములు పల్కె నేఁ డబలవంతులమందుర పాదజర్జరీ
కృతులము మమ్ము లెక్కఁగొన వెల్కలు వానికి నిమ్ము నిర్మల
వ్రతభవదీయప్రీతి కనివారణ లేకని చెప్పినపోయినన్. 3

క. ఎలుకలఁ బిలిచి మహాముని, కులవల్లభుఁ డనియె నిత్తుఁ గూఁతు న్మోదం
బొలయ వరియింపుఁ డొకఁడని, పలికిన నవి కరము వెఱఁగుపడి యిట్లనియెన్.

క. ఎలుకలకు మనుజసతులకుఁ, గలయిక లెట్లనిన మౌని కమనీయతపో
బలమునఁ గ్రమ్మఱఁ గూఁతురు, నెలుకంగాఁ జేసి యొకటికిచ్చెం బుచ్చెన్. 3

వ. అట్లగుటఁ గాకి యగునీకు ఘూకజన్మ మెట్లుగల్గునని కేరడం బాడి యధిక్షేపిం
రక్తాక్షుని వారించి యరిమర్దనుండు ప్రసాదపురస్సరదృష్టిఁ జిరజీవి నాలోకిం

ఉ. క్రూరతరావలోకములు ఘూకము లాదృతి నీకు నీప్సితా
హారము లిచ్చు నిర్భయుఁడవై ధరణీరుహదుర్గకోటరా

గారవములం జరింపుచు సుఖస్థితి నుండు కొంతలేక యో
భూరివివేక యంచుఁ గడిపోవనిభక్తి బహూకరించినన్. 320

వ. కృతకృత్యుండ నయితినని ధైర్యవిజితనీహారాచలానర్గళప్రచారంబున దుర్గబాహ్యా
భ్యంతరంబులం బ్రవర్తించి యన్నియుం గనుంగొని శరీరవర్ధనపర్యంతంబు చింత
దొరలకుండ ఘూకంబులం గలసి మెలసి పక్షంబులు వ్యవహారదక్షంబు లగుటయు
నొక్కనాఁ డెడఁబు వేచి యులూకమూలోత్పాటనంబునకుఁ బృథ్వీరుహదుర్గకోట
రద్వారంబుల నీరంబులుగాఁ బూరిఁగూరి నీరసేంధనంబులు దుఱిఁగి కరీషపిండఖం
డంబులు గ్రుక్కి యక్కడ నిలువక మేఘవర్ణుఁ గానంబోయి యవ్వాయసపతిచేత
సంభావితుండై యప్పు డుపస్థితంబైనకార్యంబు విన్నవించి చిరజీవి యిట్లను నీవు
ను నిన్నుం గొలుచువారును నీరసతరుశాఖలను గొఱవులను బట్టుకొనిరండు వైరిసం
హారసమయం బిదియని తెలుపుటయు. 321

క. ఎరవలిపట్టినకొండల, కురువడిఁ జని కాకిమూఁక లొక్కటఁ గొరవుల్
పరవరవలైనపిడకలు, తరిగైకొనిపోయి ధీరతం దరికొల్పన్. 322

మ. తగ నత్యుద్ధతి మించువాయువులచేత న్రాఁజితోద్ధూతనక్రొం
బొగలై కీలలు పర్వి నిక్కఁ జిఱునిప్పు ల్రాచి యుక్కుమ్మడిన్
గగనం బంటి ఘనస్ఫులింగములు నాల్కల్గ్రోయునచ్చిమ్మనం
బగిలెం బ్రేలిపడెం దివాంధకులము ల్భస్మంబులయ్యెం దుదిన్. 323

క. ఈవిధమున నిశ్శేషము, గా వైరుల సంహరించి కౌతూహలసం
భావితుఁడై యప్పుడు చిర, జీవికి వలకాకరాజశేఖరుఁ డనియెన్. 324

క. పగవానిగృహము మృత్యువు, మొగమచ్చో సన్నిదివసములు గట్టా యే
పగిది జరించితి వీవని, నగచినఁ జిరజీవి మేఘవర్ణుని కనియెన్. 325

చ. అడఁకువఁ గార్యకాంక్షి యగునాతఁడు దేజము డాఁచి దుస్థితు
ల్గుడుచుచు నీచుఁ గొల్చి తిరుగుం దివిషజ్జయులై ధరిత్రిఁ బే
ర్పడినసహోదరుల్ దనకుఁ బ్రాపుగ నుండియుఁ బుణ్యగాథలం
గడపఁడె మత్స్యరాజుసముఖంబున ధర్మసుతుండు కాలమున్. 326

ఉ. పౌరుషము న్మహాబలముఁ బండితభావముఁ గల్గినట్టియా
ధీరుఁడు కార్యవాహనిరతిం బరుఁగొల్చు మహానసాగ్నిధూ
మారుణతాత్ములు న్మలినమైనపటంబు మహావిభూషితా
కారము దర్వియు న్మెఱయఁగా వలభీముఁడు మాత్స్యుఁ గొల్వఁడే. 327

ఉ. పౌరుష ముజ్జగించి నగుబాటున కోర్చి సాధుగర్హితా

కారతఁ గాలకాంక్ష పొసఁగ న్నిజకార్య మొనర్పఁగాంచిన
జ్యారవదేవదత్తరభసక్షుభితాష్టహరిత్కరిశ్రుతి
ద్వారుఁడు గ్రీడి మత్స్యపురి నాఁడు బృహన్నలయై నటింపఁడే.

చ. ఒకదెసఁ గార్యదాహమున నుండక యేరికినైనఁ దీఱ దం
తకనిభసత్త్వుఁ డాదరణధామకటాక్షుఁ డఖండవిక్రమా
ధికుఁడు విలాసవిశ్రమణదేశము మాద్రికిఁ దొల్తపుత్త్రుఁ డా
నకులుఁడు మత్స్యరాజభవనంబున సాహిణియై చరింపఁడే.

చ. భుజబలశాలి నీతిపరిపూర్ణుఁడు రూపవిలాసవారిజ
ధ్వజుఁడు హరిజ్జయాభిముఖదర్పుఁ డతిప్రియభాషుఁ డాశ్రిత
ద్విజనిధి కార్యదాహనిరతి న్నిజవేషముఁ గప్పిపుచ్చి గో
వ్రజములఁ గాచువాఁడయి విరాటుపురి న్సహదేవుఁ డుండఁడే.

ఉ. కాలము దాఁట నెవ్వరిలఁ గాల్గలవారలు వారిరాశికీ
లాలపరీతభూతవిపులావ్నపరాజముఖీశిరస్స్థ
స్థాలఘురత్నభానునికపాతిసమున్మిషదంఘ్రిపద్మ పాం
చాలతనూజ తొత్తుపని సల్పదె దైవగతి న్సుదేష్ణకున్.

వ. అని చెప్పి బాష్పనిష్పీడితాక్షుండై వాయసాధ్యక్షుండు చిరజీవి నాలోకించి.

క. పరదేశ మఖిలసుఖా, కరము మదీయోపదేశగమ్యుఁడవై కా
ర్యరభసము కోర్చి రిపుమం, దిరమున నెబ్భంగి నుండితివి చిరజీవీ.

క. ఘూకములు దెగడ ఘూక, క్ష్మాకాంతుఁడు గౌరవంబు సలుపఁగ బ్రతిప
క్షౌకమున నుంటి విద్దశ, నాకతమున నీకుఁ గలిగెనా చిరజీవీ.

సీ. అని విన్నవయిన వాయసరాజు నీక్షించి యచ్చిరజీవి యిట్లనియె మత్తి
తరువున నీయాజ్ఞఁ దలమోచి యేనుండుతఱి మదాంధదివాంధతతులు వచ్చి
కెలఁకుల వీక్షించి మీపాలకుల లేకున్న తెరలివచ్చిన త్రోవ మరలి చనఁగ
నున్నకన్నెఱిఁగి నేనొకశబ్ద మొనరించి క్రమ్మఱించితిఁ గార్యకరణబుద్ధి

ఆ. నప్పుడు వికృతమూర్తినైయున్న న న్నులూ, కములు గాంచి యెఱుఁగుఁగాన దో
నింపుకలిమి సంహరింపక నొంపక, నాదరమున భర్త కప్పగించె.

వ. అప్పుడు ఘూకవల్లభుండు నన్నుం జూచి నీ వెవ్వండవని యడిగిన మేఘ
నకు ముఖ్యదండనాథుండ నగు చిరజీవి నని చెప్పితి నప్పలుకులు విని మంత్రు
వించి మంత్రకూటంబున నన్నుం జూపి యితని కుచితం బగుకార్యం బొకరొ
చెప్పుండనిన నందు రక్తాక్షుండనువాఁ డొక్కరుండు దక్కఁ దక్కినవారం
దాపక్షంబ పలికిరి రాజును వారివాక్యంబు లంగీకరించి నీతివిదుండగు రక్తా

దెస నాదరణంబు సేయండయ్యెఁ గాలపక్వంబును నట్టిద. 336

క. జనియింపం గలకౌర్యము, మనమున దగ నిశ్చయించి మంత్రి సునీతిన్
వినిపించిన వినవొల్లని, చెనఁటికి ముకుఁజంటిగాదె చేటుంబాటున్. 337

తే. గగనమంటిన దోషాగ్ని గాఢశాంతి, నీరమున శీతలముసేయ నేర్చుమంత్రి
చిరహితారంభపరుఁ డైనసేవకుండుఁ, గార్యనిర్వాహకులు నూవె కరటముఖ్యా.

క. తానెంత కార్యపారగుఁ, డైనఁ రహస్యమున మంత్రి నడుగక ధరణీ
జానికి నేకార్యంబుం, బూనందగ దుద్ధతప్రభుత్వప్రజ్ఞన్. 339

ఉ. ముప్పదిమూఁడుగోటుల సుమూర్తులవేల్పుల నేలువజ్రియు
ప్పప్ప మవార్యశౌర్యకరుణాదులపట్టున నించుకేనియున్
జెప్పనివాఁడె యట్టినయశాలి బృహస్పతిగోపనంబునం
జెప్పినపంపుసేయక విశృంఖలవృత్తిఁ జరింప నేర్చునే. 340

క. కావున శక్తాత్ముఁడు నయ, కోవిదుఁ డమ్మంత్రిమాట గురుమంత్రముగా
భావింపలేక కోటఁడు, పావకకీలాళిఁ గాలి భస్మంబయ్యెన్. 341

చ. అరయఁగ దుష్టమంత్రినివహం బనువారము గల్గియుండ నే
పురుషు ననీతిదోషములు పొందవు రోగములే యపథ్యబం
ధురుఁ గలఁగింప వేజనునిఁ ద్రుంపదు మృత్యువు లక్ష్మియెవ్వనిన్
జిరపుదగర్వదర్పితునిఁ జేయదు పైకొనవేరి నాపదల్. 342

వ. లోభికిఁ గీర్తియు ఖలునకు మైత్రియు నష్టక్రియునకుఁ గులంబును ధనార్జనతత్పరు
నకు ధర్మంబును నలసునకు విద్యయు గృపణునకు సౌఖ్యంబును బ్రమత్తసచివుం
డగు జగతీపతికి రాజ్యంబును లేదు వెండియు నీరసేంధనంబుల నహ్నియు మూర్ఖు
లందు శోకంబును జపలచిత్తులయందు గోపంబును గాంతలందు విత్తంబును
దయావంతులందు ధర్మంబును మహాత్ములయందు ధైర్యంబును వృద్ధిఁబొందు నది
యట్లుండె. 343

క. ఫలనగునంతకు బగతుం, దలనిడుకొని తిరుగునీతితత్త్వజ్ఞుఁడు మున్
జిలువయొకం డట్టిదయై, మలుగందినదే యనేకమండూకములన్. 344

క. అనినవిని మేఘవర్ణుం, డనురాగరసాబ్ధి నోలలాడుచు విద్యా
ఖనికా యొట్టిదకథ చెపు, మను డచ్చిరజీవి వాయసాగ్రణి కనియెన్. 345

సీ. విను పూర్వమున మందవిదుఁ డనుకాలాహి యాహారకాంక్ష నహర్ముఖమున
బఱచి యొండొకచోట బహుభేకకలకల ప్రతిభిన్నసకలదిగ్భాగమైన
హ్రదము గన్గొని లోనికరుగ నెద్దిక్కున దెరువు గానక తీరధరణి నిల్చి
కుంభిని ఫణమూదికొని డిల్లచెడినట్లు పరవశుగతి దుర్ఘృపగిదినుండఁ

తే. బలికె మండూకపతి యహోఫణివతంస, ప్రాణములు లోచనంబుల బఱలపఱచి
యొఱచి యొల్లక యిట్లుండ నేలనేల, చింతలేమిటికేని భక్షింపరాదె. 34

క. తలద్రిప్పక మ్రింగుచు కే,వలము మహాబలునియంతవాని నయోనీ
కలఁతంబడ నేకార్యము, గలిగెనొకో యన్నఁ బన్నగం బిట్లనియెన్. 34

తే. ఓదయానిధి దైవోపపాదితుండ, నైననాకేల దొరకునాహార ముఱక
నొరులు వెట్టినదనుక బస్తుండవలయుఁ, దనకు నావుడు మఱియు నద్దర్దురంబు. 34

క. అనిలాశనవల్లభచె,ప్ప నహో చిత్రంబు పస్తు పారణ లుండన్
వనరం గారణమున్నను, వినియెద జెపుమనిన మందవిదుఁ డిట్లనియెన్. 34

క. కేవల మాహారేచ్ఛం, బోవంగ నొకనాఁటిరేయి భోగం బద్రువం
గావడి ద్రొక్కిన నొకభూ, దేవకుమారకునిఁ గఱచితిని బడలుపడన్. 35

క. కాటుపడి భీతిఁగాయం, బూటాడంబరచి జనకునూరుద్వితయా
స్ఫోటితమస్తకుఁడై శిశు, వేటుపడినకురరివోలె నేడ్చుచునుండెన్. 35

క. అహలునలముద్దుపట్టిం, జడియపుమని వీపుజఱచి జనకుం డురమున్
డిడికొని మునుగడ పుడమిం, గడునడకువ నున్ననన్ను గని కోపమునన్. 35

క. వసుధామరుఁ డిట్లను వెలి, విసరినతమినోరి విసపువిత్తానోరె
పసనాడెఁ గటకటా యి, క్కసుగంటుం గుందులేక కరవన్ బంపన్. 35

ఆ. కుటిలగతికిఁ బుట్టుగ్రుడ్డికి ననుదిన, శ్రుతివిహీనునకును గ్రూరమతికి
బాపజాతికేలప్రాపించుఁ బరహింసా, చరణవిద్య నిన్ను సైఁపఁదగునె. 3

చ. కడుదోడుసైన యిద్దురితకష్టము నిన్గొని ముంచుగాక యొ
క్కడఁ జననిచ్చుఁ బుట్టపురుగా కొఱగా కెపు డస్వతంత్రతన్
మడుఁగుభజించి భేకముల మస్తమున న్భరియించి కొల్చి యొ
ప్పు డవి దయామతిం గడుపు పోయఁగనుండు పాకారిపొమ్మనన్. 3

క. ధారాళచింత నంతం, గ్రూరతచెడి మిమ్ము మోచికొని తిరుగంగా
నోరాజా వచ్చితి నా,హారము మీరిడక లేదయా నాకనుచున్. 3

క. ఆరోహణకౌతూహల, సౌరభ్యము మోసులొత్తె జలపాదుఁడు దు
ష్టోరగభాషణములు మా,యారూపము లనక నిజము లని తనలోనన్. 3

క. తలఁచి యలచిలువకిట్లను, నెలకొనిననుఁ గొలువనిలువ నీహృదయమువం
గలిగిన నాహారం బిడి, తలవం గ్రొవ్వెక్క నడపెద న్నే ననుడున్. 3

ఉ. మందవిదుండు కష్ట డనమాయను లోనయి చిక్కె నంచు నా
నందమునొంది భేకరమణభ్రమణాదులు నాకులేవు నీ

కందుపచేరి భోగఫలకంబున నీపదము ల్వహించి యుం
దుం దుదిముట్టనందనుకఁ ద్రోవక డగ్గఱఁ జేర్చుకొ మ్మిటన్. 359

క. నను విశ్వసింపు మెప్పటి, కనుమానము మాను చచ్చునంతకు నెందుం
జననని దేవరనగరికి, దనపేరం గప్పుకట్టెదం గొనుమనుచున్. 360

ఆ. కడుపుఁజూపి చావగా నింక నెన్నఁడు, నడుపుకొనియె దనుచు చెడుగుఁబురుగు
చెప్పరాని ప్రియముఁ జెప్పినహృదయంబు, గరఁగి భేకరాజు తెరువుచూపి. 361

క. ఆరోహింపఁగవలె గృ, ష్ణోరగ యీసరియవెంట నొద్దికిఁ జనుదె
మ్మా రయమున ననుటయు ని, ర్వారణనది సొచ్చి కదియ వచ్చెం గప్పన్. 362

క. అప్పా డనురాగమొప్పం, గుప్పలుగొని క్రోతిగొమ్మగొన్నట్లు పడం
గుప్పించి కప్ప లేఁడ, ర్పప్పఫణిప్రవరభోగ మారోహించెన్ 363

క. జలపాదుని బాదుకొనం, దలనిడికొని త్రాఁచు నేచునటనం దటభూ
ములకొంతసేపు ద్రిమ్మరి, యలసినగతి నూరకుండె నట్లుండుటయున్. 364

ఉ. పన్నగభర్తఁజూచి జలపాదుఁడు పల్కె నిదేమి వేగసం
పన్నము గాకయున్నయది మందవిధా భవదీయవిగ్రహం
బన్నభుజంగ మిట్లను దయామయ యాఁకటదీలుపడ్డ నా
కన్నదె యానశక్తి కడు పోమినమీఁదటఁ జూడు చిత్రముల్. 365

క. దోలలు తమవేడుకల జ్వా, తురుగాని వహించి తిరుగు తురగంబులఁ బో
వరు మేపునీళ్ళతఁజనిడి, యరుదివ్విధ మనిన దర్దురాగ్రణి మదిలోన్. 366

క. కలతెర గిట్టిద యనుచుం, దలఁచి యయో విప్రశాపదశ దనయిచ్చన్
వలసిన యాహారము గొన, గలుగమి నిచ్చలున నొచ్చెగద యకటకటా. 367

క. భారవహం బిదిలేదా, హారము నే నిడక కటికి యాఁకట నిపుడే
కారెడునిట్లుండిన నా, యారోహణ కేళి యేక్రియం గొనసాగున్. 368

చ. అని తలపోసి మందవిదు నారసి యజ్జలపాదుఁ డిట్లనున్
ననుఁ దలఁదాల్చి యాడజవనంబువలెం జఠరానలంబురాఁ
జిన యపుడెల్లగప్పల విశృంఖలవృత్తి భుజించి లావుగై
కొని విహరింపుభోగికులకుంజరనాదములన్ ప్రాదంబునన్. 369

వ. అని నిరప్పణగాఁ గప్పలేఁడు సెలవిచ్చిన బలవంత మగుట నీరంబున నవర్గళ
ప్రచారంబునం బేరెంబులు వాఱుచు నొడిసియొడిసి బడలుపడం గఱచి కిచుకు
కిచుకురనక కతిపయదినంబులకు జలపాదావశేషంబుగా నిఖిలభేకంబులం భక్షించి.

క. తలనంటి పట్టుకొని చి, ప్పలువిరిగి పడంకుచున్నవాని నహో యు
జ్జలపాదు విడిచి రోషా, విలమానసుఁ డగుచు మందవిదుఁ డిట్లనియెన్. 371

క. తగునే భోగశిరోమణి, నగునే నొకవేళ నలఁగి యరుదెంచినఁ బై
నెగురుకొనఁ గొండయెక్కడ, దగరెక్కడ యెలదె తారతమ్యం బరయన్. 372

క. నలఁకువ ధర నెవ్వరికిం, గలయతఁడియ మహాబలారిగా యితఁడంచుం
దలఁపక గౌరవమింతయు, సలుపక నను నసదుసేయజనునే నీకున్. 373

క. అతిమణిఘృణిసంభరణో, చిత మగు నాఫణము కష్టశీలా నీకు
త్సితపుటదుగులకు వర్హామె, తతినిక్కనలాల మ్రింగెద న్ని న్ననుచున్. 374

క. పడి నోడిసిపట్టుకొని దెస, పడ నోడలుం దోడలు బడలుపడ నొక్కి ముదం
బడర దిగమ్రింగి వలసిన, కడ కరిగె న్మందవిదుఁడు కాకాధ్యక్షా. 375

వ. ఏ నమ్మందవిదుచందంబున నవమానంబున కోర్చి ప్రతిపక్షక్షయం బాపాదించితి
ననిచెప్పి చిరజీవి మఱియు మేఘవర్ణున కిట్లనియె. 376

క. మూలముల జెఱుప వనల, జ్వాలలు తరువులనకాని చందనశైత్య
శ్రీల మగుగాడ్పుచెఱుచు, న్మూలంబులతోన వృక్షముల శీఘ్రమునన్. 377

క. ధనమున ఋణశేషము సా, ధనముల రిపుశేష మౌషధంబునఁ దనుసం
జనితగదశేష ముదకం,బున శిఖిశేషం బశేషముగఁ జేయఁదగున్. 378

చ. ముడివడియున్న దుర్వ్యసనము న్సడలించి దురంతరోషపుం
గడలి సుశాంతిసేతువునఁ గట్టి సమాసమదేశకాలముల్
కడఁగనిచిత్రగుప్తి పాసఁగ న్మను జేనికి వేయునేల యి
ప్పుడమిఁ గరస్థలామలకముల్గద సంపదలు న్శుభంబులున్. 379

క. శరములఁ బపరుమనీషా, శరములఁ బడినట్లు రిపులు సమరమువలయున్
శరములకు వలను ప్రజ్ఞా, శరములకుం గ్రాహ్యమెద్ది సరియా రెంటన్. 380

క. ఆఁతులకు దైవయత్నము, బలవంతంబైన నెల్లపనులొదగు మహా
బలుల కది లేకయుండినఁ, బలుకులు వేయేల కడమపడు సర్వంబున్. 381

వ. సుచరితఫలంబులంగాక సకలకార్యంబులు చేకూడవు త్యాగంబున శూరుండును
వైదుష్యంబునం బ్రియుండును గుణంబుల లుబ్ధుండును నగుచు రాజు రాజ్యంబు
గావింపవలయు నిందొక్క టితక్కినం బురుషాకారంబు నిరర్థకం బని విందు మది
యట్టిద. 382

సీ. ఘనరూపనిధి యనంగునకా నంగిత్వ ముచితమే బలి కహివ్యూహవసతి
పాండునందనునకా బహుకాలవనవాస మిభపురాధిపునకా యేటిచౌరవ
యదుకులాధ్యక్షునకా శాపమరణంబు జాహ్నవీసుతునకా శస్త్రశయ్య
నలరాజుకా మహానసపాకభజనంబు నహుషునకా ఘోరనాగమూర్తి

తే. మఱి త్రిశంకునకా పచ్చిమాలతనము, ద్రుపదనందనకా రాచతోత్తుపాటు
మనుజుఁ డెవ్వఁడు కర్మస్వతంత్రుఁ డరయ, నీశ్వరుఁడు గాక సమకూర్ప నిట్టిపనులు.

వ. ఇది యెఱింగి ప్రజ్ఞాన్యాయంబు లేమఱక యుండవలయు దైవబలంబు గలవాఁడవ గుట నీకు శీఘ్రకాలంబునఁ గార్యసిద్ధియయ్యె నిరమిత్రుండవయితి ప్రాప్తమిత్రుండవయితి వింకఁ బ్రాజ్యవైభవంబున రాజ్యంబు సేయుమని చిరజీవి చెప్పిన మేఘవర్ణుండు సకలసంపత్పరిపూర్ణుండై రాజ్యభోగంబు లనుభవింపుచుండె. 384

క. అని చెప్పిన ధరణీవర, తనయులు నిజగురునిఁ జూచి తాత్త్వికముఖ్యా
వినఁ బ్రియమయ్యెడు జెపుమా, యను వారఁ జతుర్థతంత్ర మని యడుగుటయున్.

చ. అతనుభయంకరైకవిషమాంబకసమ్యగనంతభోగసం
గతవిగతాంతరాయగతిగాఢవినాయకవత్తచిత్తజా
ద్భుతిబహుపద్మజాండమణిదీపితకుక్షికరంకమందరీ
కృతపరతత్త్వవిజ్జటిమ్యగేంద్రవికస్వరయోగపుష్కరా. 386

క. రంగత్తరజాతమహా, గాంగేయస్తవనఘటితఘనపులకాయ
త్తాంగనిచోళయుతుప్రా, గ్రంగస్థలమధ్యసంచరణశైలూషా. 387

మాలిని. కలుషనుళకధూమాక్రాంతచింతామరామా
ప్రళయకరణరోషా ప్రాణిసంగుప్తితోషా
విలసదచలధర్మా విశ్రుతశ్రోత్రకర్మా
సులభభజనలోలా సుస్థిరశ్రీవిలాసా. 388

గద్య. ఇది శ్రీవేంకటనాథకరుణాలబ్ధ సరససాహిత్య నిత్యకవితావిలాస సకలసుకవికృతకైవారభాషణోల్లాస రాజకులపారావార పర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గపరిశ్రమణ ధైర్యపర్యాయధిక్కృత నీహారపర్వత పర్వతరాజకుమార నిస్సహాయప్రబంధనిర్మాణ భోజభూదార సుధామధుర భారతీసనాథ వేంకటనాథప్రణీతంబైన పంచతంత్రంబున సంధివిగ్రహం బన్నది తృతీయాశ్వాసము.

శ్రీ రస్తు.

# పంచతంత్రము.

## చతుర్థాశ్వాసము.



శ్రీ సత్యాలోకనజని
తాసమశరకరణసంభ్రమాధికనరక
త్రాసవిధిప్రాఘరణా
భ్యాసభుజార్గళసనాథ హరిహరనాథా. 1

వ. దేవా లబ్ధనాశనాభిధానచతుర్థతంత్ర మాకర్ణింపు మధీతనీతిశాస్త్రమర్మం డవ్విష్ణుశర్మండు సుదర్శనకుమారుల కిట్లనియె. 2

క. పరకపటాలాపపరం, పరకేర్పడ భ్రమసివిడుచు ప్రాప్తార్థము గా
పురుషుఁడు విడువఁడె మును సా,గరమునఁ గపిశింశుమారకము దుష్ఫణితిన్. 3

క. నావిని రాజకుమారకు, లావిప్రవతంసుఁ బలికి రదియెట్లు నయ
ప్రావీణ్యా యాకథ జెపు,మా వినియెద మనిన వారి కతఁ డిట్లనియెన్. 4

సీ. నీరదపథికపానీయనికేతంబు మేదినీయువతికటీదుకూల
మంబరచరవరాభ్యవహారసత్రంబు సరిదలంకృతికార్యకరణశాలి
కార్పణ్యాభయదవీక్షణవధూజనికర్త రాక్షసజిద్విహారస్థలంబు
మునిరోషనష్టనాకనిసర్గశుభదాయి నిస్తులరత్నపూర్ణితకళంక

తే. ముగ్రశతధారధారాసముగ్రభీతి, పరవశాగత బహుకుభృద్రక్షణనిపుణ
మతనుసత్వ మలక్ష్మీతౌర్వానలంబు, వఱలు దక్షిణశరధిసర్వజ్ఞశరధి. 5

సీ. ఇమ్మహాగాంభీర్య మెవ్వనికోదవు నీవాహినీభరణ మెవ్వనికిఁగలుగు
నీగోత్రరక్షణ మెవ్వనికబ్బు నీయనిమిషావాప్తి యెవ్వరికిదొరకు
నీసత్యసౌభాగ్య మెవ్వనికెసఁగు నీఘనహితాచరణ మెవ్వనికి నొదగు
నీగాఢజీవన మెవ్వనికుండు నీకనకరత్నోర్మ్ము లెవ్వనికి వశము

తే. నీలలితరాజసన్మాన మెవ్వనికి ల,భించు నెవ్వని కిట్టియొప్పిదము నిత్య
మాతనికె కాక యని లోకు లభినుతింపఁ, గ్రాలుఁ నిర్భరవిభుఁ డాపగావిభుండు. 6

క. అపరిమితం బుద్ధ్యుపతర, ణ్యుపసక్తం బఖిలజలధరోపాస్యం బా
త్మపదస్థానిమిషంబు, ద్విపులాక్షౌమం బనంతవిధ మెఱిఁగించున్. 7

క. ఆనీరధితటమున బహు, మానుం డనువాఁడు వృద్ధమర్కటుఁడు మహా
వానరులు ముఖరపత్ర, స్థానరులు భజింప సుముఖుఁడై వర్తిల్లున్. 8

ఉ. వానికిఁ గంటిలో నెరసువంటివిరోధి సమీపపర్వత
స్థానమునం జయోన్ముఖుఁడు తామ్రముఖుండు చరించు నమ్మహా
వానరసార్వభౌముఁడు ప్లవజ్జనసంగబహుప్లవంగసే
నానతగోత్రుఁ డౌచు నొకనాఁడు సమిత్కరణేచ్ఛ వచ్చినన్. 9

క. కైకొనఁగలబహుమానుం, డాకంఠక్రోధవివశుఁడై ప్రతివీరా
నీకినిపై బలధిక్కృత, నాకపుల న్గపులఁ బనిచిన న్నిశ్శంకన్. 10

క. ఆహవ మొనరించె సము, త్సాహత నిరువాఁగు దొడరి దంతాదంతిన్
బాహాబాహిముఖాముఖి, నాహావాజ్ఝరఖచర మై నభ మొప్పన్. 11

శా. లావు ల్పేర్కొని నొంతు రగ్విఁ బిడికిళ్ళం ద్రెళ్ళ పార్శ్వాచల
గ్రావంబు ల్పెకలించి ఱువ్వురు మ్రగ్గ న్మ్రొగ్గ వృక్షాగ్రశా
ఖావర్గంబుల నెత్తి మొత్తుదురు స్రుక్కం జిక్కఁ గంఠచ్ఛటల్
గావుల్పెట్టుదు రొండొరు ల్మదమణంగం బ్రుంగ నవ్వానరుల్. 12

క. చఱతురు పెడచేతులనోఁ, గఱతురు తెరనోళ్ళఁ బిసితఖండంబులు రా
విఱుతురు పెళపెళ నెమ్ములు, పఱిబోవనికలిమిబలిమిఁ బ్లవగాధ్యక్షుల్. 13

క. విరసము సెఱసాహసమున్, బురిగొన నిట్లుభయసైన్యములు పోర న్ర
క్తరసతరసములు గదురఁగ, శరనిధిసత్వములు వెలివిసరి రాఁదొడఁగెన్. 14

వ. ఆప్లవంగసంగరం బావిష్కృతారుణంబు నవ్యక్తతారకంబు నగుచు నహర్ముఖం
బును లుంఠితాగమనంబు లుంఛితశ్మశ్రురోమంబు నగుచు బౌద్ధకర్మంబును నదృ
ష్టశాస్త్రంబు ననక్షతపరికరంబు నగుచు యౌవనవివాహంబును బరిభ్రంసితచరణం
బుం బ్రణష్టపళీవిలాసంబు నగుచుఁ గుకవికవిత్వంబును ననుకరించె. 15

క. అంతఁ దనఘనబలంబులు, పంతము దిగనాడి యోడి పఱచిన సంప
ర్తాంతకుఁడన బహుమానుఁడు, తాం తేరరతామ్రముఖపతాకినిఁ దోలెన్. 16

తే. అప్పు డూర్ధ్వశిఖుం డైనయనిలసఖుఁడు, పోలె మత్తామ్రముఖుఁడుచూపులనతిస్ఫు
లింగసంఘాత ముదయింప నింగినింగి, దాఁకుచుంబాన బహుమానుఁ దారసించి. 17

చ. తఱిమివధింప శత్రునకుఁ దానసమీకసమీకరంతయై
యుఱిముటఁ బల్కె నోరిజరతా పెఱతావునకేగు నాబలం

బెఱిఁగియుఁ జావనేలయిపు డీవన నబ్బహుమానుఁ డోరి ద
బ్బుఱలకు రాను తాఁకువెడపల్కులు కోర్చినవాఁడఁ గాఁ జుమీ.

క. పందనుఁ గాక పలాయన, కందళితసాహసునియందు గలుగునె యని మి
న్నందినకోపంబున నై, చెం దామ్రముఖుండు పుల్లసిల శిలనలుకన్.

క. మఱియొకకుటవిటపంబునఁ, జఱచి ఘనక్రోధదృష్టి సమకొనముష్టిన్
బఱియపడ నురముఁ బొడిచిన, మఱియుం బడకపుడు తామ్రముఖుఁ డుగ్రుండై

క. బలవంతు మాల్యవంతుం, జలధికడం గడఁగి నొంప సమయింపంగాఁ
దలఁచుహనుమంతుబంతున, నలవృద్ధుం గ్రుద్ధుముష్టిహతి క్షితిఁగూల్చెన్.

తే. కూల్చి చంపక యసురతోఁ గూడ నతని, నతనికాంతాళిఁ గైకొని యతుల గతి
బఱచి వారాశిరాశితత్ప్రాంతకాంత, ధరఁ జిరాద్భుతిశైత్యకృత్యము లొనర్ప.

క. కొండొకకాలమునకుఁ గపి, మండలపతి మూర్ఛఁదేఱి మహితహితోఁ గూ
ర్చుండి కనువిచ్చి రిపును, ద్దండపరాక్రమునిఁ గాంచి తలవంచుకొనెన్.

వ. అగణ్యదాక్షిణ్యాభిముఖుం డగుతామ్రముఖుం డబ్బహుమానుని నన్వర్థనా
గావించి పంచిన.

చ. జరఠకపీంద్రుఁ డట్లరిగి సాగరతీరమునందు మానితాం
బురుహభవాండషండపరిభూషితుఁడై వెలుఁగొందుచున్నయీ
శ్వరుఁడన నుజ్జ్వలజ్జటిలసారఫలంబులఁ బూర్ణమై మహా
గరిమ వహించుదాని మధుగర్భమునాఁ జను మేడిదోఁచినన్.

క. పరికించి యయ్యుదుంబర, తరువెక్కి తదీయపక్వతరఫలసేవా
గరిమం బ్రాణానిలసం, భరణముఁ గావించికొనుచుఁ బ్లవఁగుం డుండెన్.

క. అలకపిచేతిపచేళిమ, ఫలము ప్రమాదమున జారి పాథోధిజలం
బులఁ బడియెఁ బడిననొండొక, బుళబుళశబ్దంబు సంప్రభూతం బయ్యెన్.

క. ఆనినదము కర్ణంబుల, కానందవిధావిధాయి యగుటయు గణనా
హీనము లగుతత్ఫలముల, వానరుఁ డక్కడలి నీటవై వఁగఁ దొడఁగెన్.

క. వనచరకరముక్తములై, వనధింబడు మేడిపండ్ల వారణలోలోఁ
దినుచుఁ జలింపక క్రకచుం, డనుదారుణశింశుమార మచ్చోటుండన్.

క. అధికతమోదుంబరఫల, మధురరుచిం జొక్కి శింశుమారము మాసా
వధిగా నచ్చోటన కర, మధివసియించె న్నిజప్రియావిముఖుండై.

చ. క్రకచునిభార్య కూర్మిచెలిఁ గన్గొని యిట్లనుఁ బ్రాణవల్లభుం
డకట యొకేనిఁబోయి తడవయ్యె విలంబనహేతు వెద్దియో

తికమక మైతి నా నెగులుఁదీర్పుము నీవిపు డేఁగిమాది నా
యకసుఖవార్తఁ జెప్పుమని యంచిన దూతికపోయి ముందరన్. 31

క. ఒకచో వికచోదుంబర, నికటంబున మసలికొ్రఁతి నెయ్యంబునఁ బా
యక యున్న శింశుమారుం, గ్రకచాంకునిదూతి ప్రీతిఁ గని చని యిట్లన్. 32

చ. చెలువతియున్న కూర్మి చెలిఁ జేరి వినం గన గొ్రత్తలైన వో
చెలితెలియంగ నంతయును జెప్పెద రో యకవిన్ము నేను నీ
యలఘునియోగమూఁది చని యక్కడ నొక్కెడఁ జూచి వచ్చితిం
దొలఁగక వానరప్రమదతోఁ గవఁబాయునివాని నీపతిన్. 33

క. నేనెఱుకచేయుకొని కిటు, వెనువెనుకను వచ్చివచ్చి వెలఁదికొలందిన్
జననీపనిచెప్పితిఁ బర, వనితారతి లుబ్ధుఁ డేలవచ్చు న్మగుడన్. 34

క. నావిని కాఁపుర మెట్టునలె, నీవిధమునఁ బ్రాణనాథుఁ డితరస్త్రీపై
త్రీనహుఁడయి యుండఁగ నని, పావకశిఖిపోలె మండిపడి యది మదిలోన్. 35

చ. కనుఁగవ నశ్రులోడికలు గట్టఁగఁ దైలనిషిక్తయై నిజా
నన మరవాంచియుండె సదనంబున నత్తతి శింశుమారుఁ డ
వ్వనచరనాథువీడ్కొని యవారిగఁ దివ్యని మేడిపండ్లుగొం
చు నిలువ కేఁగుదెంచి యిలుసొచ్చి కులాంగనఁ జూచెఁ జూడ్కికిన్. 36

ఉ. ఒండొకభంగిఁ దోఁచు టరుం నుల్లము ఝల్లనిపల్కె శింశుమా
రుండు ప్రియానయాతిగవిరోధినె హృత్ప్రియుదాప్రమాదినే
యండమువచ్చినం బలుక వెక్కట నీవన శింశుమారిని
ష్షండవిధానమైనయలుకం దలయెత్తదు చూడ దెంతయున్. 37

క. అదియట్టిద యప్పనికిం, బొదరగుటం దూతిప్రీతిఁ బురికొనఁ బలికెన్
జదురాలికిఁ దెవులెత్తిన, యదినీతో నెట్లుమాటలాడం గూడున్. 38

క. మందులు దెమ్మనిచెప్పిన, మందులు నినుఁ గొలుచుభటులు మాతోఁ దమలో
నిందెవ్వరుఁ బలుకరు నీ, చందముగా నెట్లు సాధ్విజా రుజ మానున్. 39

క. నావిని క్రకచుం దను మ, జ్జీవము లౌషధము లయినఁ జేడియ కీలో
సేవింపఁజేసి నిర్గదఁ, గావించెదఁ జెపుము దాఁచఁగా నేమిటికిన్. 40

క. అని కూర్మి తేటపడఁ బ, ల్కినపల్కులు శింశుమారి గెంటనివేడ్కన్
విని నీతి తంత్రమంత్రిం, గనుఁగీఁటిన నతఁడు చేరి క్రకచుని కనియెన్. 41

క. ఎలనాఁగ రోగమణఁపం, గలమందులు చెప్పఁడనిన ఘనశాస్త్రకళా
బలవేద్యులు వైద్యులు గే,నారీతిం గ్రోఁతిగుండె వలెనని రధిపా. 42

క. అది ముదిత కోసఁగకున్నన్, బ్రతుకదు చెడచెడఁగరాదు పరిణామమునన్
మఱిఁగదిరిన వెఱఁ గ్రకచం, బిది యెవ్విధి నొరయు భార్య నెట్టీడేర్తున్. 43

క. బహుమానుం డొకఁడున్నాఁ, డహితుఁడు గాఁ డతఁడు హితుఁడు హాహా ముక్త
స్పృహగృహకార్యార్థము దుస్సహమహనా ప్రజ్ఞ నెట్లు చంపుదు నతనిన్. 44

చ. నిరతము విశ్వసించు నతినిర్మలచిత్తున కెగ్గు సేయు కా
పురుషుఁడు దక్క భూరికులభూమిధరంబులు గావు సప్తసా
గరములు గా వరణ్యములు గావు భరంబని ధాత్రి మైత్రి నా
సిరివరుతోడ విన్నపము సేయదె వేఁడిన నట్లు గావునన్. 45

చ. కపట భార్యనిల్కడకుఁ గాఁ జెలికానికి నెగ్గుసేఁత యొ
క్కడు దురితంబు కాఁపురము గూలఁగఁ జూచుటయు న్మహాఘ మి
ప్పుడఁతుకపట్టున న్సఖునిపట్టున నింతి విశేష మింతకై
చెడుపని యేనియుం దగిలి చేయక మానఁగరాదు గొబ్బునన్. 46

వ. అని నిశ్చయించి బహుమాననధోద్యోగంబునం దిరిగి వచ్చి నప్పు డుప్పొంగుసమ్మ
దంబునం బ్లవంగపుంగవుండు. 47

క. క్రకచావికచాద్భృతియొ, ద్దకుఁ గ్రమ్మఱ నరుగుదెంచెదవు కులకాంతా
నికట మకటా యసహ్యం, బౌకో సత్యముఁ జెప్పుమనిన నుడుచరుఁ డనియెన్.

ఉ. ఏను భవన్నియోగమున నేగి ఫలంబులు కానుకిచ్చినన్
మానిని పల్కె నీ వరిగి మాసకుమయ్యెఁ బ్రవాస మెవ్విధిం
బోనిది నీకు నెద్దిగతమో గతమోహభవద్వియోగంబు నా
తో నెఱిఁగింపుమున్న భయదారసదాద్భృతి నంటి దానికిన్. 49

చ. తనరుననూనభామతిమిధామతటంబున లెక్కకెక్కుడా
ఘనఫలరాజిఁ గ్రాలు మనుగర్భమునాఁ జనుమేడి దానిపై
మను వనువాసరంబు బహుమానుఁడు తత్కపిచక్రవర్తిపో
షున నితరం బెఱుంగక యపూర్వసుఖస్థితి నుంటి దాలిమిన్. 50

చ. మఱువఁగ రానిసఖ్య మది మాటలు వేయును నేల పుట్టి బు
ద్ధెఱిఁగితిఁ గాని యట్టిజగదేకపవిత్రునిఁ జూడ నెందు నో
తెఱవరొ యంచుఁ బాతకుగతిం గృతి నీయుపకారకృత్యముల్
గుఱిగడవం బ్రియంబుతమిఁ గొండలు కోటులు చేసి చెప్పితిన్. 51

ఉ. చెప్పిన నంతరంగమున సింగఁడు బూఁకఁడునై ప్రియంబు సొం
పుప్పతిలంగఁ బల్కె నది యోయికృతఘ్నుఁడ వీవు గావె య

ష్పప్ప సుహృత్తముం డయిన యాయన నింటికిఁ దెచ్చి వేల్పునే
చొప్పునఁ గొల్తు రట్లు పరిశుద్ధసపర్యల దేల్చుటొప్పదే. 52

ఉ. ఎక్కటి మేడిపై నిలువ నేటికి నేఁటికిఁగాదు నిల్చుఁగా
కిక్కడఁ బెద్దకాల మఖిలేప్సితభక్ష్యము లావహింతు నా
మ్రొక్కనిమ్రొక్కి పెక్కుప్రియము ల్నయము ల్పచరించి తోడితె
మ్మక్కపినాథునంచుఁ బ్రియయ ంచిన నిన్గొనిపోవవచ్చితిన్. 53

క. కారణవిముఖంబై యుప, కారముఁ గావింపలేరుగద లోకము కై
వారం బగు నిట్లన ని,ష్కారణవత్సలుఁడ వీవు కారణజన్మా. 54

క. కపివర నీచేనందిన, యుపకారపుటప్పుఁ దీర్పనోప న్గరుణా
నిపుణమతి నాగృహంబున, కిపుడీ వేతెమ్ము పూజ లిచ్చెద భక్తిన్. 55

క. ఇలువాడిమ్రుగ్గులిడి కూ,రలు గూర్లొనరించి యేలరాఁడాయెనొకో
వెలలెం బ్రొద్దని యట నీ,చెలియలు నేఁ డెదురుఁజూచు సేవించుటకున్. 56

క. రారానిచోటు గాదు కృ,పారాజితపిచ్చుకుంటుపైఁ బర్వినభా
గీరథివిధమున నస్మద, గారమునకు దమ్ము కపిశిఖామణి యనుడున్. 57

వ. ప్లవంగపుంగవుండు. 58

ఉ. రాసిరణం బొనర్చి నిజరాజ్యముఁ గైకొని నన్ను గాసి గాఁ
జేసినవైరిఁ గన్గొనుచుఁ జెంగటనుండుట కష్ట మిందు నా
కోసఖ యట్లుగానఁ బదమూఁద సహింపదు వంతువెంబడిం
గాసిలియుండువారలకుఁ గాననిక్రంతలు మేలుగా వొకో. 59

క. అనఘా నీనిలయమునకుఁ, జనుదెంచెద మీకుఁగాక జలసంచారం
బనువగు నే మముఁ బోలిన, వనచరులకుఁ జెప్ప మనిన వాఁ డిట్లనియెన్. 60

క. నీవాక్యము లుచితంబులు, గావె వయోవిహృతియేడఁ గపులేడ యెటే
నావీపున ని న్నిడికొని, యావాసముఁ జేర్చువాఁడ నరుదె మ్మనినన్. 61

వ. తద్భాషితంబులు మాయాదూషితంబు లగు టెఱుంగక. 62

చ. మెఱసి యుదుంబరద్రుమముమీఁద వసించినకీశరాజు చే
టెఱుఁగనికూనతెప్పవలె నేన్తెఱఁ దోఁచినశింశుమారుపై
నుఱికెఁ దదీయపృష్ఠమున నుండినవాఁడు విశృంఖలత్వరం
బఱచి హుటాహుటి న్మనికిపట్టున కేఁగెడుత్రోవ నేర్పడన్. 63

క. నీరము తెరువునఁ గొండొక, దూరము చని యలసి నిలిచి దుర్దాంతవిషా
దారూఢహృదయుమై చిం,తారతి నది యీరెలుంగునం దనలోనన్. 64

ఉ. నన్నితఁ డంతరంగమున నమ్మి యయో చనుదెంచుచున్నవాఁ
డెన్నిభవంబులం దొలఁగు నిష్టులఁ జంపినఘోరపాప మెం
దున్ననువంటిదుష్టచరితుం బరికింపదు లోక మాక్రియల్
గన్నవిగావు విన్నయవిగా వొనరింపఁగఁ బాసె సఖ్యముల్. 65

క. నడవడి పురుషుని భారం, బిడి భూరివృషంబు జాత హేమము నొఱయం
బడు శుద్ధిశక్తిరుచులకుఁ, బడఁతులహృదయంబు లారయఁ బడ వేగతులన్. 66

మ. పరమద్రోహపురస్సరంబులు నయోపాయక్రియాదూరము
ల్దురితచ్ఛన్నము లన్యతాపకరణోద్యోగంబు లప్రత్యయా
కరము ల్సత్యపరాఙ్ముఖంబులు సమగ్రక్షాంతివల్లీశిత
క్షురము ల్దంభమయంబు లెట్లెఱుఁగవచ్చుం గామినీచిత్తముల్. 67

క. ఈమనసులు గలిగినమహా, శామాయామయతరోక్తులకు లోనై య
య్యో మదినమ్మినకీశ, గ్రామణిఁ దెగటార్చవలసెఁగా నా కనుచున్. 68

క. అలక్రకచుఁ డల్లనల్లనఁ, బలుకఁగ విని వానరాధిపతి భూరిభయా
కులమానసుఁడై యపుడో, దళితాఘా యేమిపలికెదవు నీ వనుడున్. 69

క. ధృతిఁ గ్రకచుఁ డపుడదత్త, ప్రతివచనుం డగుచు నుఱకపఱచుచునుండన్
వితతప్రజ్ఞం గపి యు, ద్ధతు వానిం గ్రమ్మఱించెదం గా కనుచున్. 70

క. భీతిప్రవాహ మతిధృతి, సేతువుచే నాఁగి పలికె చెలికాఁడా నీ
శాతోదరి నాసోదరి, కౌతుకమున నున్నె భవదగారం బమరన్. 71

క. ఇది వినవలతుం జెపుమా, మది వొదలఁగ ననిన శింశుమారుఁడు పలికెన్
గదబాధిత యయియున్నది, గద నీయనుజాత యెట్లుగా ధరియింతున్. 72

సీ. భార్యలేకయొనర్చుపండువు దండువు కులకాంతపెట్టనికూడు గెడు
పత్నితోఁ బలుకనిపలుకులు చిలుకలు గృహిణిలేనికబంధకేళి జాలి
జాయవాటింపనిసరసము ల్విరసము ల్ప్రాణేశ్వరికిఁ గానిపాటు చేటు
దయితకై చేయనిప్రియములు భయములు వల్లభవెలియైనయిల్లు పొల్లు
తే. ముద్దుకులకాంతసుద్దు లేప్రొద్దువినని, చెవులు గవులు వృథా వేయుఁ జెప్పనేల
యకట సతిలేనిబ్రతుకేల యర్థమేల, వాహనములేల కరులేల వసుధయేల. 73

క. నా విని బహుమానుఁడు బా, ష్పావృతముఖుఁడగుచు వాని కనుఁ గ్రకచా నీ
దేవి రుజ మాన్పుటకు లే, రే వెజ్జులు మందుఁ జెప్పరే వా రనినన్. 74

క. చెప్పిరి వానరహృదయం, బప్పనికి నవశ్య మనుచు నగదంకారు
లప్ప కదిహేతువుగ ని, న్నిప్పుడు గొనిచనుట యని యహితుఁ డతఁ డాడెన్.

క. నగచరుఁ డదివిని వెఱఁబం, డ్లిగిలిచి పడపడ వడంకి యొదపడి చెడితిన్
జెగితిఁ గడచనితిఁ బాలిసితిఁ, బొగరున నిట్లయితి మోసపోయితి ననియెన్. 76

వ. అని. 77

క. దారుణగహనంబున నా, హారోఁతలఁ బెట్టుమదిమి నసురుసురై కా
మారంభం బుడుగని యల, ఘోరాఘఫలంబు గట్టి కుడిపెడునన్నున్. 78

క. భీమాటవిలో నున్నం, గామాంధుని బాదవుబాతకంబులు రాజ
గ్రామముననున్న దూరిత, కాముని గల్మషము లంటఁగా శంకించున్. 79

క. చిరకాల మరిగె సురిగెం, దరుణిమ యికనేడ గామతంత్రం బనుచున్
బరలోకచింత సేయుని, పురుషార్థముఁ జేటుపాటు పొందదె యనుచున్. 80

చ. క్రకమని చూచి వానరశిఖామణి యిట్లను నీవిచార మే
టికిఁ జెడిపోయె నేమిటికి డిందె భవన్మతిప్రాణమైనభా
ర్యకు రుజమాన్పఁ గిశహృదయంబునకుం జనుదెంచువాఁడ వీ
వకట యెఱుంగఁ జెప్పనలదా మునుగల్గగ నాకు నింతయున్. 81

ఉ. చెప్పిన నాయుదుంబరపుఁ జెట్టున నెప్పుడు దాచియుందు నా
కక్కప్పుడు మామకీనహృదయంబు సమర్పణఁ జేసిపుత్తు నీ
చొప్పున నింతదాచెదరె చుట్టముఁగానె విరోధినే వృథా
త్రిప్పటజేసి తింకొరులు దెత్తురె నిన్నడవం బ్రతిక్రియల్. 82

క హృదయము దరువున నున్నది, గద నాకాయమున లేదుగద మునుగా నా
కిదిచెప్పక పనిచెడిచితి, గద రిపుఁడవుగాని చెలివిగా వంగనకున్. 83

సీ. ధర్మార్థకామచింతకులకు భూదేవధారుణీపగవధూదర్శనములఁ
జనరాదు రిక్తహస్తములను గామ్యార్థి వగునీకు మున్నుపాయనమునలయు
హృదయంబు మేడినున్నది పోకమరలు నిర్మించితారినికాయ గుండెకాయ
చేయూర నీకు నిచ్చెదఁ బుచ్చుకొని చేరి జాయ నిరామయఁ జేయవయ్య
తే. యనుచుబహుమానుఁడాడుమాయామయోక్తు, లాగమోక్తులుగానప్పుడాత్మఁదలఁచి
తిరిగి యాశింశుమారుఁడే తేరఁ దీర, వృత్తు మెగఁబ్రాఁకి కపి వాని వెక్కిరించె. 84

క. కసినుస నాఁకట ఫలము, ల్మెసవుచు జలివిడిచి మేడిమీఁద న్మోదం
బెసఁగ నటియించువానరు, మసలక వీక్షించుశింశుమారుం డనియెన్. 85

చ. కుజమున నున్నవానరునిగుండియ దండియశంబు నీకుఁగా
భుజబలసార యిమ్ము కొనిపోయెద నాయెదదీఱ మత్ప్రియా
రుజ కనఁ బెక్కుఁ గాననచరుండు దురాత్మ విచారమూఢ యే

కుజముననుండు వానరునిగుండియ యెక్కఁడిజోలిపొమ్మిసీ. 86

చ. స్తుతులఁ గరంచి నాగృహము జూతువు రమ్మని తోడుకొంచుఁబో
యి తగవుమాలి నన్ను బొలియింపఁగ యత్నముఁజేసితేను నీ
గతి భవదీప్సితం బొసఁగుకై వడి నిన్నరలించి మేని బ్రో
చితి చిరకాలజీవి మతిశీలుఁడ మోసము నాకుఁగల్గునే. 87

క. కదలుమిఁక ననినఁ గ్రకమం, బెదపడి యేమఱిన మోసమెఱుఁగనినను ని
మ్మదిక్రోధి మోసపుచ్చెం, గదరా యని విన్ననగు మొగముతో నున్నన్. 88

వ బహుమానుండు. 89

క. దొరకిన నను విడుచుట క, బ్బురపడకుము నీకుఁ దోడుపోయినధరణీ
సురుఁ డొకఁడు లబ్ధమునుజే, శ్వరకన్యక విడిచి రిత్తవాఁడై చనఁడే 90

క. నానీరచారుఁ డాబహు, మానున కిట్లనియెఁ దెలుపుమా వినవలతున్
దానేలవిడిచె నయవి, ద్యానిధి బ్రాహ్మణుఁడు భూతలాధిపకన్యన్. 91

సీ. అనిన శాఖామృగాధ్యక్షుఁ డాక్రకముని గనుఁగొని పలికె నిక్కథ వినంగ
దగుదువు నేనును దగుదు నీకెఱిఁగింప మును విశాలాపురంబున సుకీర్తి
యనురాజు రాజిలు నమ్మహీజానికి భువనమోహిని యనుపుత్త్రి గలదు
దానికి మందాభిధానుఁ డొండొకధరాత్రిదశుండు సుముఖుఁడై చదువుఁజెప్ప

ఆ. నట్లు కొంతకాల మరిగిన నపరంజి, పసిఁడి కలరుతావి వలె మనోజ్ఞ
ఫలము చెఱుకునందుఁ బలెనేమిచెప్ప లేఁ, బ్రాయమయ్యె నానృపాలసుతకు. 92

మ. సితరోచిర్ముఖికప్పుగొప్పు నుపవస్సెష్టహం బధిష్ఠించి కృ
ష్ణతనొందంగని యోర్వలేక పదనాబ్జాతంబు గాంచె న్విధూ
న్నతిజన్నుంగవ యచ్యుతాప్తి బొదలెన్ మధ్యంబు దాల్చెన్ హరి
స్థితిరోమావళివల్లి చక్రితభజించె న్నిష్ప్రియాసక్రియన్. 93

శా. బింబోష్ఠంబు మధూద్ధతంబు పరహృద్భేదు ల్కటాక్షంబు లా
స్యం బుద్యద్ద్విజరాజమండలపరిస్పర్ధాళు వాక్కర్ణదీ
ర్ఘంబా గ్రాల్గనుదోయియుం గువలయప్రత్యర్థితారాపథా
ళంబు ల్వాల్గురులేలొకో పొగడుబాలం జాలముల్లోకముల్. 94

శా. లీల న్వాగరసోదయస్ఫురణదాల్చెన్ మైజగద్గీతస
ర్వాలంకారపదప్రవీణయది యాహా యట్లుగాకుండినన్
వాలగ్రంథివరాళిమోవి నునుదీపంగూడి తోరంబులౌ
పాలిండ్లన్ ఫలమంజరీగరిమ జెప్పం జూడనౌ బెవ్విధిన్. 95

మ. అతిభాస్వత్తరకాంచనంబు చెలినాసాంగంబు కల్యాణ మా
శతపత్రేక్షణ మేను మేరుకుధరాంచత్కూటము ల్దానియు
న్నతవక్షోజము లేమిచెప్ప నదియంతా యంతబంగారు మ
ప్రతిమం బౌనరనాథుపట్టి గణుతింప న్శక్యమే యేరికిన్. 96

క తనువుఁ బయోధరభృతి వ్రేఁ, గని మిన్నెలనాఁగమధ్యమయ్యె నటైనన్
జనను పయోధరభారము, జననాంతరకర్మమేల చను నెంచున్నన్. 97

క. పరమాణువు పరమమహ, త్పరిపూర్తి న్గోచరించుపరమమహత్తున్
బరమాణువై కనంబడు, దరుణీమధ్యస్తనేక్షతత్త్వజ్ఞులకున్. 98

క కన్నులకు మొగముచాలదు, చన్నులకు నురస్థలంబు చాలదు వెన్నుం
బెన్నెరివేణికిఁ జాలదు, కన్నియచెలువంబుఁ బొగడఁగా నాతరమే 99

వ. ఈదృగ్విలాసధన్య యగు నారాజకన్య చకోరికాపరివృత యగుచంద్రికయుంబోలె సఖీజనసహాయయయి వన్నెమెఱసి యొక్కనాఁడాస్థానంబునకు వచ్చె నట్లేగుదెంచిన కుమారీరత్నంబు సౌహార్దభాసమానోల్లాసంబునం దిగిచి యంగపీఠంబున నునిచి సుకీర్తిబంధుజనాగులతోడఁ దత్సౌందర్యసౌశీల్యాదిగుణంబు లుగ్గడించుచు గొలువిచ్చియుండె నాసమయంబున. 100

సీ. చిఱుతకెంజడలఁ గీల్చినజాతిపటికంబు గళమున రుద్రాక్షకంఠమాల
యపరంజిపసిఁడికామాక్షులుడామూఁపుపై గొండ్లిఁగావించుయోగపట్టె
చిన్నారికంటె గ్రుచ్చినశింగినాదంబు గుత్తంపుజిక్కులకుట్లబుఱ్ఱ
కరమునఁ జెనుచోఁ ఱగరిముల్లు మాయూరబర్హనిర్మితమైనబవరిసురటి
తే. భసితభస్త్రిక పులితోలుపచ్చడంబు, నాగబెత్తము దంతపుయోగవాగ
లమరఁ జెట్టునడిగినట్టు లవనినాథుఁ, జేరనేతెంచె నొకమహాసిద్ధుఁ డపుడు. 101

క. ఏతెంచినఁ గాంచి ధరి, త్రీతలనాథుఁడు వ్యాదంకరితనిర్ణిద్ర
ప్రీతి నెదురేఁగి నతుఁడై, యాతిథ్య మొనర్చి యమ్మహాయోగీంద్రున్. 102

క. వినయమునఁ దెచ్చి కనకా, సనమున నిడి రాజుపలికె సదయా మీచా
షనిభూములు వానం బడి, యునివారలు గలరె మిమ్ము నడిగెద నొకటిన్. 103

క. రాజకుమారులలో రతి, రాజకుమారుల సురూపతసవిక్రముల
త్రిజయములమించినవాఁ, డోజగదాభాగ్య కలఁడె యొకఁ డట్లున్నన్. 104

క ఆసర్వజ్ఞాన కపర, వ్యాసా కులగోత్రజాత యగునీసుత సు
ల్లాసగుణవసతి నిచ్చెద, నాసత్కీర్తిం దెలుపుమనిన నతఁ డిట్లనియెన్. 105

క. ఇలఁగలరాజకుమారుల, దెలివిపడం దిరిగిచూచితిని బాటలపూ

ర్మిలయుఁడు జయసేనుఁడనం, గలఁడాతఁడు నీకుమారికకుఁ దగుఁ గూర్పన్. 106

క. ఆత్రైలోక్యశ్లోకిత, గాత్రుఁ బ్రశంసింపనేల కనుఁగొను మనుచుం
జిత్రరస మావహిల్లం, జిత్రించి మునీంద్రుఁ డధిపుచేతికి నిచ్చెన్. 107

వ. ఇచ్చినం బుచ్చుకొని యచ్చిత్రరూపంబుఁ జూచి యచ్చెరువంది యమ్మనోహరాకారంబు తనయనుంగుతనయకుఁ గానంజేసి యజ్ఞసేనుండు దనకు మేనల్లుం డు గావున సదృశసంబంధంబున కలరుచు. 108

క. జనపతి మునిపతిఁ బూజా, వినుతి నతిక్రియలఁ బల్లవిలఁజేసి ప్రియం
బున వీడుకొలిపి తానుం, జనియెఁ గొలువువిరిసి రత్నసదనంబునకున్. 109

ఆ. అట్లు రాజపుత్రి యాచిత్రరూపంబు, గన్నుదనియఁ జూచి కంఠదఘ్న
మోహసింధుపతితయై హార మాహార, మాళిజనవిహార మరుచిపుట్టి. 110

వ. చింతించుచుండ నెచ్చెలు లారామంబునకుం గొని చని. 111

సీ. కలకంఠి కతిశయోత్కలికావిలాసంబుఁ దార్పదే యారామధామకేళి
లీల నేత్రప్రియాళికి నమందానందలహరిఁ బుట్టింపవే లతలు విరులు
వికసిల్లునీపద్మినికి సదామోదంబు జరుపదే కాసారసారవిహృతి
శిఖిబర్హాతులితకైశికకు సంతాపంబుఁ బాపదే ఘనకదంబకకులంబు

తే. సకలెనుగదమ్మ లావుకాంచనకలాప, పరిచయము మానెనమ్మ దెప్పరపువంత
వాడెనుగదమ్మ మాతోడ నాడదమ్మ, కొమ్మ మ్రాన్పాటు కెట్లోర్చుకొనఁగవచ్చు.

వ. అని నెచ్చెలు లచ్చెలి నాలోకించి సుముఖిగాఁ జేయువారయి శిలీముఖప్రముఖంబులం జూపి యిట్లనిరి 112

చ. కరటులపాంసునం గడపుఁగాలము బల్లవసంగమంబున
న్దిరుగుఁ గుజాతమైత్రి నెడత్రెవ్వక శీధువుఁ గ్రోలు మాలలం
దవసినమండు మ్రోఁత తఱు చాత్మభవైకసుపర్వగర్వముం
గుఱుచయొనర్చు నెట్లుపాసఁగుం జెలి దీని ప్రియాళిగాఁ గొనన్. 113

చ. కలగుణము ల్ద్యజించి పలుగాకులవంటి వనంగవచ్చునే
ఫలదశపారణ ల్వినయపాటవము ల్మతిప్రాప్తకాలభా
షల సుమహత్తరు ల్చెలిమి సల్పఁగనున్కి దగుం ద్విగంగదీ
ప్తులు వెలిగాఁ దపస్వినులు వో కలకంఠులు మాకుఁ జూడఁగన్. 114

మ. మురిపంబుల్ గలమిండ తేటికడియంబుల్ మారుతోత్థభ్రమిం
దిరుగం భాసురకేసరేణుకణికాధిష్ఠానకించిద్విక
స్వరపుంగ్రొవ్విరిఱోళ్లఁ జైత్రహరినించం జంచరీకాలకా

నెత్తుకొని రెంతనిర్దయు లీలతోంగు, లనఁగఁ గంకేళికాంతుఁ గాలాఁగ కరిగి. 130

ఉ. చేరువఁ గాంచి రక్కలికిచేడియ లవ్వనపాళిఁ గేళికా
సారము దుంగభృంగకులఝుంకృతిఝాంకృతిసంగమంగళా
గారము గుంజపుంజబిసఖండనచండమరాళలోలవాః
పూరము దారకోరకితపుండ్రగపూగకుటీరతీరమున్. 131

చ. కని బిసదండపత్త్రపుటికాపరిపూర్ణసువర్ణకర్ణికా
కనకఘటీస్ఫుటీభవదఖండసహస్రదళాతపత్త్రముల్
దినపకరోష్మఁ దీర్ప నిరుదిక్కులఁ జత్త్రము లాశ్రయింప ని
ల్చినయలరాజహంసపటలిం గని సమ్మదవార్ధిఁ దేలుచున్. 132

చ. వడిఁ బుటమెత్తి వ్రాలు నిడువాలువచాలుపులింతనంతపై
నిడువెలిగుంచెలం దెలుప నీదరగాడ్పులఁ గ్రిందుమీఁదుగాఁ
బడుజలజచ్ఛదంబులు శుభవ్యజనక్రియఁ జేయ రాజుకై
వడి గనుపట్టునంబురుహవాసముఁ జూచి ముదాప్తి నొందుచున్. 133

ఉ. చుట్టినమాఖ్యమాలికలచొక్కపుఁదావులు సోఁడుముట్టఁ జా
పట్టునిరల్పకంకణవిభ ల్మయనోత్సవ మాచరింపఁ గా
మట్టపుటూర్పుల న్మెఱయ మంజుసరోరుహరాగపూగముల్
పట్టపురాణిరీతిఁ గనుపట్టుసరోరమఁ జూచి యుబ్బుచున్. 134

ఉ. పొంగ నఖండతుండరవము ల్జనముల్ ఘనపక్షనిర్భరా
సంగమునం బహుప్రసవజాలకలరేణువు లంటిరాఁ బరి
ష్వంగితసాధుశీధుమదసంపద నింపొదవించుతుంగసా
రంగములం గనుంగొని మృగాక్షులు సమ్మదవార్ధిఁ దేలుచున్. 135

చ. సరసమృణాళనాళతనుసంభృతము న్వికచచ్ఛదస్ఫుటో
ద్ధరణము కేసరప్రసరదంష్ట్రము ఝుంకృతిభాగలీనభూ
త్కరణమిషంబునై సొగసు గాడ్పులదూలుచు మాఁగుతుండిక
ద్వికసనభంగి నొప్పునరవిందముఁ గన్గొని సోలియాడుచున్. 136

ఉ. జాతకుతూహలాప్తిఁ దమచక్కఁదనంబులఁ గాంచి యద్భుత
ప్రీతిరసంబు లుట్టిపడ బెద్దల నొదలయూఁచు లోకవి
ఖ్యాతసరోరమాలలనకమ్మల మించినక్రౌంచమండలీ
భీతిఁ దళుక్కన న్బెళుకుబేడసలం గని క్రేళ్లు దాఁటుచున్. 137

చ. సిరిగలచోటులన్నియును జేకొని బంధురధారసత్త్రసం
వరణబలంబు నిత్యమయి వర్తిల దారుణమైనవిక్రమం

ఉ. వేవెడఁగేల డీలుపడ వ్రేసినఁ బైఁబడ వక్త్రశీధుని
ష్ఠీవన మాచరించినపడిం జరణంబున దన్నిన న్రహిఁ
బోవనిపార్థివస్ఫురణఁ బొందియు నుత్కళికాప్తిఁ బొందుహే
లావతి యిట్టినీచతరులం బరికించితె యిమ్మహావనిన్. 125

సీ. నెలఁత నీపలుకులో నిదికర్ణికారంబు వనిత నీనగవెఱిఁగినది పొన్న
మెలఁత నీకనుసన్న నలరుబొట్టుగ ముద్దుపొలఁతి నీచేసంజ్ఞఁ బొదలు మావి
ముగుద నీసమ్ముఖంబున గ్రాలు సంపెంగ రామ నీహృదయపారగము క్రోవి
పడఁతి నీపదమాసపడు నశోకము వినఁ బ్రియపడు నీపాటఁ బ్రేంకణంబు
తే. అతివయుష్మత్పదగ్రహాశ్రితము పొగడ, యువిద వావిలి యలరు నీయుసురుకలిమి
బంధుమధ్యము మివ్వనాభ్యంతరంబు, విద్రుమాధరకన్నిచ్చ విశ్రమింపు. 126

సీ. ఘనసుమనఃకుఃంబున నెట్లుపుట్టెనో యొరుల చేరువ నున్ననుడుకుఁ జూపు
బహుపత్త్రభరణసౌభాగ్య మెట్లందెనో యుగ్రగంధస్ఫూర్తి నుల్లసిల్లు
నిరవధికామోదభరిత మెట్లయ్యెనో మహిబుణ్యతరులకొమ్మలఁ బెనంగు
సతతాభివృద్ధి రాజసమెట్లుగల్గెనో కఠినకంటకమైత్రిఁ గడపుఁ బ్రొద్దు
తే. ననుచు బెనుచూరపోలె జెల్లాట మెసఁగ, వనమునసుమాపచయకౌతుకాప్తి నదరి
సంపెఁగలమల్లికాగుళుచ్ఛములఁ బొన్న, విరులమతిగేదఁగుల రెమ్మ వెలఁదులంత.

ఉ. కోయిలనోరుసోఁకనిచిగుళ్లు నికారపుఁజిల్కభిన్నము
ల్సేయనిపండ్లు కాలవడి లేవడితె మ్మెరకూనరాశిగా
వ్రేయనికమ్మపుష్పాడి ప్రవృద్ధపిపాసమదాళిమత్తుకం
బోయనితేనియ ల్గమిచి పూవిలుకానిభజింప నంగనల్. 128

సీ. కలకంఠముల నోరికడిదివ్వవలె నంచుఁ జికిలిగుబ్బెతలు గోసిరి చిగుళ్లు
చిలుకమూఁకలకూడు చెఱుతమా యని పువ్వుబోండ్లు మాఁగినపండ్లు పుచ్చుకొనిరి
యెదుటుదుమ్మెదలఁ బస్తునుతమా యని ముద్దుగొమరాండ్రు విరితేనె గొల్లఁగొనిరి
మదటగాలి వదూళి మాన్తమా యని కుమారికలు పుష్పాడు లావరించుకొనిరి
తే. అతనువిలు మూలవేయింతమని సుధార, సాధనలు తావిపూవుల నపహరించి
రంత నాక్రీడ భూక్రీడ నలసి యలసి, తాంబుజాక్షులు కంకేళిహాళి వ్రాలి. 129

సీ. మోమాటనలరుతమ్ములతావు లగలింప గనుసన్న మనుఝషకముల నలపఁ
జూడనాసవమైత్రిఁ జొక్కినయళిరేఁప నరగుత్తికగుసంకు నలటఁ బెట్టఁ
గైవసం బగుబిసాగ్రముల నన్నూలింప మాటకు లోనైన మధువు లొలుకఁ
జనుమానమంచినజక్కవలమరేఁప దండఁ జాయనికుముదములఁ జెండఁ
తే. జరణముల నాశ్రయించినసన్నరాళ, నీడజములపయోభూతి నేలఁగలప

నెత్తుకొని రెంతనిర్దయు లీలతొంగు, లనఁగఁ గంకేళికాంత్యుఁ గాలఁగ కరిగి. 130

ఉ. చేరువఁగాంచి రక్కలికిచేడియ లవ్వనపాళిఁ గేళికా
సారము దుంగభృంగకులఝుంకృతిఝాంకృతిసంగమంగళా
గారము గుంజపుంజబిసఖండనచండమరాళలోలవాః
పూరము దారకోరకితపుండ్రగపూగకుటీరతీరమున్. 131

చ. కని బిసదండపత్రపుటికాపరిపూర్ణసువర్ణకర్ణికా
కనకఘటీస్ఫుటీభవదఖండసహస్రదళాతపత్రముల్
దినపకరోష్మఁ దీర్ప నిరుదిక్కులఁ బత్త్రము లాశ్రయింప ని
ల్చినయలరాజహంసపటలిం గని సమ్మదవార్ధిఁ దేలుచున్. 132

చ. పడిఁ బుటమెత్తి వ్రాలునిడువాలుపచాలుపులింతనంతపై
నిడువెలిగుంచెలం దెలుప నీదరగాడ్పులఁ గ్రిందుమీఁదుగాఁ
బడుజలజచ్ఛదంబులు శుభవ్యజనక్రియఁ జేయ రాజుకై
వడి గనుపట్టునంబురుహవాసముఁ జూచి ముదాప్తి నొందుచున్. 133

ఉ. చుట్టినమాఖ్యమాలికలచొక్కపుఁదావులు సోఁడుముట్టఁ జూ
పట్టునిరల్పకంకణవిభల్నయనోత్సవ మాచరింపఁగా
మట్టుపుటూర్ముల న్మైఱయ మంజుసరోరుహరాగపూగముల్
పట్టపురాణిరీతిఁ గనుపట్టుసరోరముఁ జూచి యుబ్బుచున్. 134

ఉ. పొంగ నఖండతుండరవము ల్జవముల్ ఘనపక్షనిర్భరా
సంగమునం బహుప్రసవజాకలరేణువు లంటిరాఁ బరి
ష్వంగితసాధుశీధుమదసంపద నింపొదవించుతుంగసా
రంగములం గనుంగొని మృగాక్షులు సమ్మదవార్ధిఁ దేలుచున్. 135

చ. సరసమృణాళనాళతనుసంభృతము న్వికచచ్ఛదస్ఫుటో
ద్ధరణము కేసరప్రసరదంష్ట్రియు ఝుంకృతిభాగలీనభూ
త్కరణమిషంబునై సొగసు గాడ్పులదూలుచు మాగుతుండిక
ద్విరసనభంగి నొప్పునరవిందముఁ గన్గొని సోలియాడుచున్. 136

ఉ. జాతకుతూహలాప్తిఁ దమచక్కఁదనంబులఁ గాంచి యద్భుత
ప్రీతిరసంబు లుట్టిపడ బెద్దల నొదలయూఁచు లోకవి
ఖ్యాతసరోరమాలలనకమ్మల మించినక్రౌంచమండలీ
భీతిఁ దళుక్కన న్బెళుకుబేడసలం గని క్రేళ్లు దాఁటుచున్. 137

చ. సిరిగలవోటులన్నియును జేకొని బంధురధారసత్త్రసం
పతణబలంబు నిత్యమయి వర్తిల దారుణమైనవిక్రమం

బురుభవనంబులంబొదల నున్నమహామధుపుంగలంచి దు
స్తర మగునచ్యుతాతిశయచక్రము గన్గొని సంభ్రమింపుచున్. 138

చ. మిళితగరుత్కలాపముల మించుకుమారశిలీముఖాళిసోఁ
కుల నిజహృత్పుటు ల్విరిసి కోమలపత్రవిశాలలోచనాం
చలముల నీరుగప్ప మఱిజాబిలిరాకకుఁ గాక మోహినీ
కళ దుళకించుపద్మినులఁ గన్గొని గంధగుణంబు నొందుచున్. 139

చ. తనభువనప్రశస్తబలదర్పమునం జననీక నిచ్చలుం
దనివిసనం బహుద్విజవతంసములం దినుమ న్నిరంకుశ
ధ్వనిఁ బ్రకటైకచక్రసవిధస్థలిఁ గ్రాలుబకు న్మహాత్తరు
ల్దను శిరసావహింపఁ దగులావరిఁ గన్గొని తెల్వినొందుచున్. 140

ఉ. బారులుగొన్ననీరకణపంక్తులు క్రొచ్చవిరచ్చదెల్ప నిం
డారినకేసరంబులు శుభాత్మతరేఖఘటింప సారకా
సారవధూటిసాంగజవసంతున కీనమరించు పచ్చరా
యారతిపళ్ళెరంబుల క్రియం దగుతామరపాకుఁ జూచుచున్. 141

వ. కదియుంజని ప్రహృష్టచక్రంబుగావున రాజహంసోపలాలితంబయి సిద్ధసంతాన వేష్టితంబుగావున మత్స్యకూర్మకుక్కుటాద్యాసనభాసమానంబయి విడంబితశంబరారంభంబుగావున నాక్రాంతపాఠీనాంకంబయి కుముదప్రకాశోదయంబుగావున నావిష్కృతపుష్కరంబయి యలరుచుండుట కలరుబోండ్లు. 142

క. ఒసపరినడకలు మృదుసా, రసవిసరవిజేత లగుకరంబులు గంధో
ల్లసనము కొమ్ములు నమరఁగఁ, గుసుమాస్త్రునిమదపుఱేనుఁగులగతిఁ జెలువల్. 143

వ. కాసారంబుఁ బ్రవేశించి. 144

మ. పొగడంజొచ్చినభంగి రత్నవలయంబు ల్మ్రోయఁ జేయెత్తి కెం
జిగురుంగొమ్మనవైచె నొర్తు నొకరాజీవాస్య యవ్వాటునం
బగులం గంచుకముబ్బి చన్నుఁగవ చూపట్టె న్నఖాగ్రంబులం
దగ నందంబులు వచ్చి వెల్వడునరిద్వంద్వంబుచందంబునన్. 145

ఉ. పూని ఘటాత్కృతు ల్మొరయ బుజ్జటకొమ్మన నీరునించి యారా
నెఱజాణ నా నొకధరాకటి యొండొకబోటివైవ నె
మ్మే నదరంటఁ దాఁకి నెఱిమించినఁ బయ్యెదవ్రయ్య నంత న
మ్మానిని యొప్పె పేరొలిఁ దెమల్చినపూవిలుకానివా లనన్. 146

చ. మరువిరితూపురూపుపసమాపు నొయ్యారపుఁజూపు నూరెలం
దిరవులుగట్టి విభ్రమవతీమణియొర్తుక యన్నుగన్నులం

దారలజలంబుఁ జల్లె నది దోయిటవక్త్రముఁ గప్పె రోహిణీ
చిరవిరహార్తినొందినశశిం జిగురాకులఁ దార్చుచాడ్పునన్. 147

ఉ. చేనొకబోటి కెంజివురుఁ జిమ్మనగ్రోవియొనర్చి తమ్మిపూఁ
దేనియఁబీల్చి సోగవిరిదిండుగ నొండొకకొమ్మ జిమ్మనె
మ్మే ననుకైన నమ్మెలఁత మించె జగంబులుగెల్చి శాంతిరే
ఖానియతి న్మరుండు గడుగం గడుఁగ్రాలుమెఱుంగువాలనన్. 148

చ. పొలఁతుకయోర్తు గెంజివురు బుఱ్ఱటకొమ్మ నుఱుక్క నొక్కనె
చ్చెలి చలివీడివైవ నది చిత్తజుఁ డేడ్తెఱఁ జూచి వైచుకే
వలకరవాలసంహతులవై ఖరి గానఁబడంగ దానికే
వలకరవాలసంహతులవంచి వికావికనవ్వెఁ గ్రొవ్వునన్. 149

చ. విరహులమారుమారుఘనవీరబలం బని పాంథకంధర
ల్దఱుగురమాకుమారు నడిదాలనిరాగవియోగజాతకా
తరగుణదాత్మమన్మథపతాకని తేంట్ల నదల్చి కమ్మదా
మరలఁ గదల్చి వారిచరమండలిసొంపు వదల్చి రంగనల్. 150

చ. గతి యతివేలరాగకరిగా నెఱిగాంచినవాలువాలముల్
ప్రతిరహితాంఘ్రులం బెనఁగఁ బైపసముద్దులుగుల్క సమ్మద
స్థితి మితిమీఱఁ గొమ్ములనుజేతులు పుష్కరలక్ష్మిదెల్పఁగా
హితసరసిం జయించి రలయింతులు కంతునిదంతులో యనన్. 151

ఉ. కొమ్ములతోడిహస్తములు గుత్తపుముద్దెలముద్దుగుల్కపొం
దమ్ములనంగవృత్తిజఘనద్వయసొంబులనిల్వ రేఁగి పైఁ
దుమ్మెదలాడఁ జూడ నవదోహదధూమమిళల్లతావితా
నమ్ములజాడఁ గుందరదన ల్గనరైరి మనోహరాకృతిన్. 1

ఆ. ప్రపవభాగ్యమహిమఁ బ్రబలియు నెటువంటి, మునిమిరోయొఱుంగ విసువులె
తారసించి ముద్దుతమ్ములఁ జివురాకు, బోండ్లు కొలనుసొచ్చి పుచ్చుకొనిరి. 15?

క. నాళీకజైత్రనేత్రలు, హాళిం గేళీసరోవిహారశ్రీలం
దేలి కటీఘటితపటీ, జాలములు కలాపవేషసంగతు లమరన్. 154

ఉ. మందమరుత్కిశోరహతి మవ్వపుఁదేనెలజాలువారుపూ
బందిలిక్రిందఁ గప్పురపుఁబల్కుల దిద్దినగద్దె నిందిరా
నందనునిల్పి వృత్తిజఘన ప్రతివర్ణితభారతిం దదా
ళిందమునం ఘటించి కదళీదళగర్భలతాంతసంతతుల్. 155

క. కరములఁ గైకొని చెలువ, ల్మరుజాపగుణీకృతభ్రమరుఁ బ్రతివినతా
మరు జైత్రార్పితమణిచా, మరు నారాధించి రప్రమత్తప్రజ్ఞన్. 156

క. ఆరాధ్యద్యుమణిప్రభు, నారాధనవిధులఁ దనిపి యతిశయపన్నా
ధారాధరవేణులు మధు, ధారాధరఫణితి వినయతాయుత లగుచున్. 157

సీ. తలయేఱుపట్టించె నెలదాల్పునకు భవత్క్రాంతనిష్క్రాంతహుంకారతనము
వికటిలత్త్రోటికోటికిదెచ్చె భారతీకాంత దావకభయంకరశరంబు
ముష్కనిర్భేదనంబున సాధుజేసె నీవైరంబు మతిదివ్యవృషవతంసుఁ
గన్నచాయకుఁ బోయెఁగాని నీనెఱదాడిఁ జేరఁడు గ్రహరాజశేఖరుండు

తే. నీప్రతాపాగ్ని దపియించి నీరజారి, సంశ్రయించె సురాచార్యశరణభూమి
సదృశులెవ్వరు నీకు ముజ్జగములందు, శంబరామశవిమతహింసారిరంస 158

వివిధాగమాంతప్రవేశచాతురి నెన్నదగుశుకాదులు వినీతతఘటింప
మహీసురాప్తిసుహృత్తమహిమ గాంచినయుత్తమాళులు హితవృత్తి ననుసరింప
ఘనదానవేగరాగముల మీఱినజగత్ప్రాణుండు నీమనోరథము గడప
నాశువాగ్గ్రహణమేధాశక్తి మాధవాదృతి భజించినమహాద్విజులు గొలువ

తే. కువలయప్రీతికాముఁడై నెవఁడు రాజు, గాఢరూఢప్రసన్నతఁ గాంచి తిరుగ
సాధుబుద్ధివి గావైతి శంబరారి, వేమునకు బోయుపాలయ్యె వృద్ధసేవ. 159

ఉ. పూతమకరందబృందకరము ల్కరము ల్ప్రతిపర్వసంధిసం
జాతమధూద్ధతంబు విలుసారసమీరకుమారవారణో
ద్ధూతసుజాతచూతరసతుందిల మార రమాకుమార నీ
చేతిగుణంబుమాన నదెచేతిగుణం బిటులయ్యె నక్కటా. 160

సీ. ఆర్తివహించు నీయస్త్రపీఠమునకు నిలుపుగన్నులనీక నివ్వటిల్లె
నతిముక్త మగుతావకాయుధంబున కహో దొరకె జండాలుంతోడిమైత్రి
ప్రంతఁబాయని భవద్ధ్వజవాశ్చరమునకుఁ గలిగెఁ జేరలుఁగులఁ బొలిసి పోవ
బుట్టుగుఱ్ఱైన నీబూమెర తేజికిఁ దగిలె మహావినీతప్రతీతి
యకట జాతికిఁబాసిన యనుఁగుఁజెలికి, నెసఁగె మఱి వేళవేళ మానిసితనంబు
నొడలుమాపిన నీకయ్యె నుగ్రకృత్య, మంగభవనిందితులకు మేలావహిలునె. 161

మ. అమదప్రక్రియ మూఁడుగాళ్ళజరఠుం డైయున్నతంద్రిం ద్రివి
క్రముఁనిం దమ్ములఁ జేరి తత్ప్రిబలపత్రచ్ఛాయ వర్తించునా
దిమసాధ్వి న్రమఁజేర రమ్మనక యుద్వృత్తి న్విజృంభింతు నీ
తిమనీషోదయలాభమెట్లు జనికర్తృద్రోహియౌ వానికిన్. 162

స్మరమృగయు విశిఖబాధ, పరవశయయి యున్న దానిఁ బద్మిని గాఢ
త్వరఁ బరుషరీతి రుచిమత్కిరణ నఖాగ్రములఁ జంద్రకేసరి నొంచెన్. 180

యువతికిఁ బ్రాణంబయ్యుం, బవనుగతిం బ్రోఁదిసేసె మలయక్షితిభృ
త్పవమానుఁడు దూరితరై, పవమానుఁడు మోహదావపావకశిఖలన్. 181

ఇట్లు మారతారేశసమాదసమీరబాధావిధురయై యమ్మధురభాషిణి శోషిల్లునుల్లం
బున నొల్లంబోయి నెచ్చెలులఁ గలయ నాలోకించి. 182

కనలుముక్కలరాజుకంటఁ బుట్టిననేమి గాడ్పుపేరెముపాముఁ గాకయేమి
కంతుఁ డాకృతిఁ బెంచుఁ గాకయేమి సుజాతకలితుఁడై మధువుండుఁ గాకయేమి
హంస మాపగవారికై పోవుఁ గాకేమి గండుఁదుమ్మెద మ్రోయుఁ గాకయేమి
చిలుకవాదులకు వచ్చినవచ్చుఁ గాకేమి కలకంఠి గలహించుఁ గాకయేమి
కమ్మచిగురాకుచే మించుఁ గాకయేమి, కళిక లంతంత మొనఁ జూపుఁ గాకయేమి
వెఱపు నాకేల వెన్నెల వెల్లిద్రెళ్ళి, ప్రాణసఖులార వలవంతఁ బాయుదాన. 183

అని మోముదమ్మి వాడ, న్మనసిజశిఖిమండ సకలమర్మస్థలముల్
దనువూటాడం గన్నియ, పెనుదెగువ న్గుబ్బతిలిన భీతిలి రతివల్. 184

కామాస్త్రములకు నాళీ, గ్రామణి వైషమ్య మొదవుఁ గా కెప్పటికిన్
సోమకుమారీమణి యీ, కౌముది దానెట్లసౌమ్యగా నేర్చునొకో. 185

అని జననాథకన్య నాలోకించి. 186

దరహాసలేశధిక్కరణ మున్నదియో నీవంకవెన్నెల కేల వహ్నిఁ గురియఁ
నిసిమాటలు నేరవనుచు శిక్షించితే చిలుక కేటికి వహ్న్యావళి యొనర్పఁ
బ్రతిపక్షియని తిరస్కృతిఁ జేసితే సాధుపికమున కేల వాబిలుసుఁ జూపఁ
జూడఁ బోలని చూపుఁ జూచితే చంచరీకమునకు నేల ఛిద్రములు వెదక
గోచరింపక యొకమూలఁ గూలి చనక, మందతవహింప కిట్లు త్రిమ్మరఁగ నేటి
కని యుదాసీనుఁ జేసితో యభ్రవేణి, యనిలశిశు వేల వీచివాటయ్యె నిపుడు 187

మనసుగన్న రమాకుమారికా సుతునకుఁ బూర్వాశ్రితుం డైనపూర్ణశశికి
జీవమువంటి దక్షిణసమీరమునకుఁ బేరైనకుసుమాస్త్రబృందమునకుఁ
బలుకుమారనిముద్దుచిలుకకు నెయ్యంపుఁ బైకమై దీపించుఁ బరభృతాళి
కతులాళియయిన గయ్యాళితేఁటికిఁ బెట్టుచెట్టైనలేఁ బ్రోఁదిచిగురుమావి
కకట భయమందవలసె హాయనఁగవలసె, బెగడుపడియుండవలసె గంపింపవలసె
నాతురతఁ గూరవలసె బిట్టలయవలసె, జలదరింపఁగవలసె వే జడియవలసె. 188

చేరుననమావికెంజివురుచేతికి లోనుగదమ్మ పద్మకాం
తారమశాళిమానసము నమ్మిన దింతెగదమ్మ కంతుబ

ల్పాయువమైనచిల్క మిగులాతగులాయ మెఱుంగునమ్మ నీ
పైరుగదమ్మ మల్లికలు పల్లటమందఁగనేల వానికిన్. 189

ఉ. దారుణభంగిఁ బేర్చునినతాపదవజ్వలనోష్మమంటికం
శీరవమధ్యతాంతదశ నీతను వల్లనహించినం దగుం
గైరవసోదరస్ఫురణఁ గాంచిన నీనిడువాలుగన్నులే
లారజనిం గుభృజ్జనికళానిధిరాకను దల్లడిల్లెడిన్. 190

క. అకటా యని చింతింపుము, లికుచకుచ ల్నీలువ సంబళింపక శుకముం
బికము న్మలయానిలశా, బకము న్మదిఁ దలఁచి వినయపాటవ మమరన్. 191

ఉ మాటకు రాదు ప్రోదిశుకమా యొకమారు జయింపరానికై
లాటముజేసె దేటికి భళాపికమా యిఁక మాను బోటి నీ
సాటియె ప్రాణమయ్యు వడచల్లుదురే యిటులైనజోటి యె
చ్చోటికిఁ బోవు నీచలువ చూపవనా పవనాఘునాధ్వతిన్. 192

క. అనిపలికి కలికిచెలువలు, ఘనసిజతాపాతపోష్మమందద్యుతియై
తనరువధూతనువల్లిక, ఘనశీతలరీతిఁ దేర్పఁగాఁ దగు ననుచున్. 193

చ. చెలువల కిష్టమూలములు శీరము లుజ్జ్వలదంపమత్పలా
దళములు వెన్నలంబులు సదామృదులాకృతి మంచివారిలో
మెలఁగుమృణాళముల్ గరము మెచ్చొదవించుమధూళి మాటలో
పలియవి యన్నిటం జెలికిఁ బంచశిలీముఖతాప మారదే. 194

వ. అని శీతలోపచారంబు లాచరించిన. 195

సీ నునుమావిచిగురుపానుపు మహాతను శస్త్రశయ్యగాఁ దలఁచుఁ గంజాతనయన
కడిపోనివిరులకంకటి గణించువధూతకంటకాస్తరణంబుగా మృగాక్షి
వలపుగుంపుమపువ్వుతలిమ మంగభివాగ్నిశిఖగా విచారించుసింహమధ్య
శిరముకప్పుఁబలుక సెజ్జ సొక్కుపుఁగాముశరముగా వగచుయోషాలలామ
తే. మంచిపసమటిపన్నీరు మకరకేతు, విషముగా బుద్ధి నూహించువిద్రుమోష్ఠి
తావిపుప్పొడి శంబరాంతకుపరాగ, మని వితర్కించులలన మోహైకకలన. 196

వ. ఇట్లు మనోభవమోహదాహంబునం బొక్కి పొరలుచున్నకన్నియ నెచ్చెలులు నికేత
నంబునకు మరలఁ దోడ్కొనివచ్చిరంతఁ గొంతకాల మరిగిన నొక్కనాఁ డేకాంతం
బున విద్యామంటపంబుననుండి చదువుఁ జెప్పుచు దదీయసౌందర్యవయోవిలాసంబు
లీక్షించి మన్మథాతురుండై మందుండు భువనమోహిని కిట్లనియె. 197

చ. నిరవధికత్వరం బఱచి నీచనుగొండలసంధి డెందపుం
దెరువరిమారచోరనిహతిం బడి మోహనిదాఘవేదనన్

బాఁ లెదుఁ దేర్పపుణ్య మిదిహో యధరామృత మిచ్చి యిందునం
దరసినగల్గునే పరహితాచరణప్రతిమానధర్మముల్. 198

క. నవలా తావకమోహా, ర్ణవ మేమిటఁగడతు దుస్తరము వివరింపన్
భవదీయ స్తనకుంభ, ప్లవ మబ్బినగాక యీవిపత్సమయమునన్. 199

క. అనిద్రాసుఖితంబులు, గానేరవు లోచనములు కంఠద్వయసం
బై నీలావణ్యరసం,బో నవలా త్రేన్పు వెడలకుండుటవలనన్. 200

క. హారవిలాసము గలని, న్నారసి చీకాకుపఱుప కతనుఁడు ముక్తా
హారవిశేషము గలన, న్నీరసమున గాసిసేయు టీ వెఱుఁగవొకో. 201

క. గాఢరుచి న్రుచిరం బనఁ, గూడదు నీయధరము ధరకుచచించైకా
మ్రేడితము కానిచో నే,లా డాపునఁ జూచువారలకు నోరూరున్. 202

క. ఇన్నియును జెప్పనేటికిఁ, బన్నినమరుగాసివాసిఁ బాసితి నో రా
కన్నియ పన్నియ మేఱయం, గన్నెఱికపుభితు నాకుఁ గరుణింపఁగదే. 203

క. అని దీనాననుఁడై మో,డ్చినకరములతోడఁ బ్రియముఁ జేకొ మ్మనుచుం
దనుఁ బ్రార్థించుధరాసురుఁ, గనుఁగొని రాజన్యకన్యకామణి పలికెన్. 2.4

క. గురుఁ డనఁగఁ దండ్రి యఘుసం, హరణగుణా శిష్యురాల నైనప్పుడె కూఁ
తుర మేర దప్పి కామా, తురబుద్ధిం గోర్కి సేయుదురె నావోటన్. 205

మ. నరకద్వారకవాటభేది యవమానప్రాప్తిమూలంబు దుః
ఖరుజాపథ్యము పుణ్యలోకగమనఘ్నం బస్థలత్కీర్తి సా
గరమంథాద్రి జనాపవాదహుతభుక్కాష్ఠంబు సత్కారసం
హరణోజ్జృంభము గీడుగాదె పరభామాసంగ మెవ్వానికిన్. 206

ఆ. నీతి సాధువృత్తి నీయది ధరణీసు,రుఁడవు వేదపారగుఁడవు ధర్మ
తరులతాపరశ్వథము చెల్లఁబో యిట్టి, నీచచిత్త మెట్లు నీకుఁ గలిగె. 207

తే. ఏను రాజన్యకన్యక నితరజాతి, భామగా నెట్లుపొసఁగు నీపాపవృత్తి
భూసురుఁడవైన యిది నీకు బుద్ధిగాదు, బ్రాహ్మ్యహాని తపోహాని ప్రాణహాని. 2

వ. అని యనేకప్రకారంబుల బోధించుచున్నయన్నీలవేణికి బ్రాహ్మణుం డిట్లనియె. 2

ఆ. నీవు మాటలాడనేర్తువు గురుఁ డేల, చెప్పకొను విరాళి శిష్యురాలిఁ
గవయరాదు ప్రాణికల్పన నేర్చిన, పలువనలువ గూఁతుఁ బట్టికొనఁడె. 210

క. మరుబారిఁ బాటి చంద్రుఁడు, గురుభామం బ్రేమఁ బిలుచుకొని వినుతబుధుల్
పరిణతముని విబుధుబుధుల, గరిగమనాగమనలీలఁ గాంచుట వినవే. 211

క. గౌతమభార్య నహల్యన్, శాతోదరిఁ బదరి పర్ణశాలం గాలా
తీత మునర్చియుఁ గూడిన, యాతని కింద్రునకు నేమియయ్యెం జెపుమా. 212

ఆ. ఇట్టివట్టిసుద్దు లేటికి నీయంగ, సంగలాభ మైన జాలుఁ దెలుప
వెలుప మెలసి మీఁదఁబఱతెంచు నత్యుగ్ర, పాపమునకు నరకకూపమునకు. 213

చ. కడపక నీవు నాపలుకుఁ గాదని వేదనిసర్గమార్గమం
దడిగెదవేని మేనియడియాసఁ దొఱంగి లతాంగి ప్రాణముల్
విడిచెద నీవుచూడ నలవేపడిఁ బాపములోన దీనిలో
విడిదలగాక వేకలఁచి వేచెడి దెయ్యది చూచితో మ్మనన్. 214

శా. ఆఘోరోక్తులు వీనులం బడిన నాహా పుట్టిరాపట్టిని
ర్మోఘం బీయనమాట తుచ్ఛదురితంబు ల్ధర్మకర్మక్రియా
శ్లాఘ న్మాన్చుకొనంగవచ్చుఁ దుదిఁ ద్రైశ్యంబోనియాబ్రహ్మహ
త్యాఘం జెమిటఁబాయు నాకొకయుపాయం బెద్ది యీచేఁతకున్. 215

క. కులగోత్రశీలములకు, న్వెలియైనం దగు మహోగ్రవిప్రప్రాణా
నిలవిచ్యుతి కే నొప్పం, గలదానసె యింతకంటెఁ గలుషము గలదే. 216

క. అనుచితకార్యము లేమే, నొనరించినయత్న మొప్ప నుత్తమజను లా
ర్తుని విప్రుని విధ్వస్తా, త్ముని నెప్పుడు సంతరింపుదురు మేలగుటన్. 217

ఉ. కావున నొండుపాయములుగావు మహీసురరక్షణంబ మే
లై విలసిల్లు నేమితెఱఁగైనను మంచిదె యంచు బుద్ధిలో
భావనఁజేసి యచ్చెలువ పల్కె ధరాసుర రెండుజాలలో
నీవది కేగుదెంతు సరణిం జలియింపకయుండు మిత్తఱిన్. 218

వ. అని యతండు విశ్వసించినట్టుగా నందులకుఁ గొన్నిశపథంబులం బలికి యక్కలికి నగరి కరుగుచు నపరాహ్ణగతుం డగుగగనమణి నాలోకించి కీర్తించి కరంబు లురో జాగ్రంబులఁ గీలించి యిట్లనియె. 219

క. ఓలోకమిత్ర యొకరు, ణాలయ నీకులముదాన నవనీసుర దు
శ్శీలంబు మాన్చి యిట నా, యీలువు చెడకుండఁ బ్రోవవే నేఁ డనుచున్. 220

క. చేరఁ జనుదెంచి యలసర, సీరుహహితుఁ డబల యట్లచేయుదు చింతా
భారంబుఁ ద్రోఁచి కదలు మ, గారమునకు ననుచుఁ బఱచె గగనంబునకున్. 221

వ. ఆసమయంబున. 222

చ. ఇనుఁడు వసూర్ధ్వతుం డరయ నెవ్వఁడు వానికి నీతిలేదు వీఁ
డినుఁడు వసూర్ధ్వతుండు నయమెయ్యది తద్బిసినీదివారతిం
దనిసి ప్రదోషకాలమునఁ దానిదె వారుణి నానియున్నవాఁ
డని యలుకంబలె న్మరలె నా నడచెం దగ ఛాయ ప్రాచికిన్. 223

సీ. ఇవి చెందిరికచీరలవుఁగదా తిగిచినచ్చెలఁబోసి కటులఁ గీల్కొలుపవచ్చు
నివి కుంకుమరసంబులవుఁగదా గబ్బిగుబ్బలజొకటంబుగా నలఁదవచ్చు
నివి చెంగలువసెజ్జలవుఁగదా కౌఁగిళ్లఁ బ్రియులుండ మెఱసి నిద్రింపవచ్చు
నివి చిగిర్చినమావులవుగదా కటికివేసవులనీడలఁ గ్రీడ సలుపవచ్చు
తే. నివి సరోజాతరాగంబులవుగదా బె,డంగడరుపేటికలఁ బెట్టి డాపవచ్చు
ననుచు వరుణావరోధకామినులుపలుక, నస్తగిరిఁ బ్రాఁకె జరఠారుణాతపములు. 224
మ. తనచిత్తంబునఁ బద్మినిం బవలుపొంద న్వారుణీకేళికిం
జనఁ బైకొన్నప్రదోషపీడకు వహించ న్నేర్చి నింకెట్లుగా
దనువో మంగలవాఁడనంచు భృగుపాత్రప్రీతి నేతెంచెనో
యన సేవించె సరోజబాంధవుఁడు ప్రత్యగ్భూమిభృత్కూటముణ్. 225
తే. అపరపర్వతశిఖరసింహాసనమున, గొంతదడవుండె గ్రహరాజు గ్రుంకుటుడిగి
సమయరమ మజ్జనంబాడి సాగరంబు, దండనుంచిన కుంకుమపిండ మనఁగ. 226
చ. కఠటనిషక్తఖర్జు వడఁగం జిరగర్వసమగ్రమంజన
ద్విరదము పాయుతన్మదస్రుతిం బొడుకెక్కినయ స్తసానువం
దరదముఁ జారఁ బైనడుగు లానక యుర్వికి డిగ్గు నుద్ధత
త్వర ననఁ గ్రుంకె భానుఁ డవధాననికుంచితభానుహస్తుఁడై. 227
సీ. పరిపక్వబింబవిభ్రాంతి దవ్వులరాజకీరడింభములు గ్రుక్కిళ్ళుమ్రింగఁ
బ్రత్యగ్రశోణితభ్రమ నుపస్థితములై పంచాననంబుల బయలునాక
పల్లకీపల్లవచ్ఛదనశంక సగంధకరులు రిత్తరిత్త కరములాఁపఁ
బుంజీకృతక్రవ్యబుద్ధి నిర్ఘరవృద్ధశార్దూలములు నోళ్ళుచప్పరింప
తే. గైరికద్రవవిచికిత్స గాన నాట, పాటలోష్ఠులు పాలిండ్లఁ బ్రామఁ దివురఁ
బ్రత్యగవనీధరంబునఁ బ్రాకుడెంచె, నపుడు దివసావసానసంధ్యామరీచి. 228
తే. చరమదశఁ గన్నవాసరస్వామిఁదలఁచి, తమ్ము లామోద మఱివంతఁ దలఁకుచుండ
నస్తముపగోత్ర మయ్యురాగాప్తిఁబొదలె, మొదలఁ బాశ్చాత్యకృత్యమట్టిదయకాదె.
తే. సద్ద్విజశ్రేణి దివసావసానవేళ, చలువఁదేరు వనప్రదేశములఁజేరి
కన్నులరమోడ్చి విస్పష్టగతులుమీఱ, నారవవ్యాజమున జపం బాచరించె. 230
సీ. తావులకొండసెత్తము డిగ్గి చెంగల్వదోనల చల్లనినీటఁ దొప్పదోఁగి
పరిగొన్నపచ్చకప్రపుదుమారముకేచి తరుణపల్లవపరంపరఁ దెరల్చి
వికసితప్రసవజాలకరేణువులవంటిగంధసంపద దేటిగములఁ బ్రోచి
బలిమి గాననపరంపరల నుఱ్ఱుటలూచి తీవపందిళ్ళలోఁ దిరిగితిరిగి
తే. యొండ పొడదూరక పగళ్లనిర్లుగపయు, తియ్యమావులక్రేనీడఁ దెరువుసాగ

కల్లనల్లనఁ జనుదెంచె నతనుభద్ర, వారణంబన సాయంసమీరణంబు. 231

చ. సరసులసంగతిం గలుగుచక్కనితమ్ములఁ జేరఁబోయి క
న్నరమొగిడించి వ్రాల్చుచిగురాకులడగ్గతిఁ బత్త్రము ల్నిశా
కరదృపదోషముల్ గదిసి కప్పుపడం బరిముక్తవృంతకే
సరములఁ జెంది కందునొకజక్కవ దారవియోగవేదనన్. 232

సీ. నిండారుకమ్మదేనియ మజ్జనంబాడి కడిమిపుప్పొడివస్త్రె మడుగుఁగట్టి
రేకుగన్నుల జంచరీకాంజనముఁ జేర్చి తనూవల్లి ఫేనచందనముఁ బూసి
తులలేనితూఁడుజేతుల నూర్మికలు దాల్చి జలకణముక్తికచ్ఛటలఁ బూని
మొగ్గపాలిండ్ల సొంపున హిమాంబువుఁ నుంచి యామోదసంపద నతిశయిల్లి
తే. హంసకంబుల నిజపదం బలవరించి, భువనమోహన మైనవైభవముఁ గాంచి
కలువవిరిబోఁడి రాజురాకడ దలంచి, పొలిచె వాసకసజ్జికాస్ఫురణ నపుడు. 233

తే. ఝుంకృతివ్యాజమున హాళిసన్నుతాళి, యూఱడింపఁగఁ దనకన్నవారిలోన
ననవధిక్లాంతిమిత్త్రమోహార్తిఖిన్న, తమ్మికొమరాలు పత్త్రనేత్త్రములు మోడ్చె.

సీ. కనలుసంధ్యార్చిఁ జేర్చిననభఃకరిమేన బుటములెత్తినసీరుబొబ్బలనఁగఁ
గాలమాంత్రికుఁ డంధకారదానవబలిక్రియకు దాల్చినపేలగింజలనఁగ
దాండవభ్రమిఖమూర్ధజకుఁ డంజలిపుటంబున విధిర్చినకమ్మపూవులనఁగ
మైరవసింధుసంపర్కశర్కరదేవమును లొనర్చినలింగమూర్తులనఁగ
తే. గమలగర్భాండగోస్తనీకాయమాన, జటిలపరిపక్వఫలగుళుచ్ఛములనంగ
నఖిలజనలోచనోత్సవం బాచరించెఁ, దామరసవైరికులదారతారకములు 235

ఉ. స్నేహవిరక్తిఁ గాలగతిచేఁ గని మిత్త్రుఁడు చామగక్రియా
మోహతుఁ డౌటఁ గన్గొని ప్రమోదవిధిం దనుఁ జేర నీగురు
ద్రోహి శశాంకుఁ డెట్లనక దోయనిపూనినశక్రదిగ్గ
న్మోహినిమోము విన్నఁదనమో యనఁ బాండిమదోఁచె నెయ్యెడన్. 236

సీ. బలభిద్దిశావశాప్రతిమగామినిముద్దుగులుకుటీరికనవ్వ తెలివిచెప్పె
యుదయమస్తక్రీడ నూడికోలులుమోవఁ గూలినచౌదంతికొమ్ముఁబోలి
గగనవాహినిరొంపి గాడికొండొకదోఁచు కమలాపుత్రధరథాంగంబు దొరసి
కాలకాపాలికాగ్రణికరంబున నెత్తిచూచు క్రొన్నెమలీకసురటి నొరసి
తే. యంచు గనుపట్టి మఱియించుకంత మెఱసి, సగముపర్యాయకమునసాక్షాత్కరించి
బింబమంతయు వెలికి దీపింప నిలిచెఁ, జదలఁ బూర్ణకళాసీమ చందమామ. 237

సీ. అది సుధాకరబింబమా కాదు మదికొనువన్నెవేలుపుటన్నవత్తిగాని
యది చంద్రమండలంబా కాదు చదలేటఁ దేలుదంతపుటరిగోలుగాని

యది నిండుచలివెలుంగా కాదు మబ్బుటేనుఁగుఁదోలు తెఱనోటి మొగము గాని
యది చకోరములవిందా కాదు దుగ్ధాబ్ధికడ జనించిన వెన్నకరుడు గాని
తే. యది నిశామిత్రమా కాదు మదవియుక్త, యువఘరట్టశిలావలయంబు గాని
యని జను ల్ప్రాచి కీర్తింప నతిశయిల్లెఁ, బ్రోడజాబిలికలువపూఁబోడికలిమి 238

సీ. ఇనకరాంకురములు కెడయీనిమ్రానిక్రీనీడజాడల డొంకి నిలిచెఁ గొన్ని
మధురసప్రస్నిగ్ధమాక్షికచ్ఛత్రభాగములలో గవులలో నడఁగెఁ గొన్ని
కలనైనవిఱుగెఱుంగనిపోటుపరికరాచూరుకత్తులమాటు జొచ్చెఁ గొన్ని
చేసేఁతబడి తలంచినలేను బంతి యన్నలుపకొమ్మలదాడిఁ బఱచెఁ గొన్ని
తే. త్రాసమునఁ బొంది పద్ధతి భ్రంశనముల, గూపకుహరాంతరంబులఁ గూడెఁ గొన్ని
యిరులు తప్పురు లన నప్పుడేమిచెప్ప, రాజు బరచక్రహరణసంరంభుఁ జూచి 239

సీ. ప్రాయమింకినవాలుపాలిండ్లవేఁయాండ్రు పదుపుపుట్టక మూలఁబడి కృశింప
నేపురేగినరండ్లు తెలిదీఁగబోఁడులు వింతకౌఁగిలిలేక వెతలఁ బొందఁ
గడిపోనితెరనాటకపుటూరుజంగాలు కేళికల్ గూడ కోఁగిరము లెత్త
తడక ప్రోపరిముచ్చుపొఁగువులు మఱి దొంగపనిచుక్కవాలైనఁబస్తుపొరల
తే. గంటవేఁటల దిరుగాడుకఱపటెఱుకు, మూఁక వెఱజిక్కుకాళ్ళు మోములును వావఁ
బిండిచల్లినచందానఁ బేదవారి, దివియువెన్నెల సాంద్రదీధితి వహించె. 240

సీ. చేఁపువుట్టినగభస్తికలు ముక్కులఁ గ్రుచ్చి త్రచ్చి యూఁతటలేక క్రోలుఁ గొన్ని
యత్తులానఁగఁ ద్రావి యసుమరుచ్చరణకుఁ జోటుచాలక నేలఁ జూచుఁ గొన్ని
కడుసిగ్గుచేరుతొల్పడుపుదోమటఁ జొక్కి యానందమున జిందులాడుఁ గొన్ని
నిగరంపుమోవితేనియలతోన దొరల్చి చెలువలిచ్చిన సంతసించుఁ గొన్ని
తే. యొలనులఁడాఁగి తలచూపనోడి తల్లడించు నరికోటిపైఁ బుక్కిలించి యుమిసి
బయలుఁబట్టించి పేరెము ల్వాఱుఁగొన్ని, కైరవాప్తాతపములఁ జకోరకములు. 241

వ. ఆసమయంబున. 242

సీ. కట్టినజినుగుసిర్కావిధోవతి పింజయాపార్ష్ణిలంబిరై యతిశయిల్ల
ఘాతోత్తరీయవస్త్రములోను శుభ్రశుభ్రంబులై బ్రహ్మసూత్రములు మెఱయఁ
గనకవిరుద్గ్రంధికలు కపోవాలావాలసీమ బచ్చనిడాలు చివురువెట్ట
నామోదరసపుష్టి నచ్ఛిద్రమై ఫాలతలమున గోపిచందనము గ్రాల
తే. నవటుతటఖేలనంబున నమురుబిళ్ళ, సికచోకాటంబువిరులతోఁ జెలిమిసేయ
నడుమ జగజంపుదోఁపుఁబచ్చడము దనర, వైదికబ్రాహ్మణుఁడు నిండువన్నె మెఱసె.
తే. క్రముకభంగపఠంషరాకలితముఖున, వన్నెతీకత్తిమేఖలావల్లి నిఱికి

యాకు లక్షించి యలబలం బడఁగు టరసి, యునికివెలుపడి బ్రాహ్మణుం డొక్కరుండు.

ఉ. అప్పు డధిజ్యచాపధరుఁడై మరుఁ డేర్పడి వెంటనంటి రాఁ
జొప్పున జాలిమాలి యఘుహూరుఁడు పాఱుఁడు వచ్చివచ్చి యా
యొప్పులకుప్పరామికి నయో విధియం చుదితాశ్రుధారలం
గప్పఁగ మోమునిశ్వసనకంపితచారుతరాధరోష్ఠుఁడై. 245

క. చెదరెడిమేనును జెమ్మట, గదిసినకెంగేలు గ్రాలఁగా విప్రుఁడు లే
నిదురెఱుఁగనికంటంబడి, వడియగుమయమంట మంటపంబున నుండెన్. 246

ఆ. చీమ చిటుకుమన్నఁ జిమ్మెట బుఱ్ఱన్న, నెదురమూషకములు మెదలుకొనిన
నిదురలేక భూమి నిర్జరుం డాలించు, నప్పు డబలకాలిచప్పు డనుచు. 247

క. రా దాయెఁ జూచితే యను, రాదా యడ్డంకిబట్టి రాదను నిర్మ
ర్యాదలు సీమంతినులను, హా దైవము ప్రొద్దుపోయె నని తలయూఁచున్. 248

క. ఎదురుకొన నలిగి చాయకు, గదలుతలారులకు వెఱచి క్రమ్మరు నేన
మ్మదవతికి నేలదాదులు, పొదివికొన న్నిదురపోయెఁ బొమ్మని పలుకున్. 249

వ. ఇట్లు మోహానలంబున దేహంబు విదాహింప నయ్యుర్వీగీర్వాణుండు చలితవినో
గ్రప్రాణుం డగుపంచబాణుం దలంచి. 250

మ. ద్విజరాజుం దలదాల్చుకొన్నతనిదృగ్దప్లుష్టిప్రభూతాగ్నులన్
రజమై పోయిననిన్ను నీతిరసదూరా మార యాకేవల
ద్విజరా జల్గిన నేమిసేయునొ ప్రశాంతిం గాంతి పత్స్నాయక
వ్రజముం గూర్పకు నారి నారి ననుఁగూర్పం దేర్పఁ బుణ్యంబగున్. 251

చ. శివ గణనాయకా యనిన శీఘ్రమె కార్యము లడ్డపాటులే
కవు యదునాథపంచవిశిఖా యన హస్తపదాస్థికాండముల్
చివికెడునట్టినొప్పు లొడిసె రసపొక్కులు గంట్లు బిబ్బపుం
డ్లవు నిటువంటిపుత్త్రుఁ దగవా కన నమ్మధుకైటభారికిన్. 252

వ. అని పనివి పనివి యనంగబాణమూర్ఛితుండుంబోలె నమ్మంయుండు నిద్రాముద్రా
లోచనుం డయ్యె నయ్యవసరంబున. 253

క. ఆనిశ ధరణీసురునకుఁ, దా నిచ్చినమాటపట్టుదలఁచి తదీయ
స్థానీయపాలవీక్షా, దీనాకృతిగాక నగ రతిత్వర వెడలెన్. 254

క. జలధరమాలికలోపలి, తొలుకార్మెఱుఁగనఁగ యమవిధుంతుదహాలా
హాలకాచమేచకద్యుతి, గలనీలాంబరము ముసుఁగుగాఁ గైకొనుచున్. 255

క. పరివృత్తకంధరయై దిశ, లరయుచు నడ దడబడంగ నరుదెంచి ధరా
సురు నిద్రపోయెదే యని, కరసంజ్ఞం దెలుప మేలుకని వాఁ డంతన్. 256

వ. ఆదిత్యనోదితుండై క్రోధించి. 257

శా. అయ్యో నేఁడిట కేఁగుదెంతునని నీ కాశించి యిచ్చోట గ
న్నుయ్యాంజాలక నిద్రగాచి యిపు డేమోహార్తి న్నాతనుజా
లయ్యె న్నాలవజాముఁజొచ్చె దడవాయ న్వచ్చి విచ్చేయునీ
సయ్యాటం బిఁకఁజాలు రోసితి ననుష్ఠానార్థినై పోయెదన్. 258

చ. కడువడి రెండుజాము లగుగం బరిరంభణ మీఁదలంచి నీ
కడ కరుదెంతు రానిపనిగల్గిన నాఁటికిఁ దండ్రిఁ గాశిలోఁ
బొడిచిన క్రూరకర్మునఁ బోవుదు నంటివి నూనృతంబు నీ
కొడుకయిపోయె రాక కిదిగో గురులింపఁజిరాత్రిపాపముల్. 259

క. కడుసరసములకుఁ బ్రొద్దై, క్కుడిది దురంతోపగూహగతులకుఁ బ్రొద్దె
క్కుడిది రెయికసెలవు సేసితె, కడజామున వచ్చి చాల్పోకాలుకుబుద్ధిన్. 260

ఆ. కొదవలేక రతుల గోవాపుఁగోడెనై, పొదలఁ బెద్దతడవు ప్రొద్దులేదు
నొరసి తెడ్డు నాఁకి యుపవాసకర్మంబు, చెలుదుకొనఁగ దీనిచేత నేమి 261

క. అని చిందరేఁగిన ట్లచ్చెనఁటిభరాసురుఁడు చెంతఁ జేపడినిధి
న్నని గాలఁ దన్ని చనుగతి, ఘనజఘనంబాసి యుబ్బగాఁడుగఁబోయెన్. 262

క. చనఁ దనకు మనసువచ్చిన, పని యది గా కునికిఁ దీరఁ బట్టక చనుఁగా
కని యూరకుండె నట్లుండి నరాధిపకన్య దనదు డెందములోనన్. 263

క. సరిప్రొద్దున నరుదెంచితి, నరుణోదయసమయ మెట్టులయ్యె దురంత
స్మరమాయాంధుఁడు గావున, నరరే విప్రుండు తుర్యయామం బనియెన్. 264

క. కామాంధోపి నపశ్యతి, నా మును నే విన్నదాననకదా వెలఁగే
లా మందునిమాటలకని, యాముద్దుగుమ్మ మందహాసముఁ దాల్చెన్. 265

క. నానీరచగాగ్రణి బహు, మానుస కిట్లనిరెయి నట్లు మహీసురుఁ డన్య
స్థానస్థుఁ డయినపిమ్మట, నా నెలఁతుక యేమిసేసె ననఁ గపి పలికెన్. 266

క. మహిసురుఁ డట్లరిగిన న, మ్మహిళారత్నంబు తోడసుమాలితి నని దు
స్సహరయమున భయమున నిజ, గృహమునకుం బోవఁ దత్తరింపఁగ నంతన్. 267

చ. వనదసమృద్ధి నీలికడవంబలె నంబరమొప్పఁ జంచలల్
మినమినలీన దోన నుటిమె న్వడి గండులు వ్రాలె వ్రాలెఁ దొ
ల్పినుకును దూర్పుఁటీదరొలసెం బలసెం జడివానసోనవో
రనఁ బురవిద్విషద్గళసహస్రభవాకృతిఁ బర్వెఁ జీఁకటుల్. 268

క. ఇది రాయితప్ప పల్లం, బిది మిట్టిది మాకుమట్ట యిది పామిది గా
మిది యని వివరింపఁగఁ బె, ట్టిదమై యొప్పెసఁగు నక్కటికిచీఁకటిలోన్. 269

చ. సుడినడి యింటిత్రోవయనుచుం బెరచొప్పునఁ బోయిపోయి య
ప్పడఁతి దృషద్వతీసరిదుపాంతదురంతవనాంతరంబులం
బడి ములుదీవలుం దవిలి భంగములై కురులుం దుకూలముం
దొడిపినకంచుకం బెడలఁ దొట్టినభీతి నొడల్వడంకఁగాన్. 270

క. ఈరము లూఱట నొందక, దూఱుచు నో రలయ నలువ దూఱుచు రొంపిం
జాఱుచు నెంతేవెలవెలఁ, జాఱుచు రాజన్యకన్య పఱచి యలంతన్. 271

శా. ఆయుగ్రాటవి నొక్కచోట భయదంబై తోఁచురత్తోవట
చ్ఛాయం బీనుఁగుఁ ద్రొక్కి కోమలకరాబ్జాతంబునం బట్టి య
య్యో యీమానవుఁ డెవ్వఁడొక్కొ మృతికేమోహేతు వందు న్విచా
రాయత్తం బగునాత్మఁ బోఁ దెరువులే కచ్చోటఁ దా నున్నెడన్. 272

క. ఆవటమునఁ ద్రింశద్వ, ర్షావధిగా నున్నభూసురాసురుఁడు విశా
లావరపుత్త్రికి హితసం, భావన సాక్షాత్కరించి పలికెం బ్రీతిన్. 273

క. మనుజులు మిట్టాడని యీ, ఘనగహనంబున నిశీథకాలమునం జ
చ్చినవరుచక్కటి తెక్కటిఁ, దనుమధ్యా సంచరించెదవు నిశ్శంకన్. 274

తే. ముంచు కన్నీరు వంచున మోముదమ్మి, వాడియున్నది దీర్ఘనిశ్వాసనిహతిఁ
దల్లడిల్లెడునధరోష్ఠపల్లవంబు, ఇంతవలవంత నన్న నీ వెవ్వరనుచు. 275

క. అనుమానింపక తనుభృ, త్తనువిసర వపారసప్రదానవిధాన
స్వనదుల్ముకంబు వదనం,బున ద్రిప్పపలాశి కిందుముఖి యిట్లనియెన్. 276

క. వినయవిశాల విశాలా, వనిపాలునిపుత్త్రి దైవవశమున నస్మ
జ్జననీజనకుల జనకుల, వినతులపా త్తెడసి యాటవికసతి యయితిన్. 277

శా. ఏ నిత్సేరుట యెట్లు లీపడినవాఁ డెవ్వాఁడు వర్షాతమః
ప్రానఃపున్యముఁ దెల్పునల్పచపలాప్రత్యగ్గు లాలోకముల్
మేనభ్రంలిహ ముగ్రమృత్యుముఖగంభీరంబునో రవ్వర
య్యా నిన్జూచిన గుండె ఝల్లురనుఁ దథ్యం బానతీవే యనన్. 278

మ. అతఁ డత్యంతతమప్రసన్నహృదయుండై పల్కె నే నంచిత
శ్రుతిసంపన్నుఁడ బ్రహ్మరాక్షసుఁడ నిచ్చోఁ గాపురం బుండుదున్
మతి భీతిల్లకు నీకు నొజ్జ లితఁ డమ్మా నీకు నేకారి యీ
క్షితిజచ్ఛాయమనోజబాణహతి నొచ్చె న్నాట లింకేటికిన్. 279

క. గురుఁడ నిది శిష్యురా, లీతపణీమణి గనయ దుష్కృతం బని మదిలో
నరసి యెఱుంగనియీదృశ, నరపశువుల మేలుపొందు నాయెందైనన్. 280

. సూరిశ్రేష్ఠునకు వరా, చారగరిష్ఠునకు నీకు సద్విప్రా యీ
ఘోరనిశాచరవేషం, బేరూపునఁ గలిగె ననిన నెఱిఁగింతుఁ జెలీ. 281

. మొదల గౌశాంబి నుండుదు వేదశాస్త్రార్థచతురుండ నాపేరు చండశర్మ
కులకాంత శాంత యచ్చెలువతమ్ముఁడు మూలఘటకాంకుఁడతఁడొక్క కన్యఁ బెండ్లి
గాఁబోవుటయు గోడిగములకు నేనును బనిబూని యటువాని ననుసరించి
యతిసభ్యునట్లు పోయితిఁ బోవ నను బెండ్లిపెద్దగాఁ దలఁచి యాబిడ్డతండ్రి
తే. కదిసి యల్లునిగుణరూపగౌరవములు, వేఁడుటయు నావివేకంబు వీటిఁబోవ
నవగుణంబులప్రోవు మూఢాత్ముఁ డంటి, ననిన నమ్మాట లతఁడు సత్యములఁ జేసి. 282

. కాతాళంబున నిచ్చిన, కూఁతు నతం డీక వెడలఁగొట్టిన నపుడా
చేతను నాహృదయం బు,ద్భూతలఁ బ్రేంఖోళనప్రయోజన మానెన్. 283

. మఱఁది యని యుబుసుపోకల, నెఱుఁగక యిట్లాడి లోకు లెగ్గింపం దెం
పరినై కూడినపెండిలిఁ, జెఱిచితి నాకన్నఁ గష్టశీలుఁడు గలఁడే. 284

. ఈయుగ్రాఘం బేమిటఁ, బాయు నయో హృత్ప్రతీపపరితాపశిఖిం
గాయము వేఁగెడునని వల,చేయి కపోలమునఁ జేర్చి చింతిలుచుంటిన్. 285

చ. అగణితధర్మకర్మరతుఁ డంచట మున్నరుదెంచియున్నవాఁ
డగుట మనుగ్రకృత్య మవు డారసి ముద్గలనామతైర్థికుం
డగలక నన్నుఁజూచి కుటిలాత్మ కళత్రసహోదరు న్మహా
సుగుణధురీణుఁగానిమనుజుండని యూరక పల్కెఁబోలునే. 286

ఆ. వేయుబొంకి పెండ్లిసేయుదు రత్తఱి, జను లతిప్రయాసమునకు నోర్చి
చెనఁటిసేఁత నిట్లు మనువులఁ జెఱిచిన, విసపువిత్తుఁ జెప్ప వినముగాని. 287

ఉ. మోఘముగాక నీవు తలమోచియొనర్చినయట్టియిద్ధరం
తాఘము నేఁడు పిల్లికొలలై చరణంబులఁ బ్రాఁకుసజ్జన
శ్లాఘనయోగ్యభూమిసురజన్మము వీడ్కొని కానలో గ్రశా
ఖాఘనవృత్తవర్తివయి క్రాలునిశాచరవేష మేర్పడన్. 28

ఉ. వంకరకట్టెకింగలము వైద్యము నీకిది వోలునంచు ని
శ్శంకనవృత్తి ముద్గలుఁడు శాపము నిచ్చిన శోకబాష్పధా
రాంకితనేత్రపంకజుఁడనై చరణంబుల వ్రాలి యోదయా
లంకృతచిత్త యోబుధకళానిధి యోగుణధుర్య కావవే. 289

చ. అనుఁగుమఱందిగానఁ బరిహాసపురస్సరభాషలాడ నీ
పనిజనియించె నీచరణపంకరుహంబులు సాక్షిగా మదిం

గనలు వహించి యిట్టికొఱగాని ప్రయోజన మాచరింప నీ
యనుపమదివ్యదృష్టి కొకఁ దగ్గమె చూడుము నేర్పునేరముల్. 290

క. అని యేను మేను వడఁక, వ్వనితాజనతార్తిఁ బొగల వారించి ప్రబో
ధనిరీక్షణములసర్వముఁ, గనుఁగొని యితఁ డనపరాధిగా యని శాంతిన్. 291

వ. ముద్గలుండు న న్నాలోకించి యిట్లనియె. 292

చ. కెలసముఁ బూని పెండ్లిపనికిం బ్రతికూలుఁడ వైతి విట్లు మొ
క్కల మిదిగాదె నీమన సకల్మష మానటులైనఁ గేరడం
బుల కిది చోటె మోఘమయిపోవదు నావచనంబు గన్నచా
యల నిఁక బ్రహ్మరాక్షసుఁడవై యిల నీవు చరింపుచుండఁగన్. 293

ఉ. అల్లినవంతమూలఘటకాంకుఁడు భూమినిలింపకన్యకా
హల్లకభల్లభగ్నహృదయస్థలుఁడై తను వుజ్జగించి మ
త్పిల్లన నుద్భవించుజయసేనుఁడు నా నవవిప్రకన్య యు
త్ఫుల్లసరోజనేత్ర ప్రియపుత్రిక యై పొడము న్సుకీర్తికిన్. 294

ఉ. ఆయెలనాగ దైవగతి నర్ధనిశం గతిదప్పి నీతరు
చ్ఛాయకు వచ్చు నాసరసిజచ్ఛదనేత్రకు నవ్వసుంధరా
నాయకసూతికిం దగులొనర్పుము సంశయ మేది యంతలోఁ
బాయుమహీసురాసురత బ్రహ్మపదంబు భజింతు పిమ్మటన్. 295

మ. అని శాపావధిఁ జెప్పి ముద్గలుఁడు పోవం బోవ నాలోన నె
త్తిని గ్రుడ్లుం గులిశంబులుం దెగడుకోఱల్వాఁడబనూఘర్జితా
ననముం జుంజురువెండ్రుకల్భయదకర్ణద్వంద్వముం గల్గి మే
దినికి న్వేఁగుగ బ్రహ్మరాక్షసుఁడ నైతిం జంచరీకాలకా. 296

వ. అట్లుర్వీపూర్వగీర్వాణుండనై సకలప్రాణిభక్షణంబున నాత్మంభర్యంబు ప్రవర్తిల్ల
నివ్వటవి నాశ్రయించి యుండితి నిప్పటికి ముప్పదిసంవత్సరంబులు గడచె నమ్ముద్గ
లుండు చెప్పినట్లు నామఱంది జయసేనుండై పుట్టె నవ్విప్రకన్యకవు నీవు నిన్నన్నర
నాథకుమారునకుం బరిణయంబు సేసి యాసురం బగు నివ్వేషం బపనయించెద
ననుటయు నలరు మొగంబున రాజన్యకన్య భూసురాసురున కిట్లనియె 297

క. ఇచ్చోట నానిమిత్తము, వచ్చిన యవ్విప్రు సుప్రసన్నత్వము నేఁ
డచ్చుపడ మనిచి పురికిం, బుచ్చి జగద్వినుతకీర్తిఁ బొగడొందఁగదే. 298

క. భూసురహత్యాఘమహా, త్రాసమునకు వెఱతునని పదంబులఁ బడి గా
ఢాసక్తిం బ్రార్థించిన, నాసురకులశాత్రవుఁడు దయాభిముఖుండై. 299

ఉ. ఆవిరతీవబోఁడికృప కద్భుతమంది భవన్నియోగ మే
లాపృథయా ఫలింపక బలాయబలా యని విప్రుఁగొంచు ర
క్షోవిభుఁడేగి పీనుఁగున సుప్రదతీర్థమునం దొరల్చి సం
జీవితుఁ జేసి మందిరముఁ జేర్చి భజించి కుమారి కిట్లనున్. 300

క. చనిపోయిన నీయొజ్జలు, మనుగడఁ గనిరయి న్వసించె మందిరమున నో
తనుమధ్య మొఁగిడించిన, కనుఁగవతో నిలువు రాజుకడ నినుఁజేర్తున్. 301

చ. వలదు విలంబ మన్నఁ బ్రతివాక్యము లాడక మోడ్పుకంటితో
నిలిచిన బ్రహ్మరాక్షసుఁడు నిర్భరవేగధురాధురీణుఁడై
పొలఁతుక నప్పు డెత్తుకొనిపోయి మనోజవుఁ డొట నిల్పెఁ బా
టలనగరోపకంఠనిబిడద్రుమకాంచనసౌధవీథికన్. 302

వ. ఆసమయంబున. 303

శా. గొందు ల్వీడొక్కని పక్కణాంతరకుటీకూటాధ్వసంధు ల్వరా
స్కందు ల్పాడ నవక్రచక్రములు మచ్చ ట్లాడ నిచ్ఛాభరిన్
గ్రిందు ల్మీఁదులుగా సతీపతులు గౌఁగిళ్ళాడ దీప్త ల్దిశ
ల్పొందుల్ గూడఁ ద్రిభంగిభంగి మొఱసెం బుంస్కుక్కుటవ్రాతముల్. 304

చ. అతికృతికన్య నందినమురారివిరాజదనంతభోగసం
స్థితి ప్రతివారముం బొదల శిష్యులు పుణ్యజను ల్జయక్రియో
న్నతులు దురంతశాస్త్రకలనం బ్రతివాదుల నోర్వ సర్వతో
గతమతికుండు నిల్పెఁ గవికౌశికదిక్కటకాగ్రపీఠికన్. 305

చ. పరవసులక్ష్మి నుల్లసిలువారికి నేమిగొఱంత యీవిభా
కరునకు సంజనిచ్చి తిరుగంబడి లక్ష్మి హరింప నెట్టివో
నెరవులసొమ్ము సత్యమగు నే యని వెల్వలనయ్యె నహ్నినాఁ
బరిగళితద్యుతి న్వెలఁబాఱె నిశాంతనిశాంతదీపముల్. 306

చ. కనుఁగొని చైత్యనిత్యపథికప్రవిబోధకరంబులై ఖగ
స్వనము లుదగ్రబాహ్యవనవాటికల న్వినవయ్యె నయ్యెడన్
ఘనమదభృత్తమఃకరటికంపితదిగ్విటపస్ఫురన్నభో
వనరుహసంకురత్కుసుమవర్షముచాడ్పున జాఱెఁ జుక్కలున్. 307

సీ. ధారాధరస్మయోదయవియచ్చికురబంధమునఁ దారాలతాంతములు రాలె
రోదసీతనుసమారోహాంఘకార్కైణమదవిలేపనరేఖ మసలిపోయెఁ
జక్రవాక స్తనస్థాత్మనీహారఘర్మాంబువు ప్రత్యక్షమై యడంగె
మధుపకజ్జలభాసమానకైరవలోచనముల నిద్రాముద్ర ననలుపెట్టె

తే. మలయనిలయసుగంధసంబంధమంద, పవననిశ్వాసవీచిక ల్బొరుదీర
సంప్రభూతకళాతమ్యసౌమ్యగమ్య, గంగసంగశ్రమాయామయామవతికి. 308

చ. తగఁ గుసుమాస్త్రకేళి దిగఁదన్నినచీరలు గౌఁగిలింతలుం
బగఁగొని యడ్డగింపఁగఁ దెమల్చినహారములు న్భరంబునన్
దిగిచినసొమ్ములు న్మదవతీతిలకంబులచేత వేఁకువ
న్మగుడ సపర్యఁ గైకొనిరొ మాన్యులు గారె గుణప్రదీపకుల్. 309

చ. కవసి కవుంగిలింప నవకాశము చాలక ప్రొద్దుఁజూచి లోఁ
జివికెడువారు హస్తములఁజీవితనాథుల గ్రుచ్చిపట్టి వే
గవరులమోవులాని యరగన్నిడువారును శయ్యలం బరా
భవ మొనరింపలేక ఐగపాల్పడువారును సైరి జవ్వనుల్. 310

శా. నానాదీపమరీచికల్ గొనిరొనో నాఁ జూడ నిద్రాపరా
ధీనస్త్రీనయనంబులం బ్రియదృఢాశ్లేషప్రవృద్ధిభవ
న్నీనాత్మీకుచము ల్దగం గనికరామ్రేడీకృతోత్క్రాంతకాం
తానుష్ఠాధరము ల్జపాసుషమ చెన్నారె న్నిశాంతంబునన్. 311

మ. తులనప్రేమరసోల్లసన్మిథునచేతోజాతసంగ్రామకాం
క్షలవారించె నుషఃప్రసూచకగతుల్ శాలాజరద్దీపికా
కళికల్ శైత్యదృఢస్తనస్తబకముక్తాహారము ల్వాసనల్
గలయం జల్లెడుపూఁత లిప్తరుచికృత్కర్పూరతాంబూలముల్. 312

సీ. శ్రమవార్నిమజ్జనజటిలాలకంబులు సంధూతకుంకుమస్థాసకములు
జాగరారుణితలోచనసరోజంబులు కాంతచుంబననుత్తకజ్జలములు
కరచపేటనిరస్తకరినక్రచిత్రంబు లభినవదిగలంకృతాధరములు
సృణినమత్కరికాభరణభృద్గళంబు లనూననిద్రాముద్రితాననములు
తే. గాఢపరిరంభసంభ్రమక్లామ్యదచల, గురుపయోధరభరహారకువలమణులు
కలితతాంబూలరసరక్తగల్లతలము, లమరఁ గొమరాండ్రు పొలిచి రహర్ముఖమున.

శా. ఆశాఖడ్గమిళత్తమోమలినహృత్యర్థంబు నిర్వ్యంగ్యసం
ధ్యాశిల్పిప్రభుకల్ప్యమానకురువిందక్షోదసమ్మిశ్రలా
క్షాశాణం బనఁ బ్రాచిదోఁచె బిసినీకాంతుండు జాగ్రత్పురో
దేశాంగారకరాజినాఁగ మొదలం దీండ్రించె సంధ్యాప్రభల్. 314

సీ. ప్రసవితద్యుక్షేత్రఘుసృణసస్యంబులు హల్లకప్రియసాలపల్లవములు
తిమిరేంధనప్రవర్ధితదావశిఖ లుషఃపవనభుగ్వ్రతభోగఫలకమణులు

హరిపురంధ్రీకుసుంభాంబరంబులు ఘనప్రాక్పరివ్రాడ్జటారక్తిమములు
దంభోళిఖండితోదయపక్షరుధిరంబులై రావణాంగసింధూరరజము
తే. ప్రకృతిస్ఫూర్తిప్రమోదకృద్యామినీవి, యోగదవధూమ్యధాతిఖినోష్ణదుశమణి
నవ్యహల్లకతల్పము ల్పాఁ జెలంగె, నంబరంబున నపుడు బాలాతపములు. 315

ఉ. ఇమ్ములఁ బశ్చిమాంబునిధి కేగు నెడం దగ వారక న్మయూ
ఖమ్ముల నెన్నిసంచితముగా నొనరించినవ్రేళ్ళ రక్తిలోఁ
గ్రమ్మఁగఁ బ్రాక్పరిస్ఫురధరవిరమ్ములఁ బద్మినివేగుపాటునం
గ్రమ్మఱ లెక్కఁబెట్టె ననఁగా వికసించె సహస్రపత్రముల్. 316

ఉ. గాసిలి రాజు మన్ననలు గాంచిన నేనొరుఁ జూడనంచు క
న్మూసినభంగిఁ గైరవిణి మోడ్చెఁ బతివ్రతవోలెఁ బద్మినీ
వాసరకృద్వియోగదవవహ్నిసముత్థితధూమరాజులో
నాసరసీజగర్భసదనంబులఁ బాసి నటించె భృంగముల్. 317

తే. ఇట్లు సూర్యోదయంబైన నేకతమున, బ్రహ్మరాక్షసుఁ డద్ధరాపాలుఁ గదిసి
పూర్వవృత్తాంతమంతయుఁ బొసఁగఁ జెప్పి, యజ్ఞముఖిఁ జూపి పెండ్లిగమ్మనుచు నిచ్చె.

వ. ఇచ్చిన. 319

క. ఆగామామణిఁ గైకొని, యారామురుఁ డాదరార్పితాతిథ్యుండై
యారామన్యగ్రోధధ, రారుహసౌధమున బ్రహ్మరాక్షసు నునిచెన్. 320

క. ఉనిచి ప్రణమిల్లి క్రమ్మటి, చని యన్విప్రాసురునకు సరసాన్ననివే
దనవిధికిఁ బుణ్యభూసుర, జనుల నియోగించె జనితసౌహార్దమునన్. 321

ఉ. కూరిమి తండ్రిపాదములకుం బ్రణమిల్లి సుకీర్తికన్య నం
భోరుహలోచన న్భువనమోహినిఁ జూపి ధరామరు న్నిశా
చారుచరిత్ర మేరుపడ సర్వముఁ జెప్పినఁ బుత్రు మెచ్చి యు
ర్వీరమణుండు బంధుపృథివీసురులం బిలిపించి యిట్లనెన్. 322

సీ. ఘనులార మనకు రక్తస్పర్శసంబంధి గాఁడె సుకీర్తి విఖ్యాతమూర్తి
దైవయోగమున నాతనిపుత్రిఁ గాంచనప్రతిమానగాత్రి చేపడియె మనకు
మనజయసేనకుమారున కాపూర్ణశీతాంశుముఖిఁ బెండ్లిసేయవలయు
లాలన నవ్విశాలానామ్నఁ డిచటికి వచ్చినఁ జుట్టంపువరుస గాదె
తే. యాతుల నయమార్గరతుల దండాధిపతుల, ననిచి రప్పింతమా యమ్మహామహంబు
నతఁడు వీక్షించుఁ గాక నన్నాప్తమిత్రు, లుచితమిక్కార్య మొనరింప నొప్పుననిరి.

క. నావిని మన్నీల్లుఁడు హే, లావీక్షితసితికంత్రుల న్మంత్రుల సం
భావించి పనుచుటయు న,ప్పావనమతు లరిగి వినయపాటవ మమరన్. 324

సీ. రోహిణీవిరహాభీయక్షపాకరబింబ మన ఘనగ్లానదీనాస్య మమర
నొడలునిండారి వెల్వడినశోకరసంబుతీరున వేఁడికన్నీరు దొరుగ
మెఱుఁగుటద్దపుబిళ్ళమీఁదికెంపులతెరక్రియ గపోలమునఁ గెంగేలు మెఱయ
నతిమురుచ్ఛలమానలతభంగి నిశ్వాసధారచంద్రిక మోవి దల్లడిల్లఁ
తే. దనయ నీలోన లేదుగదా ధరిత్రి, చూపుమా యంచు ప్రార్థింపసోయగమున
దగ శిరమువంచి తనలోన దానపలుకు, మనుజపతిఁ గాంచి ప్రణమిల్లి మంత్రివరులు.

క. నతులై వినయవిచారో, న్నతులై నిలుచుటయు వదననలినములఁ దళం
గితదృష్టిచంచరీక, ప్రతతులు నటియింప ధరణిపాలుం డనియెన్. 326

క. అరుదెంచితి రెవ్వరు మీ, రరుదారం జెప్పుఁ డనిన నలికతటాంత
స్ఫురదంజలిపుటులై య, న్నరనాథుం జూచి దండనాథవతంసుల్. 327

మ. క్షితినాథోత్తమ నేఁడు నీమఱఁది మత్సిల్లుండు పుత్తేర వ
చ్చితి మాలింపు తదీయభాషితము లస్తేయవ్రతబ్రాహ్మణ
క్రతుభుగ్వైరివంతసయోగమున నీగారాము నెచ్చెలి యొం
డితరక్షోణికిఁ బోకచేరె మము నీ వీక్షించి పోరాఁ దగున్. 328

క. అని దేవరతో విన్నప, మొనరింపం బంపె విక్రమోపేతపతా
కినితో సంబంధిపురం, బున కరుదెం డనిన భూవిభుఁడు సుముఖుండై. 329

వ. అమ్మంత్రులకుఁ బసదనంబులిచ్చి యంతఃపురంబున కరిగి యింతికి నంతయుం దెలిపి విన్నయది ప్రొద్దుగా సభార్యుండై చతురంగబలంబులు గొలువ వచ్చి సుకీర్తి సుధ్యాహ్నకాలంబునకు బాటలీపురోపకంఠంబు గదిసె నప్పుడు. 330

ఉ. ఇంకనిలీవి బావ తనయింటికి వచ్చినఁ జంద్రసేనుఁ డ
భ్రంకపసమ్మదాభ్యుదయభాసురుఁడై యెదురేఁగుదెంచి ప
ల్యంకిక నున్న యప్పచరణాబ్జములం బడి కాంతకాంతిమ
త్వంకజరాగపూగకృతధామకవీథికిఁ దెచ్చె దెచ్చినన్. 331

ఉ. ముందఱ నేగి యబ్భువనమోహిని వాహినిపోలె నుబ్బునం
తం దలచుట్టు కన్దొగల దట్టముగాఁ బ్రవహించున శ్రువా
రిం దులితేతరస్తనశరీశములం దిగుపాఱఁ జేయుచున్
వందన మాచరించి విరివాతెఱతో మొగమెత్తి కేడ్చినన్. 333

సీ. కడుపులోఁ జేపెట్టి కలఁచిన ట్లగుటయు భర్తఁ గూరిమిపట్టిఁ బట్టి యెత్తి
శిర ముగంబునఁ జేర్చి చెఱువు ప్రస్సినరీతి నోడి కల్గట్టి పెల్లుఱుకు నశ్రు
ధారల నతితాంతదశఁ గన్న తనువల్లి దడుపుచు గద్గదధ్వానలీల
భాషణంబుల నెంతపనియాయెయ్యె నట్లుండె విధికృతం బనుచు నుర్వీవిభుండు

తే. గూఁతు నొండొకచందానఁ గుస్తరించి, యార్తి వారించి వలినీట యాళిపాట
పాటలాధరవదనదర్పణముఁ గడిగి, యుచితకాంచనపీఠిఁ గూర్చుండె నంత. 333

ఉ. చిత్తము చెంగలింప జయసేనుఁడు సాఁగిలి మ్రొక్కిన న్మదో
న్మత్తవిరోధిరోధిరుచిమగ్నమూర్తి సుకీర్తిభక్తిమై
నెత్తి కవుంగిలించె నపు డింపెసలారఁగఁ జంద్రసేనుఁ డు
ద్వృత్తరసత్యభాషణవిధానుఁడు బావకు మ్రొక్కి యిట్లనున్. 334

క. దళితారి నీకుమారి, న్మళితాంగవిలాస మైన మేనల్లున కీ
వలదే యిపుడని బద్ధాం, జలి యై ప్రార్థించుటయుఁ బ్రసాదోన్ముఖుఁడై. 335

వ. బ్రహ్మరాక్షసోద్యోగంబును బాంధవ్యంబునుం దలంచి సుకీర్తివర్తమానలగ్నంబున మిథ్యావలగ్నజయసేనులకుఁ బెండ్లిజేసెద ననియె నమ్మహోత్సవంబు వీటఁబాటిలి ననాగతసంబంధిబాంధవంబును నాయాతశైలూషిశైలూషంబును నాగచ్ఛదఖిలావనిపనికరంబును నాహూతబ్రాహ్మణజాతంబును నాబద్ధశుద్ధమాణిక్యతోరణంబును నలంకృతవిపణిమార్గంబును నభిరచితరంగవల్లీమతల్లికంబును నారాధితనవగ్రహంబును నఖండవాద్యమాననానాతూర్యంబును నై యమ్మహామహంబు ప్రవర్తిల్లె నా సమయంబున. 336

ఉ. బంగరుపీటఁ బెట్టి దడిపంబిడి రాజకుమారి దానిమీఁ
దం గదియించి తూర్యనినదంబుల రోదసి ఘూర్ణిలంగ కీ
విం గడుపాటిపాట నరవేంద్రుకలం గొమరౌసువాసినుల్
చెంగట నక్షతంబు లిడి చేఁడియకుం దలయంటి రాదృతిన్. 337

క. సుమతైలప్లుతి నలరా, కొమరాలికి నలరెఁ గురులు కోకనదాంత
స్సుమధూళిమగ్నమంద, భ్రమరీసమరీతినయనపర్వము లగుచున్. 338

తే. బుగులుకొను తావినీరము కప్పురముతోడ, నడుపుదివ్యనిఘుసృణద్రవంబుతోడఁ
బొందుగా మేళవించినచందనంబు, నాఁతికొండొకకలకంఠి నలుగుఁబెట్టె. 339

ఉ. అజ్జలజాక్షి వస్తుసుమహన్మతి మజ్జనశాలిబాలిక
ల్మజ్జనశాలఁ జేర్చి మణిపుంజాలపీఠముఁ బెట్టి దువ్వి పై
గొజ్జఁగినీరుచల్లి మెఱుఁగుల్గొన విప్పి విదిర్చి యొక్కచం
చజ్జఘనాంగ పెట్టె ఘనసారయుతామలకంబు నేర్పునన్. 340

ఉ. తోరపుజాలువాపసిఁడితొట్టుల నొట్టినపశ్చిమంబుప
న్నీరపరంజిబుంగలను నించి మనోహరకక్షకాంతిబం
గారుపసంతమాడఁ గరకంకణఝంకృతు లుల్లసిల్ల హే
ళారతి నార్చి యొక్కనవలా జలకం బలకంబుకంఠికిన్. 341

సీ. జిలుఁగుపావడమీఁదఁ జికురధిక్కృతమిళిందాళియొక్కతివ మాంధాళిఁ గట్టె
తడియార్చి నేయపేర్పడ దువ్వి యొకముద్దుకలికివాల్గంటి గీల్గంటువైచె
నిలువుటద్దము మ్రోల నిలిపి యొండొకవధూతిలకంబు తిలకంబు దిద్దె నుదుట
నెరివుట్టె నొకదిట్ట నెఱవాదితనమూఁది కనుచెలు ల్వాఁగంద గంధ మలఁదె

తే. నొకశుకాలాపహారవల్లికలు వైచె, నొకవిలాసిని మణులకంచుకముఁ దొడిగె
నొకలతాతన్వి పెట్టెఁ గేయూరకంబు, లొకతటిన్నేత్ర యిడియె బాలికకు సొమ్ము.

క. అక్కరిణీనిభగామిను, లక్కరణి నలంకరించి రాలో ధరణీ
భుక్కులచూడారత్నము, నక్కడ గైసేసి రాపు లగువా రంతన్. 343

మ. కదియంబోయెఁ బతంగుఁ డస్తకుధరాగ్రక్షోణిసత్కాంచము
లొప్పదలె న్నిర్జరమార్గపల్వలమునన్ భూరిజ్వలజ్జ్వాలలున్
మెదలెం జాగృవియాపణాగ్రముల నెమ్మెల్సెని దీపచ్ఛటా
ల్వదలెం జోళ్ళ రథాంగదంపతులు విల్వంచెన్ మరుం డత్తఱిన్. 344

సీ. నూరెల వెలుఁగుపంజాలశరీరన్యస్తభూషామణిస్ఫూర్తి ప్రోదిసేయఁ
గైవారముఖరమార్గణవిలోచనకైరవముల నాననశశి వాడుదేర్ప
విమలబంధుస్వాంతవిధుకాంతముల గటాక్షజ్యోత్స్న విరవిర గరఁగుచుండఁ
గృతదృష్టికరణసంగతవధూటీహంసికల నీరజాకరము పిలువ

తే. గలువచెలికాఁడు పొడపుగుబ్బలివసించు,గతి నలంకృతసామజస్కంధ మెక్కఁ
బటహనిస్స్వాణముఖతూర్యపటల మెసఁగ,బుధజనాశీరవము లుబ్బ భూపసుతుఁడు.

వ. తార్క్ష్యారోహణుం డగు నారాయణునికరణి నేనుంగు నెక్కి జయసేనుండు నర్తకీ
నర్తకగాయనీగాయనమాగధీమాగధ బ్రాహ్మణీబ్రాహ్మణనాట్యగా నస్తవనాశీర్వాద
విశేషంబు లానందసంధాయకంబులుగా స్థానీయమీనలోచనమరీచికావీచికాకవ
చితరాజమార్గంబున నేఁగుదెంచుచుండ. 346

ఉ. నీరము లాడి యాడి మదినిండినసొంపుపసం గటిస్థలిం
జీరచెఱంగు వీడిపడఁ జెక్కుచుఁ దక్కినకొంగు నేలపై
జీఱగఁ దన్నుఁ దామఱచి చెచ్చెరఁ జూడఁగవచ్చె నొక్కనీ
రేరుహపత్రనేత్ర యధరీకృతకంతుని రాజనందనున్. 347

చ. కుసుమసుగంధి యోర్తు నృపకుంజరుఁ గన్గొని మోహితాత్మయై
యసురుసురన్న దాని నికటాంగన యారసి నీకు నేటి కి
ట్లుసురన నన్న నింటికడనుం డిటకుం బరువెత్తివచ్చును
క్కస నుసురంటిఁ బొమ్మనుచుఁ గ్రక్కునఁ బోలఁగ బొంకె నయ్యెడన్. 348

ఉ. పొంగినకిన్కఁ దోఁచినటు పోరుచు మంచముడిగ్గనీక చ
న్నుం గబళించుపుత్త్రునిఁ గనుంగొని యక్కట వీఁడు నాకు బ
ల్సంగడమయ్యె నేఁడనుచు శయ్యపయిం బొరలించి త్రోచి వ
చ్చెం గలకంఠి యోర్తు నృపసింహము నెంతయుఁ జూడవేడుకన్. 349

ఉ. కేలగలించి పట్టి రతికిం బిఱువీఁకులు సేయువల్లభుం
జాలుఁబొకాలు నిల్నిలువు సైఁచు మొకించుకతాళు మాను మీ
వేళ నిశాననం బనుచు వీడ్వడనాడి యురోజగౌరవా
ర్తాలసమధ్య యోర్తు కదియం జనుదెంచెఁ గుమారమన్మథున్. 350

చ. అరవిరిబాగుతమ్మరస మంటిన కన్నులఁ డిల్లపాటు క్రొం
జిఱుచెమట ల్సను ల్మొనపుచెక్కులు చిక్కులు గొన్నహారముల్
విరిసినకొప్పు నిశ్వసనవీచికలం దగ వేగ నోర్తురా
మఱుఁ గికనేల యీవిధము మంచిది పొమ్మని నవ్వి రంగనల్. 351

ఉ. మించి జయంబుఁ గైకొనునిమిత్తము నెత్తము లాడి యాడి యో
డించి పణంబు దెమ్మనుచుఁ డెక్కనఁ బట్టినప్రాణనాథువ
స్త్రాంచల మించుకేని విడనాడక నెవ్వడి నీడ్చుకొంచు శం
కించక నేగుదెంచె నొకకేసరిమధ్య గుమారుఁ జేరఁగన్. 352

*ఉ. కీలుఘటిల్లువేణిగతికిం బ్రతికూలత నొందఁ జంద్రజం
బాలిత మైనచన్నుఁగవ మధ్యముపై దయదప్ప ముత్తరు
త్మేలిమి రాజిరాఁడఁగను మించులు శంపల గ్రమ్మటింప మం
దాలసవృత్తి నొక్కజవరా లరుదెంచెఁ గుమారుఁ జూడఁగన్. 353

వ. ఇట్లు పురస్త్రీరత్నంబులు నిజదృష్టిమసారసారంబుల నలంకరింప నేగివచ్చి సుకీర్తి మందిరద్వారంబున నవ్వారణావతరణం బొనరించి నారీజనార్పిత నీరాజనంబు లీక్షింపుచుఁ గక్ష్యాంతరంబులు గడచి చని ముందఱ † నతిముక్తాభిరామంబై బ్రహ్మసభను పుణ్యద్రవ్యసమీచీనంబై యజనవాటంబును బల్లవకుసుమవిలసితంబై వసంతసమయంబును బ్రసిద్ధవర్ణగౌరవంబై సంగీతంబును నాట్యకావ్యంబునం

---

*ఉ. మూలముఁ దార్చి సందుసుడిమూతులు నాకెడుగిండిదాని న
వ్వేళకు నొద్దఁబెట్టి యిదె వే విడె మిచ్చెదఁగాని చూచెదం
గోలతనంబు పెండ్లికొడుకుం దలవాకిట నంచు వెళ్ళనీఁ
జాలనిభర్తఁ దేర్చి యొకచంద్రనిభానన వచ్చె వీథికిన్.

ఇది ప్రక్షిప్తమని తోఁచెడు.

† ఈస్థలంబున నుపమానోపమావాచకంబులు సాధారణధర్మవాక్యంబులకు ముందు

దనరి భరతంబును పర్వధూర్వహంబయి భారతంబును సర్వతోరణవిహారంబయి జయశీలుని విబుధభవనసామ్యంబయి గ్రహమండలంబును రంభాలంకృతంబయి స్వర్గలోకంబును విశ్రుతావితానవితానంబయి కురుక్షేత్రంబును ప్రతిష్ఠితదధిముఖపాత్రంబయి మధువనంబును ననుకరించువివాహమంటపంబు డాయంబోయి.

ఉ. మోహనలీల నంత నొకముద్దియ గద్దియఁ దెచ్చినన్ మహో
త్సాహతభూమిపాలతనుసంభవుఁ డెక్కె ననంతరంబ దీ
నాహితనీతిసంచితగృహార్తుఁ డొసంగె సుకీర్తిభాసుర
వ్యాహృతి కుందనంపుహరిబాణమునన్ మధుపర్క మయ్యెడన్. 355

క. దానవశాత్రవుఁగా జయ, సేనుని నారాచకాంతు సిరిగా మది న
మ్మానసపతి దలపోసి య, థానియతిని ధారఁబోసెఁ దనయన్ సనయన్. 356

క. లగ్నంబు గడిసె గగనవ, లగ్నం బెమ్మనిన బుధులు లలితగతి న్మన్
న్మగ్నలు గుచభరకించి, ద్భగ్నలు నగుచెలులు సొంపుతోఁ జని కడకన్. 357

క తుద కొప్పు మెఱయ గవిసెన, గదియించినమరునివింటిగతి నతిశయిలన్
దుద కొప్పు మెఱయ నింతికి, ముదితలు చిత్రాంబరమున ముసుఁగిడి వేడ్కన్. 358

క నడపింపఁగ మడుఁగులపై, నుడురాజనిభాస్య యడుగు లొప్పెం గడున
య్యెడుగులు కూర్మము లగునఁట, మడుగులపై బోరయకేల మానఁగ నేర్చున్. 359

*ఉ మోహవశమ్ముగా నితెలిముత్తెపుసొమ్ములతోడికమ్మపూఁ
దీవలవంటిబోంట్లు కవదివ్వెలతోఁ జెలిఁ దెచ్చి రద్ధరి
త్రీవరపుత్రుఁ జేర నధరీకృతరోహిణి రోహిణిం బ్రమో
దావహజక్కి నుక్కుతునియ ల్హారిణాంకునిఁ జేర్చుచాడ్పునన్. 360

---

కొన్నిప్రతులందుఁ గానంబడియెడిని. ఐన నీకవి యింతకుము న్నీగ్రంథమునసే యిట్టిఘట్టంబుల రచియించినరచనం బట్టియుఁ గొన్నిప్రతులయం దుండుటం బట్టియు నిట్లు సంస్కరింపంబడియె.

*శా. రాకాచంద్రనిభాస్య నెచ్చెలులు దేరం బ్రీతి నత్యూర్జిత
శ్రీకిం బట్టగుమంగళాయతనముం జేరంగ నేతెంచుచోఁ
గాకల్పారవమత్తకోకిలలజోక న్సారెలం డాసి ల
క్ష్మీకల్యాణముఁ బాడి రంతిఁ బురహంసీయాన లుప్పొంగుచున్.

ఈపద్యము గొన్నిప్రతులలోఁ గానఁబడదయ్యెడు.

ఉ. ఆహరిణాక్షికేలు పతిహస్తమునం బతికేలు తజ్జగ
న్మోహినికేల నుల్లసిల నూతనసాత్త్వికకంకణాంకుర
వ్యూహముతోడ రాజతనయోత్తమహస్తమునన్ మహావరా
రోహకరంబునం దిడె గురుండు సమంత్రకకంకణాంకముల్. 361

ఉ. అంతటఁ జిత్రభాగ్యవనికాంతరితం బరతశ్చరద్ధరా
కాంతపటావకుంఠవృతకామినిఁ గన్గొనరామి వక్త్రసం
క్రాంతవిలాసలక్ష్మిఁ గనుకైవడి గడ్డముపట్టి యెత్తి ధీ
మంతుఁడు రాజనందనుఁడు మంగళసూత్రముఁ గట్టె నింతికిన్. 362

చ. అపుడు విధూకరోన్నమితయై తెలిముత్తెపుసేసఁబ్రాల్ ధరా
ధిపసుతునౌదల న్మదవతీమణి నించె విభుండు నమ్మద
ద్విపనిభయానమౌళిఁ బోదివెం దలఁబ్రాలవి జాతికెంపుల
ట్లపరిమితప్రియాప్రియకరాంబుజశోణిమ నొప్పె నెంతయున్. 363

చ సరిమెటుఁ బ్రోలపుట్టికలసందున బట్టినపట్టుపుట్టమున్
దెరఁ దెరలింపఁ జూచె సుదతిం బతి యవ్విభుఁ జూచె నింతి య
య్యిరువురజూపులం గలసి యేసెఁ బరస్పరమన్మలక్ష్యము
ల్వరముల నిల్చి నెన్నడుమ సాహసబాణుఁడు సవ్యసాచియై. 364

క. విడువనితగు లిరువుర కి,వ్వడువున ననుకరణి నుభయవస్త్రాంచలము
ల్వడిదేరునక్షతలతో, ముడిఁ బెట్టిరి పంచశరుఁడు ముడిఁ బెట్టంగన్. 365

ఉ అంబరదంశితాఖిలసముగ్రమణిస్ఫుటవేదికాంతరా
దుంబరపీఠి నుండిరి వధూవరు లయ్యెలనాఁగ యగ్నిహో
త్రంబున వ్రేల్చె లాజలు ధరావరసూనుఁడు సంభృతానురా
గంబున నేమిచెప్పఁ దనకౌఁగిటి కింతిమొగంబు వ్రేల్వఁగాన్. 366

క ఆగామిప్రణయరణో,ద్యోగం బణఁచుటకు నేఁడ దొరకొనె నితఁడం
చాగురుకుచనగ నయారె, ఖాగురుఁ డడుగూఁది సన్నెకలు మెట్టించెన్. 367

సీ. అవలోక మొనరించి రసురఘుస్మరపదధ్యానసంపాదినౌత్తానపాది
నేడ్వురఋషులతో నీక్షించి రురుకుచ శ్రీజితాహార్యవసిష్ఠభార్య
గళితచేలాంచలగ్రంథులై మ్రొక్కిరి యిలువేలుపులకు బెద్దలకు భక్తి
నుర్వీసుధాశనాశీర్వాదపూతాక్షతములు మస్తకములఁ దాల్చుకొనిరి

తే. రాజకన్యక యంతఃపురమున నుండె, పెండ్లిచవికెకు నేతెంచెఁ బెండ్లికొడుకు
విప్రులకు బంధుజనులకు విద్యవారి, కుభయనరనాథు లీప్సితం బొసఁగి రంత. 368

చ. నిరుపమశోభనాక్షతలు నించినపళ్ళెరము ల్ధరించి సు
స్వరమునఁ బూని యొన్నఁదగువర్ణములం బఠియింపుచుం ధరా
మరుల బహూకరింప గరిమంబున మూఁడవనాఁడు వర్తిలెం
బరమసుహృన్మనోజ్ఞమయి ప్రాఁకెనయమ్మలునాఁటివేడుకన్. 369

మ. వరలం గూర్చినకొప్పుతోఁ బసపుమిన్నల్దేఱు నెమ్మోముతో
గరిమన్నాగమసానిప్రోలుదిరుగం గాఱంతులై తూర్యముల్
మొరయంగాఁ గడునొప్పె నాకబలియాలోశాటికాపేటికల్
సరసాప్తిం జదివించి రాష్ట్ర లగురాజన్యుల్గురు ల్మీఱఁగన్. 370

చ. అతికృతులై నృపోపకృతులై హితులై తనరారుధారిణీ
పతు లతులప్రభం బురముఁ బాసి గృహంబుల కేఁగి రంత రు
ద్వృతిపరిపంథి రాజసమవర్తి సుకీర్తితనూజ కిచ్చె నూ
ర్జితగుణరత్నపేటికలఁ జేటికలం బదివేల ప్రేల్మిడిన్. 371

క. ధాటీఘోటీఘటితవ, రాటీబోటీహృదార్తరవుఁ డజ్జగతీ
తాటంకవతీపతిపట, పేటీకోటీశతంబు బిడ్డకు నిచ్చెన్. 372

శా. సారభ్యాహృతివిశ్వభూజనమనస్సంతాపము ల్విస్తృతాం
భోరుడ్రాగకరంకహృద్విహరణంబు ల్సారకర్పూరక
స్తూరీసాంకవగంధసారఘుసృణస్తోమంబుతో నిచ్చె సు
భూరిరత్నంబున కేడువారముఁ సొమ్ము ల్రాజు దేజంబునన్. 373

ఉ. ఆహతిగంధవాహముల నద్భుతహేషణదంభదూషణ
వ్యాహృతిభర్జితద్యుమణివాహములం గతిభిన్నమానస
వ్యూహములం గులీనమహిమోజ్జ్వలవాహములం గఠోరవి
రాహితచిత్తభల్లుఁ డగునల్లుని కిచ్చె సుకీర్తికీర్తికిన్. 374

మ. కటకస్థాతృమతంగజప్రభుమదౌత్కంఠ్యంబు వారించి యు
త్కటన క్షోణిపుచేతఁ బ్రాభృతముగాఁ గైకొన్నవైంధ్యద్విప
చ్ఛటలం భిన్నదిశావశాప్రియులఁ జంచజ్జంగమగ్రావధీ
ఘటనస్ఫూర్తుల నిచ్చె నల్లునకు భూకాంతుం డుదాత్తస్పృహన్. 375

క. అరదంబులఁ గుటిలాహిత, దరదంబులఁ గేతుపవనదళితప్రావృ
ట్చ్ఛరదంబుల భరనతది, గ్ద్విరదంబుల నిచ్చె భూమివిభుఁ డల్లునికిన్. 376

వ. వెండియుం బేరుగలవస్తువు లిచ్చి జామాత నాదరించి తాను నుపకృతుండై సుకీర్తి
యాఁడుబిడ్డ నాలోకించి యుష్ణాశ్రుమిశ్రితాక్షుండై యిట్లనియె. 377

తనియించినయింటికిఁ జొచ్చినయింటికిఁ గ్రొత్తక్రొత్తసిరిగా సరిరా
గనబోండ్లు మేలుమే లన, మనుమీ మనుమితుల మైనమా కిం పొలయన్. 378

మలసి ఋణానుబంధమహిమన్ హృదయేశ్వరుఁ డత్తి వత్తమా
మలతల గాకయుండఁ బతిమాన్తురు కాంతలు వారికెన్నఁడున్
గలుగవు వన్నెవాసు లటుగావునఁ బుట్టినచోటు బుద్ధిలోఁ
గలఁచి తదంఘ్రిభక్తి పరతంత్రవు గమ్ము కుమారికామణీ. 379

కృతనుతశీలయైనసతికిం బతివంటిగురుండు లేఁడు ని
శ్చిత మిది యమ్మనీషికి విశిష్టగురుల్ దలిదండ్రు లమ్మహా
మతు లనుకున్న విప్రుఁ బరిమార్చినపాపము వచ్చుఁ గాన నీ
మతముఁ దలంచి యత్తకును మామకు సేవయొనర్పు మొర్పునన్. 380

ఉత్తమామలచిత్త మలర వర్తిలవమ్మ ధవుని దైవంబుగఁ దలఁపవమ్మ
తోడికోడండ్రపొత్తును బాయనీకమ్మ మఱఁదులఁ గని మని తిరుగవమ్మ
యనుఁగుఁజుట్టములపట్టున వెట్టగాకమ్మ పఱవుళ్ళపై శక్తి వదలకమ్మ
కాఁగానిచెలుల డగ్గఱి చరింపకుమమ్మ యుత్తమస్త్రీలపొం దుడుగకమ్మ
తోడుతోనైన నందనతోడనైన, నొంటిపాటున భాషించు టుడుగవమ్మ
పనులఁగొనకమ్మ భూసురాంగనలచేత, వ్రేలఁ జూపించుకొనక జీవింపవమ్మ. 381

శ్రీవరవర్ణినీదనుజశిక్షణదీక్షులయట్లు దేవియున్
దేవరబోలి నీవు భవదీయవిభుండు నఖండసౌఖ్యసం
భావితులై మహాతనుకుమారు నఖర్వసుపర్వహర్మ్య నా
శావినుతైకశక్తిధురు దంపతు లార్జితలీలఁ గాంచుఁడీ. 382

తల్లి నిన్నెడఁబాసి యొండొకముహూర్తంబైన సైరింప నా
యుల్లం బోర్చునె పుత్రి నీక నిను నయ్యో దైవ మిట్లిచ్చెనే.
వెల్లింబోయినవంతఁ గుందవలసె న్వియ్యంబుఁ బ్రార్థించి వి
ద్యుల్లేఖానిభదేహ నిన్బిలువఁబుత్తున్ శీఘ్రకాలంబునన్. 383

అని సుకీర్తి యార్తిం దలపించుకొనియె నంతఁ దదీయసతి కాంతిమతి పుత్రిం గవుం
గిలించుకొనుచుఁ గన్నీరు కరతలంబునం దుడిచి డగ్గుత్తికఁ బెట్టి యొట్టకేలకు ధైర్యంబు
చిక్కంబట్టి యిట్లనియె. 384

నాయనుజాఁడు మత్సిల్లుం, డీయిలు నాయిలు సునేనుఁడీజయసేనుం
డోయబలా నీపెనిమిటి, పాయసమున నేయిదొరుఁగుబా గేర్పడియెన్. 385

ఇరువుర మేను లారయఁగ నెక్కడ నుండిననేమి యిక్కడం
దిరలదు గాఢమైత్రి యనువితానము నిన్నదె వర్తమానవ

త్వరమునఁ బిల్వబంచెద విశాలకు నెమ్మదినుండు పోయి క్ర
మ్మతిరోద నంచుఁ బుత్త్రిఁ దగుమాటలఁ దేర్చి సగౌరవంబునన్. 396

వ. వివిధాభరణంబులు చిత్రవస్త్రంబులు పరిమళప్రముఖంబు లగుసర్వవస్తువు లిచ్చి
బంధుజనుల నియోగంబు పదసి చతురంతయానాధిరూఢ యగుచుఁ జతురంగసే
నాపరివృతుం డగుసుకీర్తితోన మరలి పురంబున కరిగి సుఖం బుండె. 387

ఉ. ఆజయసేనుఁ డంతఁ బరమాదరణంబున బ్రహ్మరాక్షసుం
బూజలఁ దన్పి కేల్మోగిచి పొండిఁక మీరన నుత్సహించి గో
త్రాజరదైత్యుఁ డానరవరాత్మజు మన్నన సేసిపోయె నం
భోజభవాలయంబునకుఁ బుష్పకమెక్కి సురల్భజింపఁగన్. 388

వ. ఆరాత్రి మజ్జనభోజనాదికార్యంబు లాచరించి. 389

సీ. చంద్రికపూవన్నె జిలుఁగుఁ జువ్వలువ మేల్కట్టు దంతపుఁగోళ్ళపట్టెమంచ
మొలుగుబిల్లలుపట్టుపఱుపుకప్రపుఁబలుక్కు సురటి క్రొవ్విరులు కస్తూరిరాయి
పూఁపుగట్టినగంధపొడికదంబము పెట్టె కలశంబు చికిలిబాగాలబరణి
పండుటాకులు నానవాల్పావకములును గండచక్కెర తెల్లపిండివంట

తే. సంజసరిపట్టుబకదారిజాతిపొరు, వములు గుజరాతికెంపుదీపములు బూతు
చిత్రపటములు కుడినీరుచెంబు గలిగి, తనరుసదనంబు రాజనందనుఁడు సొచ్చె. 390

సీ. మంచికప్రము మేళవించినపన్నీట సరసాళిజనము మజ్జనముఁ జేసి
జిలుగుమాంధాళి కుచ్చెళ్ళఁబోసి కట్టి దేహమునఁ గుంకుమరసం బప్పళించి
చికిలిపైఠాణికంచుకము గీలించి చొక్కము లైనమణులహారములు వైచి
సొగసుగా నుదుటఁ గస్తూరిరేఖ యమర్చి కలికులు ముద్దుచెక్కుల ఘటించి

తే. గోరజవ్వాదిపదనిచ్చి గూడదువ్వి, కుసుమగర్భంబుగా జాఱుకొప్పుఁబెట్టి
చవులచేర్చుక్క సీమంతసరణిఁ గూర్చి, కన్య నిష్టాన్నసంతుష్టఁగా నొనర్చి. 391

ఉ. కూరిమి బుజ్జగించి యనుఁగుంజెలువ ల్దనుఁదేర సమ్మదాం
కూరమహావిలంబమునకుం బనిలే దనఁ బోకపోకమం
చూఱటలేక సిగ్గుతెరవుండగ ముందఱఁబోయి పిమ్మటం
గ్రూరవిషాణమేషమయి కొమ్మ చనుం జనలేక క్రమ్మఱున్. 392

ఆ. వనిత నిలిచి నిలిచి వచ్చుచు మంజీర, మండనములు మాని మాని మొరయ
లజ్జ విడువరాదు లావణ్యవతులకుఁ, బ్రాణనాథుతగులుఁ బాయరాదు. 393

వ. ఇట్లు కేళిమందిరంబు చేరందెచ్చి 394

ఆ. చెలులు బలిమిఁ జేసి పిలిచినఁ దల్పంబు, చేరరాక సిగ్గు చేర్లుకొనఁగఁ
గ్రొమ్ముడియును మోము క్రిందొకచూపట్టఁ, దలుపు దండగొనుచు నిలిచియుండె.

క. రతిబోటులంత మంద, స్మితచంద్రికవదనపర్వశీతద్యుతులం
దతులగతి మెఱయఁ దేజో, న్వితునకు నృపసూతి కిట్లనిరి నేర్పొలయన్. 396

క. ఈపాఁపపూఁప వయసుది, నీపాదములాన మెత్తనిది పేర్కొనరా
దేపనిపాటల నేనియుఁ, గాపాడుదుగాని గాసిఁ గావింపకుమీ. 397

తే. ఎంతతమకంబు గలిగిన నిగురుబోండ్లు, చేర నొల్లరు మగవారు చీరుదనుక
నది యథార్థీకరించి నీయలరుబోఁడిఁ, గదిసి పిలుతువుగాని కొంకెదవుసుమ్మి. 398

క. అని నగుచు మగువలందఱు, పనినెపమున నొక్కరొకరె పఱచిన లజ్జా
వనతాస్య యగుచు నంగన, మనమున ననుసిగ్గుదేరి మారాకృతున్. 399

ఉ. ఉవ్విళులూరుచు న్వికసితోత్పలలోచన చూచు వల్లభున్
దవ్వులజూచభర్త దను నర్మిలిఁ జూచినఁ జూడ దంతలో
బువ్విలు వంచిఁబాణ మరి బోసి రయంబున డాసి శింజినిం
జివ్వనఁ బాపి యేసె నలచిత్తజుఁ డిద్దఱ సవ్యసాచియై. 400

క. ఆత్తఱి రాజకుమారుం, డెత్తినతమకమున ననునయోక్తుల సరసా
యత్తవిచేష్టలఁ గన్నియ, చిత్తము గరఁగించి సజ్జ చేరఁగఁ దెచ్చెన్. 401

సీ. మగువ నీకంకణమణుల నర్ఘ్యము లని పరికించునెపమునఁ గరముఁబట్టె
నెత్తమ్మితావు లీనెడునీమొగం బని మూర్కొనువిధమున ముద్దుఁబెట్టె
లేమ నీకంఠమాలిక ద్రొడ్డసొమ్మని తడవులాగున ఘనస్తనములంటె
బిఱుచుట్టుబిగువున విఱుగదే నడు మని సడలించుగతి జీరముడి వదల్చె

తే. నాఁతినీబొమ్మ నాబొమ్మనకు సమాన, మయ్యెడినొకాదొ యాఁగాములరయువలయు
నని మహోత్కైతవంబున నధిపపుత్త్రుఁ, డంబుజాననపరిరంభ మాచరించె. 402

ఉ. వేడుక లంకురింపఁ బృథివీవరుగాఁగిలి మందుసోఁకి సి
గ్గాడనిబాడిన న్నగుఁ బ్రియుండు హసించినఁ బిల్వ మాఱుమా
టాడుమొగంబునం దెలివి యచ్చుపడం దఱితోడ నిమ్మనన్
వీడియ మిచ్చుఁ గన్నులకు విందగుచుం గలకంఠి వేమఱున్. 4

ఉ. జీనువముక్కుతోడఁ బ్రతిసేయఁగవచ్చిన గోరఁదీరుగా
నీనియ లొల్చి చుట్టి తనకిచ్చినవాగరఖండ మర్వరా
జానిసగంబు వోఁ గొఱికి చానరదంబుల కందియియ్య నా
లో నవినొప్పె వజ్రములలోఁ దళుకొత్తెడుకుందనం బనన్. 404

ఉ. చాతురిమీఱ మస్తకము సందిట బిగ్గరఁ గ్రుచ్చిపట్టి యా
నాఁతిసుధాధరంబు రదనంబున నొక్కినఁ దాళలేక ధీ

రాతిశయాత్మ వేది బామలార్చుచు కన్నరమూసి వల్లభుం
జేతుఁ ద్రోచి రాజముఖి సీత్కరణం బొనరించెఁ బల్మఱున్. 405

ఉ. అంగజసాంపరాయము సమాప్తివహించిన నిర్భరత్రపా
లింగితచిత్తయై యబల లేచి కటిన్మృదులాంబరాచలం
బుం గదియించి హేమమణిపుత్త్రిక చాటున కేగుచోఁ బున
స్సంగమవాంఛ పుట్టె నృపజన్మున కిష్టవిలోకనాయతిన్. 406

వ. ఇట్లిచ్ఛానురూపవిలాసంబులం బొదలి సుఖించి రద్దంపతులు మఱియును. 407

సీ. సురభిపుష్పామోదఁ జొక్కించె నారామసీమ నారాజన్యచిత్తజుండు
కలహంసగమనఁ దెప్పలదేల్చెఁ గాసారతటముల నాన్నృపోత్తమసుతుండు
కంఠీరవవలగ్నఁ గరఁగించెఁ గృతకాద్రిగుహల నద్ధాత్రీశకుంజరుండు
కలకంఠి ననురాగ మొలయించెఁ జివురుఁజప్పరముల నవ్వైరిభంజనుండు
తే. గారుడాశ్మచ్ఛటాచ్ఛన్నకనకసౌధ, పాళికల నావితీర్ణవిభ్రాజితుండు
రతులఁ బొలయించె నాశరద్రాజవదన, నతిశయప్రీతిలతిక మాఱాకులిడఁగ. 408

క. మహిళారత్నంబును న, మ్మహిరమణసుతుండు భోగమహనీయకళా
వహలీల నుండి రని యల, బహుమానుఁడు క్రకచుఁ జూచి పలికె న్మఱియున్.

క. దొరికినవిశ్వధరిత్రి, పరకన్యక విడిచె వెఱ్ఱివాఁడై యడవిన్
మరణమయి మనినమందుఁడు, పురుడింపఁగ నీకు దోడుఁ బోవఁడె క్రకచా. 410

ఆ. తనకుఁ దెవులు మూఁడె నని భార్య సెప్పిన, నీవు దానిమాట నిజము సేసి
నెయ్యుఁ డనక నన్ను నిర్జింపఁ జూచితి, చెడుఁగ నిన్ను విశ్వసింప నగునె. 411

క. వెడమాయలపుట్టిల్లగు, చెడుగుం గళ్యాలు పాపశేషంబునఁ జే
పడినకతంబునఁ గాఁపుర, గొడు కొక్కఁడు రాజబాధ గుందఁడె తొల్లన్. 412

క. నావిని జలచరరమణుం, డావానరవిభుని కనియె నదియెట్లు ధరా
దేవస్తుత యాకథఁ జెపు, మా వినియెద ననిన నతని కతఁ డిట్లనియెన్. 413

సీ. ఆరసాతలగభీరాపారజలఖేయ మానాకరమ్యసాలాభిరామ
మాచంద్రమండలవ్యాయామమణిసౌధ మాబ్రహ్మశుద్ధవిప్రాన్వవాయ
మాప్రాణపవనశౌర్యాయాధనక్షత్ర మాఫలోద్యమసముద్యమకిరాట
మాదార్ఢ్యధర్మకార్యారంభచరణజంబాచక్రవాళశైలాశుతురగ
తే. మాంబరప్రాంశుదానధారాఢ్యనాగ, మాధ్రువస్థానపథశతాంగాతిశయము
బ్రహ్మకైనను బ్రస్తుతింపఁగఁదరంబె, భూపదురనూపురంబు కాంచీపురంబు. 414

క. అలకాంచితమయి తనరిన, యలకాంచివిహారభర్తృఁడను పేర మహా

వాలికుఁ డొకఁ డుండు నలంది, కుక్కలబారం గలిమిచట్టుకొడు కితఁ డనఁగన్.

సీ. ఆఁగుంపులు గొఱియలదొడ్లు లేఁబూరిమెనుములమునిమంద లెడ్లకదుపు
లులుఁగశంబులు వాఱుపొలము వాకిటఁ బదికట్టుబండ్లింటికిఁ జుట్టుమగులు
తలుపుదూలము కొట్టములు సోగరాగాడిమచ్చు ముంగిట రెండు రచ్చమాకు
లీనుగోడిగె వేగురింటిబిడ్డలు మాళ్లతార్పులు నూబపాఁతిఅలఁ గొలుచు

తే. కలుపుకలిలేరుదండయుఁగమ్మతీగ, పాగడము పూసె నానెట్టె బవిరెపడిగె
చుక్కబొట్టును జిటిపొటిసొమ్ము గలిగి, కాఁపురము సేయునవ్వీటఁ గాఁపుకొడుకు.

క. వానికి నిచ్చావతి యనఁ,గా నొకయిల్లాలు గలదు కమనీయవయో
నూనవనంబున నది జా, రానందలతాలవాలయై వర్తిల్లున్. 417

వ. అది యొక్కనాఁడు. 418

చ. తలఁ బెనుగుండఁ దాల్చి వితతస్తనభారమున న్వలగ్న మా
కులత వహింపఁ గాఁప వలిగుబ్బెత పట్టపగ ల్జలాశ ని
ల్వ్యాలువడి మన్మథాస్త్రపటలీనిశితాక్షకటాక్షమాలికల్
గెలఁకులఁబర్వ వేగవతికిం జని తత్తటినీతటంబునన్. 419

ఉ. కోమలధూళిధూసరితకుంతలు నాతపరక్తరక్తదృ
క్తామరసుంగటీరపరిధాననిబద్ధకరాసిఁ బాదర
క్షామిళదంఘ్రిమద్విముఖసంస్తరణేతరచిత్తు గాఢచిం
తామయుశూద్రు నధ్వజనితశ్రమపీడితుఁ గాంచె నొక్కనిన్. 420

క. కాంచి దృగంచలశోభా, చంచచ్చంద్రాతపమున శాంతశ్రముఁ గా
వించి యలవిందునకు మదిఁ, గొంచించక హాలికలికుచకుచ యిట్లనియెన్. 421

మ. నిలువం జోటులు లేవె నీకుఁ జెపుమా నీరాటి కీవేల హా
తెలిసెం బాంథగతాగతైతదిభపృథ్వీభృత్పురస్త్రీకళా
కలితాస్యద్విజరాజబింబకృతసాక్షాత్కారసంభావనా
కలనన్ దూరపథప్రయాణజనితగ్లానిం ద్యజింపం జుమీ. 422

క. కలదుగదా యని మోవిన్, బలుమించులు సందడింపఁ బలికినఁ జింతా
కులహృదయుఁ డగుట వాఁ డ,చ్చెలిమాటలు వినక సరకుసేయకయుండెన్. 423

వ. అట్లదత్తప్రతివచనుండై యుండ నమ్మిండత వెండియుఁ దెరువరి నీక్షించి. 424

శా. అంపంజాలము చింత నీమనసు చీకాకాట నామాట లా
లింపం గూడదు నేఁడు క్రొమ్మెఱుఁగుదూలె న్నేను వీక్షించినన్
సొం పాక్కింతయు గానరా దెఱుఁగవచ్చుం జెల్లఁబో చుట్టమా
కొంపం బో రుదయించి రావుగద నాకుం జెప్పుమా నీకథల్. 425

క. అని సరిదాఁకంబలికిన, విని కొండొకమనసు పల్లవించిన దానిం
గనుఁగొని యతఁ డనుచా; డ్పునఁ దెలిసితి వింటఁబోరు పుట్టుట తరుణీ. 426

ఉ. నేర మొకింతలేమియును నిర్దయ లైనను గన్నతల్లి దు
ష్కార్యరత కోర్చి రాయఁ దనకోడలి రేలు పగల్లు కంట న
గ్గోరము జూడలేక మదిఁ గుందుచు నిర్దిగనాడి పోయితిన్
వారణలేక రాజుఁ గొలువం జిరకాలము దండుఁ జేసితిన్. 427

ఉ. నా కవనీశుఁ డిచ్చె నదనం గదనంబున నస్మదీయబా
హాకరవాలధారభయదారులు గూలినఁ జూచి మెచ్చి కో
రాకృతకృత్యయంచు సవరాలు వరాలు సరాలు రూకలుం
గోకలు మానికంపుఁదళుకుల్ మృగనాభిజవాదికప్రముల్. 428

ఉ. ఆకమనీయవస్తుతతు లన్నియుఁ దెచ్చి నమస్కరించి యు
త్సేకరసం బెలర్పఁ దనచేతికి నిచ్చిన వాని నన్నియున్
గైకొని జల్లి బాష్పకలికాతరళీకృతలోచనాంతరయై
కాకుతనంబు సేసె గొడుకా యిఁక నేమననేర్తుఁ గోడలిన్. 429

ఉ. తిట్టినఁ దిట్టు బెట్టుఁ జిటిదిండికిఁ గొల్చిన కొల్చు సాగ ది
చ్చిట్టకమన్న మాతులకుఁ జేతులు సాఁచు నొకప్పుడేని యి
ల్పట్టదు సంతకూటములఁ బాయదు చేయదు చెప్పినట్టు నీ
ఱట్టడిజంత యిల్వెలిచె రాతనయా యనయానుషంగతిన్. 430

క. కాపరమున వెండియు నది, గావించినపనులు పెక్కుగల వవి నాకే
లా వినుపింపఁగఁ బిమ్మట, నీవె యెఱుంగెదవు డాఁగునే యపకీర్తుల్. 431

క. నీవఁట యదియాఁట వలసిన, త్రోవం జనుఁ డింక మమ్ము దూఱఁగఁ బనిలే
దీవఱదను కారోఁతల, దేవళ్లంబడితి వినివితిం గోడలిచేన్. 432

చ. కొలపగగాక యత్తకును గోడలికిం బరికింప నెయ్యముల్
గలవె పలానిమచ్చరముఁ గైకొని యీముదిముండ చెప్పెదున్
బలుమఱు నంద్రు దానిగుణభంగు లెఱుంగనివారు సర్వమున్
దెలిసెడుఁ గాదె చేయగలితే మఱి దాఁగునె పుణ్యపాపముల్. 433

పూవకపూచెం గడపట, కావకయు న్గాచె ననుచుఁ గడగన్నులఁ గెం
పావహిలఁ దల్లిసెప్పిన, యావాక్యము లనృతమయములని యవ్వేళన్ 441

తే. తల్లిపలుకులు గాదనఁ దాల్మిలేక, యుత్తమాంగనఁ గులకాంత నొందునవక
బ్రతుకుభాగ్యము విడిచి నిర్భరవిరక్తి, నరుగుదెంచితి ననిన నయ్యంబుజాక్షి. 435

ఉ. ఆతనిఁ జూచి యిట్లనియె నట్టిద తప్పదు నాఁతి నీతితో
జాతి దలంచి సిగ్గులకుఁ జచ్చుచునుండిన నుండెగాక కా
మాతురతాతిరేకమున నాఁడిపోకలఁ బోవఁజూచినన్
వేతరవుండి పట్టుకొన నీరజగర్భునకైన శక్యమే. 436

క. కులసతి యుత్తమురాలని, దెలిసియు నీతల్లి మనసు దెలిసియు దగదీ
యాలుక మఱివెఱ్ఱి దెలిసెన్, దల రోకలి చుట్టు మనువిధం బిదిగాదే. 437

క. నావిని యతఁ డిట్లనుఁ జెడు, త్రోవఁ బోకుండ మదపతుల నెప్పటికిన్
గావఁగరాదా పతులకు, నీవనియెదొ రొల్లవా రనిరో యిబ్భంగిన్. 438

క. మిన్నులపైఁ బోవదుగద, యిన్నేలనెకద మృగాక్షి యిటు లెవ్వరికిన్
గన్నాఁడమున్నె చెపు మన, నన్నెలఁతుక నవ్వి వాని కపు డిట్లనియెన్. 439

క. పరసతి నని చని యనుఁగుం, బురుషునితోఁగూడి నిలయమున నాఁడొసఁగన్
సురతసుఖశుల్కమును గొని, యిరవందగ నీకు విత్త మిత్తుం బుత్తున్. 440

క. ననుఁ జూడఁగలవె తొల్లిటి, ఘనజఘనలకై తపంబు కతలుం గితలున్
వినిపింప నేటి కన్నియుఁ, గనుఁగొనియెదుగాక నేఁ డఖండప్రీతిన్. 441

ఉ. ఇచ్చట నుండనేల తొలియిర్లుపడం బసిబిడ్డతల్లితో
వచ్చితి నేఁ బ్రవాసి నిలువన్వలెఁ బ్రొద్దుదయించుదాఁకనం
చచ్చుపడంగఁ బల్కి తమయాతనితోఁ దలసాఁపనిల్చి యో
ముచ్చటకాఁపయేనయట ముందటికార్యము లాచరించెదన్. 442

క. అని వేగవతీజలములఁ, గొని యామణిమంతుఁ దోడుకొని మృదుగతులన్
జనియె నొరు లెఱుఁగకుండం, దనయిలు రెడిసాని యపు డతని కెఱిఁగించెన్. 443

ఉ. అంతట వేఁడివేలు పపరాద్రిఁ దిరోహితుఁ డయ్యె వాసరాం
తాంతరుచు ల్సెలంగెఁ గలయం దొలిచీకటిపర్వె సీరిసీ
మంతినిమాటమీఁద మణిమంతుఁడు చీరమునుం గొనర్చి యొ
కింతభయంబులేక వడి నేగెఁ గృషీవలునిల్లుచేరఁగన్. 444

. ఏగి యఖండోత్కలికుం డగుహాలికున కిట్లనియె. 445

ఉ. నాపడుబాటు కే వగవ నా కనుకూలగతిం జరించునీ
పాపనితల్లి కీవికచపంకజలోచనకై దురంతసం
తాపముఁ బొందెదం దగినతావిది గావున వచ్చినాఁడ నేఁ
డీపసిగాడిదంఁడ వసియించి ప్రభాతమునందుఁ బోయెదన్. 446

. ఉండుము నా యన నాయన, మండుచు నిట్లనియె మంచిమాటే యిది మా

యిండులు విడుదులె పురి గుడి,గుండంబులు తేవె పండుకొను మచ్చోటన్. 447

క. పొసఁగ దని ముక్కు దుస్సిన, పసతముగతి రేఁగి రెడ్డి పలికిన నాలోఁ
బసిబిడ్డ నెత్తుకొని సం,తసమున రెడిసానివచ్చి తనపతి కనియెన్. 448

ఉ. చెప్పు మదేమి యేలరొదసేసెదు వాకిటవార లెవ్వ రం
చప్పలుగాకి తా నెఱుఁగన ట్లడుగం బ్రియఁ జూచి వాఁ డనున్
గప్పినమబ్బులో నితఁ డొకం డిదె వాకిట నిల్చి చోటుకై
యొప్పెడు నెన్నఁడేనియు నెఱుంగుదునో ననుఁ దా నెఱుంగునో. 449

ఉ. ఆలఁట చంటిపాఁపడఁట యంగడిలేదె పచారముల్ గృహం
బేల ప్రవాసి గాఁడె తన కెక్కుడనైనఁ బరుండరాదె యీ
నేలయెగాని నిల్వఁ బెఱనేల మనోజ్ఞముగాదె యంకచం
డాలముగాదె యిట్లునికి నా నది రెడ్డినిఁ జూచి యిట్లనున్. 450

ఉ. ఆలఁట చంటిపాఁపడఁట యాయన యెంతటివాఁడొ యేరికిన్
జాలిది గాదె యిల్వెడలఁజాలనివారు బయళ్ళనుందురే
వేలుపులైనఁ దక్కురుల వేఁడరె యక్క అపాటునం జలం
బేల పరుండనిమ్ము మన కిప్పని పుణ్యముగాదె వల్లభా. 451

క. పసిబిడ్డతల్లితోఁ గ,క్కస మొండొకదెసకు నరుగఁగా నితనికి ని
వ్వసుధఁ దలఁ గట్టుకొనియెదె, కసరకు నేఁడెల్ల నుండుఁ గా కిచ్చోటన్. 452

క. చాలుఁ బిసాళింపకు మని, యాలరిరెడిసాని మగని నదలించి సుతుం
డాలును నీవును నిచ్చోఁ, దాలిమి వసియింపు మని యతని లాలించెన్. 453

వ. ఇట్లుపలాలితుండై మణిమంతుం డయ్యింటిపసులకొట్టంబున నుండె నంత. 454

సీ. కలదండి పసిఁబిండి కాఁచి చేమిరిఁబెట్టి యొఱగకుండఁగఁబట్టి యుట్టినొట్టి
కోళ్ళసంకటితోడఁ గూడు నీళ్ళిడి జాగు నెరపక బంటుబానిసలఁ బనిచి
తనివెచ్చకలినీటఁ దా నమర్చి యనుంగునిసువు జోవలఁబాడి నిద్రఁబుచ్చి
యోతువు గొనిపోవకుండఁ గూయిడదెచ్చి కోడితండంబులఁ గూండ్లఁగమ్మి

తే. దాలిఁ గాఁగిన నీరాడి నీలికమ్మి, మడుఁగుఁ బైఁగప్పుకొని కాళ్ళు ముడిచిపట్టి
మంచమునఁ గూలి నిదురించుమగనిలేపి, కూరయును వెన్నఁ బడవైచి కూడొసంగి.

తే. సన్నజాఁదపునేఁతమంచంబుమీఁద, దుద్దుగంబడిఁ బఱచి నిద్దురకుఁ దూలు
మగనిఁ గూర్కకు మనుచు నమ్మాయలాఁడి,వెడదగంగాళమునఁ గూడుగుడిచిలేచి.

క. గుడుసుంబోఁకలు బ్రద్దలు,ప్పడ ఱోఁకటఁ గుమ్మితెచ్చి పతికిడి సున్నం
బిడక యొకకొన్నిసున్నం,బిడి యొండొకకొన్నిమడుపు లిచ్చుచుఁ బలికెన్. 457

మగవాఁ డనఁగాఁ దుమ్మెద, పోగుం బ్రాయమునఁ గన్నపూవుల నెల్లన్
దగిలి రమియించుఁ గలదే, మగవానికి నెందు సరిసమానము జగతిన్. 458

వారణలేక హస్తిగిరివల్లభు సేవకు వచ్చిపోవుచు
న్నారిమిటారులీపురమునం గల రచ్చపురాకుబోండ్లతోఁ
దారసమైనతీరుగలదాని నొకానొకబోటి నెన్నఁడై
నా రతిఁ దేల్పవే కడువినం బ్రియమయ్యెడు నాకు నింతయున్. 459

పలుచని మేను నిబ్బరపుఁ బ్రాయము వాఁడవు కంచి కెప్పుడుం
గలిగిన రెడ్డివిం గొనఁగఁ గత్తవు కాఁపుర మెచ్చునిన్ను నే
వెలయొలనాగ పిల్వ దది వేడుకఁ బోలిన నీకుఁ జిత్తమే
పొలఁతుకమీఁద నుంచు నిది బొంకక నాకెఱుఁగంగఁ జెప్పుమా. 460

తడవులనుండియు నిది ని, న్నడిగెద నని యుందు మఱతు ననుటయుఁ గాఁపుం
గొడుకు విడియంపుసొంపుం, జడుపుం బెనఁగొనఁగ నప్పిసాళికి ననియెన్ 461

ధీరత మంచిదానిపగిదిన్ మృదురీతుల వేఁడిమాట లే
తీరున నైనఁ బిల్చుకొని తిట్టుదుఁ గొట్టుదు నంచుఁ జూచెదే
యూరక యున్న జాల్వెఱతు నుండు మెఱుంగుదు నిన్నుఁ బోల ది
క్కేరడ మిట్టిగోల కెఱఁగింపక యెవ్వరితోడఁ జెప్పుదున్. 462

నావిని వెండియు నలయి,చ్చావతి పతిఁ జూచి పలికె సరసత నేనై
కావలెనని వేఁడుదునఁట, నావలనం గనలుపుట్టునా యింతైనన్. 463

వేడుక పుట్టెడు విన నా,తోడు సుమీ చెప్పకున్న దోషము లేదే
చేఁడియఁ బోయితి వనఁ జలి,వీడి కృషీవలుఁడు నవ్వి వెలఁదికి ననియెన్. 464

ఒట్టవు సత్య మేనెఱుఁగ నొండొకభోగము దానిఁ గాంచి కా
పట్టణమందుఁ గూడి గడపై మనవాకట నాడి పద్యముం
గట్టినవీటిలంజగుఱిగాఁ దిరుగాడ నెఱుంగవే మొ నా
చుట్టఱికంబునం బ్రియముసు మ్మిఁక మాటలు వేయు నేటికిన్. 465

నావిని గోరగింప నయనంబులు విస్ఫురితాధరోష్ఠయై
యావెడమాయలాఁడి యను నాతని కోరి మెఱుంగుబోఁడు లే
కైవడి నైన వేఁడుటురుగాదె మెఱుంగు లెఱుంగఁగోరువా
రై వినరానిమాట లకటా మగవానికిఁ జెప్పవచ్చునే. 466

దాపురము లేక యీ క్రియ, గాపురములు సేయుచున్న గరితలతో నీ
తీపురములు వాక్రుత్తురె, కాఁపుల నినువంటివారిఁ గానవె తులువా. 467

క. అని కెలసి పులుకపులుకనఁ, దనుజూడం జూడఁబట్టి తన్నుం గొట్టెన్
దనివిసనఁ దిట్టె ననలుం, గొనలుగ రొద మగని దెగనికొండాటమునన్. 468

ఉ. కావర మెత్తి యిట్లు తనుఁ గాఱియఁబెట్టుచునున్నదాని ని
చ్ఛావతిఁ జూచి లేచి రభసంబున రెడ్డనపల్కె నోసి నీ
చేవ యెఱింగికాదె మును జెప్పక గుంజిలిపెట్టియుంటి నీ
వే పలుదన్ని వేఁడుకొనవే మఱియేనయి చెప్పినాఁడనే. 469

క. నాతోడని నన్నడుగుట, యీతెగుదెంపునకు మిగిసె నిఁక నేమనుచున్
రాతికొడుకు కతఁడు హాలసం, జాతకిణాశ్మాతికఠినశయమునఁ జఱిచెన్. 470

వ. ఇట్లువ్రేటుపడి దండతాడితభుజంగియుంబోలె నమ్మోహనాంగి నింగిముట్టినయలు
కం బట్టిన సికవీడి నిలువంబడి యిలువెలువడి. 471

క. ఆడికలం బడితినొ అం,కాడితినో యిల్లు మ్రుంగిలనో తఱితోఁ
గూడననో నీళ్లననో, కూడునె యిల్లాలి నన్నుఁ గొట్టం దిట్టన్. 472

క. విరసమునఁ గొట్టుపడి నా,సరిగరితలలోన బ్రతుక సైఁతునె మఱి నే
నురెఁ బోదు త్రాటఁబోదున్, ధరియింతునె సైఁపు మింతదడ విచ్చోటన్.

క. ననుఁ గన్నతల్లి ప్రజలకు, వినిపించినపిదప ననుచు వెసఁ బుట్టిల్లం
దునికి యటకేగు కైతవ,మున నుపవల్లభునినికటమున కదిపోయెన్. 474

క. ఏతెంచి నిర్నిరుద్ధ, ప్రీతి న్మణిమంతుఁ గ్రుచ్చి బిగికౌఁగిటవ్రా
జ్ఞాతపృథుప్రథనంబున, శాతోదరి పెనఁగె రెండుజాలవ్వేళన్. 675

క. విసువక చనునెమకెడున,ప్పనిపాఁపఁడు తల్లి దాఁపుఁ బాయుటఁ గడువె
(క్కసమున నాఁకలి గొని తా,) నసురుసురై చెవులు గింద్రుమన వాపోయెన్.

వ. అయ్యెడ్డు విని యుపపతికి నయ్యువతి యిట్లనియె. 477

చ. అడలెడుఁ జంటిపాఁపఁ డదె యాకొని వానికి నేను జన్నుబా
లిడి చనుదెంతు నింటిమగఁ డింతయెఱుంగకయుండ నీవు నా
యెడన వసించి యేమినిసువేడ్చెదు రెడ్డన నాకుఁ దెల్పుమం
చడుగు మతండు చంటికొఱకై యని నిక్కువ మొప్పఁ జెప్పెడున్. 478

ఉ. చెప్పినఁ దల్లి యెందఱిగెఁ జిన్నికుమారుని డించి సర్వముం
జెప్పఁగదయ్య యివ్విధముచిత్రము నాకని వేఁడు మాతఁ డి
ట్లొప్పనిమోముతో నను దురుక్తులఁ బల్కుచు మంకుబుద్ధి యే
తప్పునులేమి నిల్వెడలి తల్లిగృహంబున కేగె నంతగన్. 479

క. నావిని మాయాతనితో, నీనను నుతు విడిచిపోయెనే యకటా నీ
దేవియుఁ బుట్టింటికి న,య్యో వలదని మాన్ప కెట్టులుండితి వీచటన్. 480

ఉ. ఐన నిఁకేమి సేయఁగల మాకట నేడ్చుచు కుమారుఁ బట్టు చె
ట్లీనిశి రోసరించి నిలు మోపు మదీయవధూటి వచ్చి నీ
కానకకన్న పట్టి కిడుఁ గాని ఘనస్తనదుగ్ధ మంచు స
న్మాన మెలర్ప నాడు మనుమానముతే కతఁ డోసరించినన్. 481

వ. పంతంబు చెల్లించుకొనుదాన నని చెప్పిన మణిమంతుం డమ్మాటలు కాఁపుకొడుకున
కెఱింగించె నెఱింగించిన. 482

ఉ. ఉండెదఁ జెప్పినట్లు నిలుపోపనియాఁకట నేడ్చి యేడ్చి య
క్కాఁడినవంటిపాఁపఁ డిపుడేమగునో మతిలేరు బిడ్డ లో
క్కాఁ డిదె వీఁడు నాకొడుకు గాఁడు భవత్తనయుండు సత్కృపా
మండన వీనిఁ బ్రోచికొనుమా యని పాలికిఁ డోసరించినన్. 483

క. అప్పలువచెలువ జారుని, దుప్పటిముసు కలవరించి తోరపుమురిపం
బుప్పతిలఁ గులుకునడలం, జొ ప్పేర్పడకుండ దనశిశువుకడ కరిగెన్. 484

తే. ఆరిగిపెరిగినయాఁకట నఱచి యఱచి, యేడ్పు విడువనితనపట్టి నెత్తి పట్టి
కులికి చన్నిచ్చి పొత్తిపొత్తుల నమర్చి, మగనికెంగేలఁ జెనకి యమ్మగువ వెడలె.

క. ఆలరితనమున లీలం, గేలం దనుఁ జెనకి చనినగిరికుచ తనయి
ల్లాలని తెలియక పరుని, ల్లాలని యారెడ్డిబిడ్డఁ డదరు విరాళిన్. 486

శా. రావే నల్లనిగుమ్మ నీవనుచు నారాటంబునన్ రెడ్డి నా
నావిభ్రాంతులఁ గుబ్బతిల్లునెడ దోన స్మీనకేతుండు కీ
ళ్వైచెం గొఱకచ్చులం బొడిచెఁ గాలం గేల మర్దించె నా
పోవ న్నమ్మెటఁ గొట్టెఁ దిట్టెఁ జిఱునిప్పు ల్రాల్చె నేత్రంబులన్. 487

క. చేసెదువలరాయనికై, కాసములకుఁ గాక జడిసెఁ గాపుంగొడు కా
లో సుదతిఁ దెచ్చుటకు ని, ద్రాసక్తుని మీఁటెఁ జన్నుద్రావెడుకొడుకున్. 488

క. మీటుటయుం మిట్టిపడి య,చ్చోట న్రుధిరంబు గ్రమ్మ స్రుక్కుచు నోడ లా
రాటపడఁ జంటిపాపఁడు, కాటుకకన్నీరు దొరుగఁ గావున నేడ్చెన్. 489

వ. అయ్యేడ్పు విని యిచ్చాపతి యుపపతి కిట్లనియె. 490

క. కొడుకుం గుట్టకుఁ జనుబా, లిడి నీతో రతులఁ బెనఁగ నేతెంచుచు నా
కడకేలం దాఁకించితి, గిడుదెర్లి కపుట్టి పొఱలఁగా మారెడ్డిన్. 491

చ. తమకమువుట్టి నేఁ డదికతంబున రెడ్డన నిద్రఁబోవులేఁ
గొమరుని నేడిపించె నదిగో తిరుగంబడి చ న్నొసంగి ర
మ్ము మఱల నంచు నన్నటకుఁ బొమ్మని నీవనుపం దృఢానురా
గమునఁ బ్రియంబుఁ జెప్పి నను గౌఁగిటఁ జేర్చి సుఖింపు దానికిన్. 492

శా. ఘోరం బ్రొచ్చెఁగదయ్య యాఁకటికి నీపుత్త్రుం డయో యింటి కిం
కా రాదా రెడిసాని యిట్లలుఱం గాఁబట్టఁగా వచ్చునే
దూరక్షోణి వసింపుచున్నసఁగఁబుత్తుం గూర్మినిల్లాల నీ
తూరిన్ లోపలికంచుఁ బల్కు మతఁడుండుం గొంది నంచాడినన్. 493

క. కలితనమునఁ జని యలనా, పలుకుం బంతంబు చెల్లుబడిగా పడ్డన్
గలసి యొకముడుపుఁ గైకొని, పిలిచిన నీకిత్తు నేర పెట్టుదు మగనిన్. 494

వ. అని యప్పు డప్పిసాళి పుణిసుంతుం దఱిమిన నతం డది పలుకుమన్నట్లు పలికె
నమ్మాటలు విని కర్షకుం డుత్కర్షింపుచు నిట్లనియె. 495

క. ఎడగలుగ నుండెఁ దనమే, న్వడకెడు పుఱిసులనంటివారము చనుబా
లిడుఁగాని పుణ్యమయ్యెడు, విడనాడక యిటకుఁ బనుపవే యిల్లాలిన్. 496

క. నావానిమాటలకు నో,లో వెడవెడ నగుచు నింటిలోపలి కలయి
చ్ఛావతి పోయెం బోయినఁ, గోవరపుంబ్రేమఁ గాఁపుకొడు కవ్వేళన్. 497

ఉ. కే లగలించిపట్టి రతికిం బిఱుబీకులు సేయ లోనుగా
కాలరిజంత నేఁజెడితి నమ్మక సిగ్గులవాఁడవౌదు నీ
యాలనె వింతదాన మగనాల నయో తెకతేఱ నన్నుఁ బ్రా
ల్మాలుపఁ జూచెదో తెగర మామగవార లెఱింగిరేనియున్. 493

ఉ. మేనికిఁ జేటుగాదె పులిమీసల నుయ్యెలలూఁగ మాను నేఁ
గానటువంటిదానఁ గొఱగానిపను ల్దలమీఁదవచ్చునే
రానిఁకఁజాలుఁ జే విడువరా యని సూత్త్మదశంబున న్సరో
జానన పల్కినన్ హాలికుఁ డాజగతాఁగకుఁ బ్రీతి నిట్లనెన్. 499

క. ఇటువంటిదాన వేలా, చిటిపొటికేంగేల నన్నుఁ జెనకితి నినుబా
యుట ప్రాణంబులఁ బాయుట, కుటిలాలక కరుణలేదకో యిట్లాడన్. 500

క. అని బాఁతిఁబాఁతిపెట్టిన, పెనుబ్రాతవరాలసోలఁ బెకలించి ఘన
స్తన కిచ్చి క్రుచ్చి కౌఁగిట, నెనయించెం బంచబాణుఁ డెసకొల్పంగన్. 501

క. అది యాత్తెఱఁగున నతనిన్, గదియంబడనిచ్చి సెఱపుగలదానిగతిన్
గుదులుకొను నేలబుసకో, త్సైద వను నేనెట్లు చేపడితి నను నపలున్. 502

క. పోవలె వడిగా వడిగా, లేవయ్యా ప్రక్కలోన లేకుంటే నేఁ
గావఁడు మగఁడని యలయి, చ్ఛావతి కర్షకునిఁ ద్రోచెఁ జదికిలబడఁగన్. 503

వ. కరాపాతంబుకంటె మున్నుగా లేచి యప్పలువచెలువ కన్నులసాం పామతింపఁ
జని విత్తమిచ్చి పంతంబు చెల్లెఁగదా యని జారుని నిజకరంబునం జఱిచి చక్కిలి

గింత పెట్టె నప్పుడు చతుర్ఘటికావశేషంబుగా రాత్రి చనియె దిక్కులు ప్రకాశ
ప్రతతిం బొందెఁ బిచ్చుకలు పిచపిచ మనియెఁ గాకంబులు గూకలిడియె దధిమ
థనఘుమఘుమధ్వానంబులు నెరసె గోవత్సకోలాహలంబులు వినవయ్యె నయ్యెడ
గృహంబు వెడలి పెరడు చొచ్చి వచ్చుటకు విహారభగ్నుంను బోయినఁ గనువేచు
కుని యుండి. 504

క. అపు డిచ్ఛాపతి యచ్చో, నుపవల్లభు నిలువఁబనిచి యోడక యిలుసా
చ్చి పొడవుగల మచ్చుపయిం, గపటవ్యాపార మమరఁగాఁ గూర్చుండెన్. 505

క. హాలికుం డాలోపల లో, పలికిం జనుదెంచి మచ్చుపైఁ దనయిల్లాల్
నిలిచిన తెఱఁ గెఱుఁగక యపు, డిలువెడలినబుద్ధి నిశ్చయించి కనలుతోన్. 506

ఉ. ఈలువు వంగడంబు గల దీజవరాలని యోలి రొక్కురో
క్కాలిడి యెట్టిజంకు తడక న్వరియించితి దీని నక్కటా
చాలు సహింప దీచెనఁటిసంగతి యొండొకమాయ పన్నియో
యాలరిజంతఁ జంపి సుఖినై యొకదిక్కునఁ బెండ్లియాడెదన్. 507

వ. అని హుమ్మని యాడుగటిచి మీసంబులు దీటుచుండ నయ్యండజయాన మచ్చు
డిగ్గ నతికి యెదుర నిలువంబడి యిట్లనియె. 508

ఉ. ఈలువు వంగడంబు గలదే మనుబోంట్లకు నీకుఁగాక రో
క్కాలిడి యిట్టిజంకుతడక న్వరియించుట రోఁతగాదె నీ
కేలసహింతు నన్ను మడియింపు మొకానొకచోటఁ బెండ్లిఁగ
మ్మాలనె నీకు నేఁ దగుదునా చను నీ కిటులాడ నిచ్చలున్. 5.9

ఉ. నిక్కము రెడ్డిబిడ్డవని నిన్మది నమ్మి గృహంబుఁ జేరి యా
దిక్కున నున్నశూద్రసుదతి న్మఱపిచ్చి రమించినాఁడ వి
త్తైక్యలిఱంకు నాకుఁ గలదే యని ముందలఁ బట్టి యీడ్చి యా
రక్కస దన్నె ముక్కు చెదరం జరణంబున వాని నెవ్వడిన్. 510

ఉ. తన్నిన వాఁడు తచ్చరణతామరసంబుల వ్రాలి నిన్ను నే
మన్నది లేదు నావలన నన్నియు నేరము లోర్చుకొమ్ము నా
పిన్నతనం బొకళ్లచెవిఁ బెట్టకు పెట్టిన సిగ్గువోవు నా
వన్నియ యసన్న మా నగరివారికి దండుగఁ బెట్టనిమ్మగున్. 511

. చెఱుపకుము కాఁపురంబని, పతిపరి యగుతాల్మి నట్లు ప్రార్థింపంగాఁ
గుఱఁగటి నేగుచుఁ దలవరు, లరిమురికర్షకునిమాట లాలించి తగన్. 512

. గిలుకలువైచిన గుదియలు, ఘులుఘుల్లున నూఁదికొనుచుఁ గదియం జని యా
హాలికునిఁ గొని చని ధరణీ, తలవల్లభుమ్రోల నిలుపఁ దప్పేర్పడఁగన్. 513

క. నరపతి దండుగఁ గొని య,ప్పురి వెడలం గొట్టె నపుడు భువనచరాదు
శ్చరియాలగు నీకు నుదా, హరణం బిది యనుచు వానరాగ్రణి చెప్పెన్. 514

వ. చెప్పి వెండియు బహుమానుండు. 515

క. తులువా నీయిల్లా ల,య్యలి వేణికిఁ దోడుబోయినది దానిమ్మృషో
క్తులకుఁ దెగఁజూచితివి నీ,తలద్రెవ్వను బొలిసిపోయెదవు తరువాతన్. 516

క. చేపడినసొమ్ము దూరం,బై పోయె న్మోసమయ్యె నని యంతస్సం
తాపమునఁ బొక్కి పొఱలకు, మీపాటిం బొమ్ము చాలు నింటికిఁ గ్రకచా. 517

క. క్రించామూర్ఖుని నిను ద,క్కించుట యన నెంత సింధుకీలాలమునన్
వంచింపఁబడదె మున్నొక,పంచక మభిజాతకమరవల్లభుచేతన్. 518

క. నావిని కాననచరగో, త్రావరు నీక్షించి పలికెఁ గ్రకచుఁడు నయవి
ద్యావైభవగుణసుభగం, భావుక వివరింపు మాయుపాఖ్యానంబున్. 519

ఆ. కుటిలుఁ డప్రయోజకుఁడు వీఁడు వీనితో, నేటిజోలి నన్నుబోఁటి కనక
వివరపుట్టఁజెప్పవే నిష్కళంకస్వ,భావ నావుఁ డలరి ప్లవగవిభుఁడు. 520

వ. క్రకచునకు నక్కథఁ జెప్పందొణంగె. 521

సీ. కలిగొట్టు మోఁదుగు కానుఁగు గలుగువావిలి మేడి నేరేడు సెలసు బలుసు
మఱ్ఱి మంకెన మద్ది మారేడు బూరుగు గోరంట లొద్దుగు క్రోవి రావి
జువ్వి మామిడి జీడి సురుగుడు మొలుగుపాపట చంద్ర పనిరిక పాల రేల
పొన్న బొట్టుగు పోఁక పొగడ దాడిమ మిప్ప గుముడందు గురువింద గోను రేన

తే. చిల్ల చింత మొగలి చీకిరే ఈూడుగ, నిమ్మ తమ్మ తుమికి నెమ్మి జమ్మి
వేగి వేము మొదలుగాఁ గల మ్రాకుల,కాన నగుచు నొక్క కాన మెఱయు. 52

చ. కరపుటికాంతరాళచులుకక్రమణాయితసింధుసర్వతః
పరివృతకృత్స్నరోదములు వాసిన దఘ్నటజాన్యపాణిజ
ద్ఝరితములై నభోగతికిఁ జాలక పల్వలము ల్భజించె నాఁ
గర మలరు న్సమగ్రబలకాయము లవ్వనికాలులాయముల్. 52

ఉ. ఆహృతజంతుభీషణబలాభ్యుదయాప్తి గుహాసురక్తి గో
త్రాహితవృత్తి వజ్రకఠినాతిశయాకృతి శౌర్యగర్వరే
ఖాహమికం బ్రసిద్ధరుచిరామృతపారణజంభదానవో
త్సాహవిఘాతిచందమునఁ దద్గహనంబునఁ గ్రాలుబెబ్బులుల్. 52

మ. చరణప్రాంతచరిష్ణువు ల్నిరుపమోచ్ఛ్రస్థానసంక్రీడన
స్ఫురణం జన్నఘనత్వమంద నరుదెంచుం గీడు మీ కంచు మ

త్సరబుద్ధిం బలెఁ జించుమేఘముల దంతత్రోటికోటిం జలా
హరణారంభణజృంభణంబులు దదీయవ్యాళశుండాలముల్. 525

మ. తనరశ్ముల్క విసంభవాండభువనధ్వాంతచ్ఛిదాచంచువు
ల్వినఁజెప్ప న్వెఱఁ గీమహాతిమిరపాళి న్వెచ్చిపోఁ దోలలే
వని రథ్యోత్థరజోదళ స్తిమితదీక్షాభోగుఁడై హేళిగ
న్గొన నగ్గోత్రతరాటవి న్మనునెలుంగు ల్గుంపులై వేసవిన్. 526

శా. పైపైఁ బ్రాణివధప్రధానగుణ మొప్పం గారగారద్యుతుల్
దీపింప న్విషమాంబకభ్రమిఁ బ్రభీతిం జేయ నత్యుత్కటా
టోపం బుగ్రగజాహృతివ్యసనకందూలంబుగా నుండుగుం
పై పంచాస్యము లయ్యరణ్యమునఁ బంచాస్యప్రకారంబునన్. 527

శా. క్రందై వెల్వడు ఘుర్ఘురధ్వనిమృదంగస్థాయిగాఁ దాలుని
ష్యందస్థూలవిశాలలాలసవరంబై యొప్పుశృంగోద్ధతిం
జిందుల్ ద్రొక్కఁ గుదుంగరంగముల నిస్సీమత్వరాతిభ్రమిం
బందుల్ దిజ్మృగయుచ్ఛిదాగుణపరిస్పందుల్ దదుగ్రాటవిన్. 528

క. అలఘుతరవారిధారా, దళితప్రతికూల సకలధరణీభృత్త్వం
బలమై యొకసెలయేఱు, ప్పొలమున జగదేకవీరుపోలిక నమరున్. 529

వ. అది రామలక్ష్మణాలంకృతంబై పంచవటస్థానంబును సత్త్వసంపన్నంబై సమీర
ణంబును గజగవయవిహారయోగ్యంబై కిష్కింధానగరంబును సుపానితపరమ
హంసంబై వేదాంతశాస్త్రంబును నఖండశబ్దక్రియానిరూపణంబై వ్యాకరణం
బును బ్రబోధితనిగమజాలంబై ధర్మంబును ఘనరసప్రధానంబై విద్వత్ప్రి
బంధంబు ననుకరించిన యమ్మహాప్రవాహంబున. 530

క. నీతికళానిధిగలఁ డభి,జాతుం డనుకమఠవిభుఁడు సంతతపంక
స్థాతృత నొందియు నద్భుత, మాతం డేవంకఁ బంక మంటక తిరుగున్. 531

శా. ఆతాఁబే లొకనాఁటిరేయి ధరణీవ్యాపారలిప్సాపరం
బై తానంబులఁ బాసి తీరశరత్పుణ్యావీథుల న్నిల్వ భూ
జాతచ్ఛాయలశీతలానిలకృతాంచద్వాలుకాలేఖికా
వ్రాతాభ్యగ్రముల న్విశృంఖలగతి న్వర్తించె వర్తింపఁగన్. 532

చ. అటిమిటి చిచ్చు నాఁ బొగులు నాఁకట బ్రుంగుడువంగుడై యొడల్
సుఱసుఱ స్రుక్క నయ్యడవిలో నొకనక్క తటస్ఫుటంబులన్
బొటియలఁ దోఁకఁ జొన్పి వెలిభూమికిఁ దార్చిన యొండ్రితండముల్
గొఱుకుచు వచ్చి వచ్చి యలకూర్మముఁ గాంచి ప్రహృష్టచిత్తమై. 533

క. ఘనరభసంబునఁ గదియం, జనునపు డక్కమఠవిభుఁడు స్వగతంబున ని
ట్లని తలఁచె నిష్ప్రమదుఁడ, ననియుండుదు నేఁటితుదకు నది బొంకయ్యెన్. 534

ఆ. సకలదుష్టజంతుసంక్రాంతజలదుర్గ, సీమనుండు వెట్టచెట్టలేక
చెడుగుఁబాము గాముచేఁ బెద్దమీనుచే, నీరుకుక్కచేత నెగడుచేత. 535

ఆ. రొయ్యపుర్వు గ్రొవ్వి రోధోవసుంధర, కెగసి తెగినపగిది నిట్టులేల
జలతలంబు విడిచి చనుదెంచి నా బుద్ధి,పుర్వుమేయఁ జెట్ట బొందఁ గంటి. 536

క. కాలంబు దాఁట నెవ్వరు, చాలుదు రని యగచి నిరవసాదవిషాద
జ్వాలం దూలి కబంధచ, రాంకరణంబు వపురుపాహితకంబై. 537

క. రాతింబలె నతినిశ్చల,రీతి న్నిలుచుటయుఁ గని గరీయఃతృష్ణాబ్ధా
ధాతురకృశంబు జంబుక, మాతతదంష్ట్రికలఁ గచ్ఛపాగ్రణిఁ బట్టెన్. 538

క. పొదివి తెకతేఁటఁ గలిగెం, గద నాకీకమ్మతేనెకరుఁడని దానిన్
దుదకోఱలు కొఱలుపోఁ, గొదలే కటునిటుఁ బొరల్చి కొఱుకుచు నుండెన్. 539

క. విఱుగుట గానక నెఱయం, దఱతఱకలుపాఱఁ గొంతదడ యది గొఱికెన్
గొఱికిన నాగులదు పసులదు, చిఱుమొఱకలుపోయెఁ బుల్ల నిలె దంతంబుల్. 540

వ. ఇట్లు మృగధూర్తదశనదంశననిర్వ్యాళకలితమర్మంబై యక్కూర్మంబు తనలో
నిట్లని వితర్కించె. 541

చ. జరుగదు రోసి పో విడువఁజాలదు వేసటలేక కోఱలం
గొఱికెడు దీనికేమితుద గోరము వాటిలె నాయుపాయ మం
దఱుఁ గొనియాడ నిచ్చనఁటినక్క దటాలునఁ డక్కుఁ బెట్టి యే
మఱక ననశ్వరం బయినమన్గడఁ గాంచెద నీరుసొచ్చెదన్. 542

క. అని నిశ్చయించి ధీర,త్వనిరూఢుం డగుచుఁ గమఠవరుఁ డానక్కన్
గనుఁగొని యిట్లను నేలా,తను వలయన్ మల్లిపోయెదవు పిసవెఱ్ఱిన్. 543

క. మఱవక యేఁడులుపూఁడులు, గొఱికిన నాయొడలు మృదువగునె నీకేలా
వెఱవిడిచందము పుట్టెన్, దరిదీనికి వెరవుఁ జెప్పెద న్వినుమర్థిన్. 544

క. నానకమృదుమార్గమునకు, రానేరదు మేన నీచరణ మనఘా నా
పై నునిచి యేతదంబు, స్థానములోఁ బెట్టు కొంతదడ పట్లయినన్. 545

క. చెన్నార నపుడు చేసిన, వెన్నవలె న్మెత్తనగుగు విపులవపాఃసం
పన్నము సుమ్మీ తను వాఁ, కొన్నమహాత్మునకు నీకు గుడువఁగవచ్చున్. 546

క. తనివిసనఁ దినకపోవని, మనమునఁ దలపోసి రోసి మనుగడపై నీ
కనువైనవెరవుఁ జెప్పితి, నని కూర్మప్రవరుఁ డాడె నట్లాడుటయున్. 547

అప్పలుకులు సిద్ధాంతీకరించి యవ్వంచకం బట్లచేసెఁ జేసి ముహూర్తమాత్ర మూర
కుండఁడ యయ్యభిజాతున కిట్లనియె. 548

తడవయ్యె నీటిలోని, న్నిడి మే నేమైన నానెనే తనివిసనన్
గుడువవలె నిజముఁ జెపుమా, జడియక నీ వనిన వారిసత్త్వము తనలోన్. 549

ఈవంచకంబు నామా, యావాగురఁ జిక్కి దక్కి నసుపంచకమం
దావిర్భూతోత్కలికా, ప్రావృతమై యపుడు కచ్ఛపం బిట్లనియెన్. 550

ఆసమోదక మంటఁగ నా, నె సమృద్ధము లంగకములు నీపాదము క్రిం
దిసుమంతనాన దెవ్విధి, మెసవెదు నీపంటి కెట్లు మృదువై యుండున్. 551

మెత్తనగుఁగాని శీఘ్రము, గుత్తముగా వెన్న ద్రొక్కకొనియున్నపదం
బెత్తుము నీరంటఁగవలెఁ, జిత్తము సుఖపారణావశీకరమైనన్. 552

పోఁగుఁగఁబో యీ వాఁకట, జాగేమిటికంచుఁ బలుక సంతుద్బాధా
జాగరణబుద్ధి జంబుక, మాగోచరుమాట నిశ్చయము పో మ్మనుచున్. 553

పై దారుణముగ నూఁదిన, పాదము దివియుటయు గచ్ఛపము సంతోష
ప్రాదుర్భావప్రాప్తము, హాదంచద్వేగ మగుచు నురువడిఁ బఱచెన్. 554

క్రకచా యీచాడ్పువన, క్కఁవ మోసము గల్గియుండెఁగా మఱి నినుబోఁ
టికిఁ దగులు టెంత యని కీశకులాగ్రణి చెప్పి మఱియుఁ జలచరుఁ బలికెన్.

వెడమాయనక్కమాటల, కడవికిఁ జని తిరిగి వచ్చి యప్పటియుం దా
నడవిఁ బడి బడుగుహారిచేఁ, గడతేఱినగర్దభమ్ము గాఁ జూమ్ము శఠా. 556

అనినవిని శింశుమారుఁడు, వనచరు నీక్షించి యింత వాఁడవు గాకుం
డిన ముదిసి ముప్పుదను కా, మనుదే యిది తెలియఁబలుకుమా వినవలతున్. 557

అని యడిగిన బహుమానుండు. 558

సీ. కల దొకదుర్గాంతకాంతార మరవిందబంధుఘృణ్యంతర్ధిపాదపంబు
దీర్ఘదంష్ట్రాభిఖ్యఁ దేజరిల్లుమహోగ్రసింహ మచ్చో నివసించియుండు
దానికి ఘటకాభిధానజంబుక మొకం డహరహం బాప్తకృత్యము లొనర్చు
నట్లు కొండొకకాల మరిగినఁ గర్మానుకూలత నసదృత్తుకుక్షిరోగ

తే. మస్పృణతరవేదనాకంపమాన మగుచు, వెగ్గలంబైనధృతి జారి యగ్గజారి
పొఱలు వాపోవు నలమురుఁబొక్కు స్రుక్కుఁ, బొరగిలఁబడు నిట్టూరుపులు నిగుడ్చు.

క. ఈరీతిఁ గడుపునొప్పిం, గూరాకై యుడికి గోఁడు గుడుచుచు నుండా
లారి యొకనాఁడు నిజర, క్షారససంఘటకుఘటకుఁ గనుఁగొని పలికెన్. 560

చ. తన దెసఁ జూచినాఁడ వక దా ఘటకా కటకాంతభూమికిం
జని మతిగోపనం బమరఁ జంపి శరీరము వ్రచ్చి లోపలం

గనుఁగొననైన గర్దభముకందనగాయ గ్రహించి తెచ్చి యి
చ్చి నిలుపుపాసిపోఁ జలిదిఁ జేకొని యుండెడు జీవితంబులన్. 561

చ. తడసినఁ జత్తుఁ బొమ్మనినఁ దచ్చరణంబుల సమ్మదంబునం
బడిపడి లేచి యప్పనికిఁ బొల్పడి జంబుక మేగి యొక్కచో
గడుకృశమైనదాని నొకగర్దభముం గని చేరి యిట్లనున్
బడలితి వేల రాసభ శుభంబగు నాకెఱిఁగింపవే యనన్. 562

వ. గర్దభంబు జంబుకంబున కిట్లనియె. 563

క. చాకలవాని కధీనమ, నై కోకలు మోసి తెత్తు నాపణవీథి
వ్యాకీర్ణప్రీహితుష, స్వీకృతి మేన్ బ్రోతు నెట్లు చిక్కకయుందున్. 564

క. కొనఁ గననిపాపకర్ముఁడు, తనునాహారాధివిధులఁ దనుపఁడు మేయన్
జననీఁడు కాలుఁగట్టు, న్ననుటయుఁ జచ్చుటయుఁ గాదు మద్విధ మనఘా. 565

ఉత్సాహ. మేను పొందుగాదు లేదు మేను సౌఖ్య మక్కటా
జైనవానిచేతిపేనుచందమైతి నంచు న
మ్రాననంబుతోడనున్న నాత్మ లేని నెయ్యమున్
గానరాఁ జెనంటిజంబుకంబు దాని కిట్లనెన్. 566

మత్తకోకిల. కాఁపుఁ గుంటివి గావు బీఁకువు గావు గర్దభముఖ్య నీ
కేలయి వ్విధి నెవ్వచేఁ గృశియింపఁబోదము రమ్ము మ
త్కేళికాననశాద్వలంబులఁ గ్రీడసల్పఁగ మత్త్యసే
వాలఘుత్వము చాలు నీకు నవారివారితృణావళుల్. 567

క. అని చెలువు గులుకుపలుకుల, మనమూఱించుటయుఁ దేఱి మనుజానధీనం
బున నున్కి కష్టమని ఖర, మనయంబై నక్కబడి మహాటవి కరిగెన్. 568

క. అరిగినఁ బరిచితపటుసం, భరమున్ ఖరము న్వ్రముక్తబలగర్దభశే
ఖరముం గురవము ఖరమున్, హరిపాలం బెట్టె నక్క యక్కటికమునన్. 569

క. నెఱిసరిగ దానిపైఁ బడి, కఱవన్ లాఘవములేమి గాళ్ళీడ్చుచు న
డ్వేఱుపం గదిసిన నత్తెఱఁ, గెఱిఁగి ఖరం బదరి తిరిగి యేగుచు నుండెన్. 570

క. గునుకెత్తుచున్నగాడిదె, గనుఁగొని సింహంబు పలికె ఘటకునితో నీ
చనుఖరము దరిమికొన నా, తనువున వడిలేదు తెమ్ము దగ్గఱఁజేరన్. 571

చ. చనుమన వట్లకాక యని జంబుక మప్పుడు గర్దభంబుఁ జే
ర నరిగి యేలపోయెద కటా వసనంబులమోవ బస్తులన్
వనరఁగ వేడ్క యయ్యెడినొ వర్ధిటువంటికుబుద్ధు లివ్వనం
బునఁ గొన మేఁపు నీళ్లు గలవో పతిమన్నన నీకుఁ జాలదో. 572

వ. రమ్మనిన గర్దభంబు జంబుకంబున కిట్లనియె. 573

కేసరినగ కుద్యోగముఁ, జేసిన నగ్గమక మెఱిఁగి చెలికాఁడా సం
త్రాసమునఁ దలఁగి వచ్చితి, గాసిలి ప్రాణములు తీఁపుగా యెవ్వరికిన్. 574

నావిని ఘటకుం డనుఁ దగ, వా వెరవఁగ నధిపుఁ బట్టివాఁడా నిను సం
భావించుట కిట్లొరయం, గా వచ్చుట యిందుకేల గళవళమందన్. 575

తవతవ గ్రొత్తక్రొత్త యగుటం జనియించెను నీకు నేఁడు రే
పవుటయు మమ్ము నీరఁ జనువంతయు నీయది కొంక నేల ర
మ్మవసర మిప్పు డంచుఁ జను నాఖరము న్మరలించి తెచ్చి గో
రవగుణ మెక్క నక్క మృగరాణ్నికటంబున బెట్టెఁ బెట్టినన్. 576

కలుషకలుషనఁ గుత్తుకఁ గఱిచి విఱిచి, నక్క నక్కఱఁ జీరి కుండాలవైరి
గర్దభము కుక్షిభేదించి కర్ణహృదయ, ముదయ దాహ్లాదమున దివ్వ మోపననక.

ఏను సెలయేటిజలంబు లానివచ్చెద నని చెప్పి యాడు గామడగా నరిగిన. 578

ఖరశరీరము విప్పగా గొప్పలగుదంతకుంతసంఘంబులఁ గ్రుచ్చి క్రుచ్చి
మృగధూర్త మాకర్ణహృదయంబు భేదించి యది యనర్ఘ్యం బగు టెఱిఁగి కాదె
యతులరంహము సింహ మాశించె భక్షింప నత్యాజ్య మివ్వస్తు వనుచుఁ దాన
భక్షించి పరిశుద్ధుపగిది నూరకయుండె నపుడు కంఠీరవ మరుగుదెంచి

కొనవలయు నౌషధంబు దెమ్మనినఁ గొంకు, కొసరులే కది పలికె నోకుంభివైరి
గర్దభాకారమున లేదు కర్ణహృదయ, మదియ కలిగిన నిన్నేల కదియవచ్చు. 579

అని నక్క తక్క కిట్లాడుమాటలు యథార్థీకరించి యాదల్పఁ దెరవులేమి
నుడిగెఁ గేసరి యూరకుండెన ట్లాపంచకము మహాకపటవాక్యములు నమ్మి
గహనమండలి సొచ్చి క్రమ్మఱ మఱియు నేతెంచి దుర్వ్యాధితద్విరదవైరిఁ
జేరి తద్దంష్ట్రిలదోరినఖరముగాఁ దలఁపకు నన్నని బలిముఖుండు

తే. పలుక నేమియు ననక యజ్జలచరుండు, లబ్ధనాశవ్యథాజాతలఘుగుణోత
రావిలపిపాస దీఱ నీ రానిచనియె, నద్భుతత్వరతోడ నిల్లాలిఁ జూడ. 580

అని విష్ణుశర్మఁ డాదరమునఁ జెప్పినరాజసుతులు ముదమున గురునిన్
గనుఁగొని పంచమతంత్రం, బనఘా మాతోడఁ జెప్పుమని యడుగుటయున్. 581

మ. అతి హృద్యోద్బద్ధ్రిపమోహ భక్తినతదివ్యవ్యూహ విధ్యార్జిత
క్రతుపుంజార్చితపాద వర్ధితపటుప్రహ్లాద పుణ్యవ్రతా
యతనాధ్వన్య జగత్త్రయీభరణవిద్యాధన్య త్రయ్యంతకీ
ర్తితపీతాంబర కృత్తిధారణశుగాధివ్యాధినిర్వారణా. 582

క. ఆదృతశుకముక్తిమహో, పాదపకిసలాయమానపదయుగనానా
వేదశిరఃప్రసవప్రా, సాదవ్యాపారదీనజనమందారా.

మాలిని. హరిముఖసురమౌళిన్యస్తపాదాంబుజాతా
పరహితరతధామప్రాంతయుక్పారిజాతా
పరుషతరవిలోకప్రాంశుధూతారిజాతా
చరణశరణరక్షాజాగరూకైకచేతా. 584

గద్య. ఇది శ్రీవేంకటనాథ కరుణాలబ్ధసరససాహిత్యనిత్యకవితావిలాస సకలసుకవిస్తుతిభూషణోల్లాస రాజకులపారావారపర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గపరిశ్రమణ ధైర్యపర్యాయధిక్కృతనీహారపర్వతరాజకుమార నిస్సహాయప్రబంధనిర్మాణ భోజభూదార సుధామధుర భారతీసనాథ వేంకటనాథప్రణీతంబైన పంచతంత్రంబున లబ్ధనాశం బన్నది చతుర్థాశ్వాసము.

---

శ్రీ రస్తు.

# పంచతంత్రము

## పంచమాశ్వాసము



హిమగుప్రియతనయా

మోహాస్నేహావలోకముగ్ధభ్రమర

వ్యూహాసముహాస్యసిద్ధ

వ్యాహృతిమధుముఖసరోజ హరిహరనాథా. 1

వ. దేవా యసమీక్ష్యకారిత్వాభిధానం బగుపంచమతంత్ర మాకర్ణింపు మధీతనీతిశా
స్త్రమర్మం డగువిష్ణుశర్మండు సుదర్శనకుమారుల కిట్లనియె. 2

క. అపరీక్షితం బకార్యము, సుపరీక్షిత మభిమతంబు సురి మ్మెవ్వరి క
య్యపరీక్షితవిధిఁ గాదా, యుపతాపము పుట్టె విప్రయువతికిఁ బతికిన్. 3

క. నావిని రాజకుమారకు, లావిప్రునిఁ జూచి పలికి రది వీనులవిం
దై వెలయఁగ నీకథఁ జెప్పు,మా వినియెద మనిన వారి కతఁ డిట్లనియెన్. 4

సీ. గౌడదేశంబునఁ గలఁ డాగమాభ్యాసజడుఁడు విప్రుఁడు దేవశర్మ యనఁగ
నతఁడు సోమసుధాత్మసుత యాజ్ఞసేని నాఁ బెంపొందుకులకన్యఁ బెండ్లియయ్యె
సంతులే కలశరజ్జలజలోచన తాయి గన్న తాతికిఁగుండు గన్నగుంటి
కెఱఁగుచు మఱుగుచు నెవ్వరే వ్రతములఁ జెప్పి రా వ్రతములఁ జేకొనుచును

తే. సుతులఁ గనిపెంచుగరితలఁ జూచి యేచి,యిచ్చ ముచ్చట నొందుచు నిట్టులుఁ
గొంతగాలంబు వోయిన గొడ్డువీగి, కాంతిజితహేమసుమగర్భగర్భమరో

సీ. ఓఁకర బలిసె జిట్టుములసందడి మించెఁ గలకవా ఱెఁగపోలఫలకయుగ
బుద్ధిమృద్భక్షణంబునకు నువ్విళులూఱె రశ్మిచామనమేన అచ్ఛజే
గాళిమ గుఱకుచాగ్రములఁ బాళెము డిగ్గె గార్శ్యంబునకు గోసె
నిద్రారతిప్రీతి నత్రంబులకుఁ గల్గె మురిపంబు ముంగర మో

తే. నరుచి యాహారసుఖముల నడ్డగించె, మధురరుచులకు నెదురెక్కె మానసంబు
నిర్భరశ్రాంతి నడకల నెవ్వరోనియె, నక్కఁ దంగేత్కఁ తాకిఁ జీర చిక్కటయు

క. ఈలక్షణములలీలన్, జూలాలై యున్న జాయ సుగుణనికాయన్
వేలాతీతప్రీతిం, బాలితనిజగోత్రసమితిపతి యిట్లనియెన్. 7

క. దైవముకృప గలదానవు, గా వంధ్యాత్వంబు వీడెఁ గా నీతికళా
కోవిదుఁ డగుసుతుఁ గనియెదు, గా వంశము వృద్ధిఁబొందఁగా నా కనుచున్. 8

క. మనోరథంబునం బొ[illegible] గని [illegible]ంగంబున ఘటప్రతిభట స్తని
యిట్లనియె. 9

క. బహుళమనోరథభీషణ, గహనంబునఁ జిక్కి వెడలఁ గాననినీచో
త్సాహనుఁడు చనుసత్తురజః, పిహితుం డగుసోమశర్మపితచందమునన్. 10

క. నావిని దేవికి విపులా, దేవుం డిట్లనియె గుణవతీ యెట్లెట్లూ
నీవీకథ నాతోఁ జెపు,మా వినియెద ననినఁ బతికి మానిని పలికెన్. 11

సీ. కలఁడు దాశార్ణభూతలమున నత్యర్థసారశర్ముఁడు సోమశర్మ యనఁగ
నతనికి నెనమండ్రుసుతు లందులో నగ్రపుత్త్రుండు పిత్రన్నభోక్త వాఁడు
కడుపారఁ గృష్ణపక్షశ్రాద్ధమున నొక్క భూమినిర్జరుగృహంబున భుజించి
యొకసక్తుఘటము పైతృకకర్తచేఁ గొని చని విజనప్రదేశమున నిలిచి

తే. ఘటము గలయంపిగా నీరు గావిపంచెఁ, బఱచి శయనించి యెలుఁగు గాఁ బాణి నిలిపి
యాత్మ లరమోడ్చి ధనవృద్ధనై చరింతు, నని దురంతోద్యమంబున నతఁడు దలఁచె.

అవన నీసక్తు పమ్మెద నమ్మి యొకమేఁక గొనియెదఁ గొనకొని కొనిన మంద
నేకేట నొకరెంటి నీనెడునవియును నవియు వానికిఁ బుట్టినవియును నీన
బహువత్సరములకు బహుసహస్రంబులై నెగడెడువాని నన్నింటి విలిచి
సంతరించెద ధేనుశత మది పెట్టినకోడెలచే ధారఁ గొనిన చేల

తే. విరివిగాఁ బైరు విత్తింతు వేళ్ళుగొలుచు, గాఁగ మామకసస్యము ల్గడుఫలించు
పంటకొలుచమ్మి కూర్తు నపారధనము, ధనికుఁ డనినాకు నొకఁడిచ్చుఁ దనకుమారి.

క. దొడ్డతన మరసి యీక్రియ, గడ్డాయం బనిన విప్రకన్యకవలనన్
గొడ్డకొకసుతునిఁ గని యా, బిడ్డని మాసోమశర్మ పేరే యిడుదున్. 14

క. ఆయర్భకుఁ డూర్జితగతి, హాయనపరిమితవయస్కుఁ డగుఁ బోషింపన్
సాయంతనమున గృహకా, ర్యాయత్తమనీషభామ యబ్బాలకునిన్. 15

క. కరుణ[illegible]ఁ దనచంక నిడుకొని, యరుగక యటువైచి పోవు ననునాలో భూ
సురుఁ డీపన్ని[illegible]భరముద్రితనయనుఁ డగుచు మఱియాలోనన్. 16

క. ధేనువు లేతెంచిన నటు, లైన న్వడ[illegible]
వీని నిటువైచి పోఁదగు, నే నీచంకకు ఘటంబె నిసువానుకొనన్. 17

క. అని కలవరించి లగుడముఁ, గొని త్రిప్పుచు నిక్కువంబు కులసతి యనుచున్
జెనఁటిధరాసురుఁ డాగ్రహ, మున సక్తుఘటంబు భిన్నములుగా వైచెన్. 18

హార్ణ పాండూకృతుండును విషాదవిహ్వాలుండును నయ్యె నిది మనోరథరాజ్య
ఫలం బనిచెప్పి యప్పల్లవాధర సుముహూర్తంబునఁ గుమారుం గాంచి
ముదిపసంబున. 19

తేనికుమారునిఁ, బొత్తుకలో నునిచి గూర్చిఁ బురుషుని రక్షా
కి నియమించి ధరా,భృత్తులితో రాజ జననిగృహమున కరిగెన్.
ఁ బెంపుడునకులము, బాలునకుం గాపువెట్టి బ్రాహ్మణుఁడు నికే
దమునకుఁ జనియెం, గాలోరగ మపుడు బిలముఖము వెలంపడుచున్. 21

సామిసురతనూభవు, తలిమంబునఁ బఱన నూర్జితక్రోధసమా
నకులము చిలుపన్, బలువాతన్ గఱచి ద్రుంచి పాఱగవైచెన్. 22

యంబున న్మహీసురాగ్రణి పుత్త్రుఁ దలంచి గాఢసం
ము పేర్చి లోఁగిటికి గ్రమ్మర వచ్చుచు నుండఁ జూచి యు
సం బెలర్ప నకులంబు ఫణిస్రవదస్రపంకసం
క్రమై యెదురఁ బర్వి పదాబ్జములం బెనంగినన్. 23

భుజంగముక్షతజపంకవిలిప్తముఖంబు నమ్మహో
ముఁ జూచి భూమిసురుఁ డాహతభీతపరీతచిత్తుఁడై
గడెసేపు రిమ్మగొని యుండి పదంపడి తేటి నిష్పరీ
ఁ డసమీక్ష్యకారియును గావున రోషవశుండు గావునన్. 24

ము చంపె న్వదనము, చెప్పకచెప్పెడును రక్తసిక్తంబయి నా
కలువోలెఁ గలిగిన, యిప్పాపని దీనికేన యిచ్చితి మెసవన్. 25

టు మీర కస్మి, త్సుతుదగ్గఱఁ గాచియుండఁజూచిన నీదు
వచ్చునె నావత్సిత, పుతిగూల న్నకుల ముచితమా కావలికిన్. 26

కన్నుల జేవుఱుగీ, లోన లగుడం బెత్తి విసరికొట్టిన వెలికిన్
గుడ్లు వెడల నొప్పిం, బనివి యహో నకుల మపుడు ప్రాణము విడిచెన్. 27

లముఁ జంపి పోయి సదనంబున భూమిసురుండు గన్గొనం
ముడుంగుపానుపునఁ జెక్కుచెమర్పక యున్నపుత్రికన్
టభుజంగభంగములఁ బ్రాంతమునం గని తెచ్చుఁబోయి యే
నటు నేసితిం గలువరించి యయో నను రోయ నుత్తముల్. 28

యుదరతాడనంబుఁ జేసికొనుచు బ్రాహ్మణుం డుచ్చైస్స్వనంబున రోదనంబు
ఁందొడంగె నక్కలకలంబు చేరువఁ బుట్టినింటనునికింజేసి యాకర్ణించి యాజ్ఞసే
గృహంబునకు వచ్చి బ్రాహ్మణేశ్వరు నాలోకించి. 29

ఖండ లైనపాము, కడిది కడుంబ్రేమఁ బెంపఁగా రాజిలుపెం
నకుల మేలపాలిసెం, దడయక నీ కేటికేడ్చెదవు చెపు వనఘా. 30

ఉ. నావిని బ్రాహ్మణుం డనియె నన్నుఁ బ్రయత్నము మెలర్పఁ బట్టికిఁ
గావలిఁబెట్టి పుట్టినిలు గాల్పఁగ నీవటుబోవ నేను నా
లో విపదంబు మాలి మృగలోచన ముంగిస నే కిశోరర
క్షావిధి కొప్ప నేర్పఱిచి జాతిని మందిరబాహ్యభూమికిన్. 31

క. ముంగిసయును మున్నియోగము, నం గదలక కాచియుండ నందను నాలో
నం గాలసర్పముండ, రం గని ఫణిదీయపుత్త్రరక్షాబుద్ధిన్. 32

క. అలఁ గొఱికి నఱికి భుజగ, జ్వలదస్రరసాతిరక్తవదనముతో ద
వ్వుల కెదురువచ్చి నకులము, కలకంఠి పెనఁగదొణఁగెఁ గాళ్ళన్ వ్రేళ్ళన్. 33

తే. అపుడు పన్నగరక్తసిక్తాననంబు, బభ్రునేత్రంబుఁ గని గుండె పగిలి నాగిలి
తనయు నిర్జించెనొకొ నేటితాళి మనుచు,నువిద లగుడాభిహతి దీనియసురుఁగొంటి.

క. ఈయుగ్రాఘం బేమిటఁ, బాయు నిశాచరుఁడఁ గాక బ్రాహ్మణుఁడనె యం
చాయన యేడ్చుచుఁ జెప్పిన, నాయిభనిభయాన ఖిన్నయై మూర్ఛిల్లెన్.

వ. మూర్ఛిల్లి యెట్టకేలకుం దెలిసి కన్నీరు కరతలంబునం దుడిచికొనుచు సతి పతికి
గద్గదస్వరయై యిట్లనియె.

క. సుపరీక్షితము సుదృష్టము, సుపరామృష్టంబు మఱియుఁ గుశ్రుతముం గా
నిపురుషుఁడు నాపితుని క్రియ, నపరిమితాపత్పరీతుఁడై చెడిపోవున్. 37

క. అనిన విని భూసురుఁడు సతిఁ, గనుగొని యోవంశపాలికా! మంగలి యే
పనిఁజేసి చచ్చె నీకథ, విననిష్టం బయ్యెఁ జెప్పవే నాకనుడున్. 38

వ. యాజ్ఞసేని యిట్లని చెప్పందొణంగె. 39

చ. జడమతిభార్య యొక్క సెటిసాని విదర్భనివీటనుండి సాం
పడరఁగఁ గర్భలబ్ధిఁ గడుపై కడుఁబైకొనుదండినొప్పులం
బడి యది పుత్త్రుఁగాంచి పిదపం బరలోకముఁ జేరె నంతలో
నడల దొడంగె నాకటికి నారసి చన్నిడలేమి బాలుఁడున్. 40

చుట్టంబులు పక్కంబులు, కట్టడియై వీఁడు తల్లిగండము తలగా
బుట్టె నపలక్షణుం డికఁ, గట్టా యెవ్వారి జెఱుపఁగా నున్నాఁడో. 41

ఆ. ఇంట నుండఁగూడ దిప్పుడ గొని చని, గుంటనైనఁ బెద్దకుంటనైనఁ
బెంటనైన వైచి యింటికి వచ్చెదం దెచ్చి నన్నుగుక్తు లాలకించి. 42

క. ఆయింట్లఁ గూలి కుప్పట, లాయము గా నిరవధీనయై మనువొకవ
ర్షీయసి వేఁగినసుదిలో, బాయనితమి మ్రొక్కి నిలువఁబడి యిట్లనియెన్.

ఉత్సాహ. కన్నవారివంకవారిఁ గానఁ బ్రాణనాథుఁడున్
మున్నెచచ్చె యేను గుంకముండ నెట్టు లేగుదున్
మున్ను వెన్క లేదు నేఁడు మూఁడుగాళ్ళవృద్ధనా
యన్నలార వీని నీరె యంచు వేఁడి మ్రొక్కినన్. 44